

### సొంత గొంతుకతో....

25–3–83 ఆంధ్ర పచిత్ర వారపత్రికలోని "కొత్త గొంతుకలు" శీర్షికలో ఇంద్రగంటి శ్రీకాంతశర్మ కవిత్వం గురించి పరిచయంచేస్తూ శ్రీ టి యల్ కాంతారావుగారు ఒక మాట అన్నారు

" శ్రీకాంతశర్మగారు అనుభూతివాదాన్ని సమర్థించినవారు నాకైతే ఈ వాదం చాలా విచిత్రంగ ఉంది " అని కొత్త గొంతుల గురించి పరిచయంచేస్తూ, విప్లవాత్మకమైన ఆయన సొంత గొంతుకతోనే రాయడం నిజంగ హర్షించదగిన విషయం కాంతారావుగార్కి నా అభినందనలు, "నొప్పింపక తానొవ్వక" అనే బాణిలో చెప్పక పోయినందుకు దీనివల్ల కొత్త గొంతుకల విశిష్టత బాగా తెలుసుకోగలరు ఈ శీర్షికని ప్రవేశపెట్టినందుకు కృతజ్ఞతలు

తమ్మేటి రఘోత్తమరెడ్డి (గోదావరి ఖని)

### ఏ జాతి నాగరికతో?

18–3–83 సంచికలో ఏ రేవతిగారి ఏ జాతి నాగరికతో కథ బావుంది పోతే ఎదురింటి దొరసానివి మొక్కల ఆకులను కత్తిరించినంత మాత్రాన 'కసాయిదానికి' అనడం సమంజసంగా లేదేమో!

యల్ శ్రీనివాస్ (భువనేశ్వర్)

## విద్యార్థి లోకం
## వ్యాసరచన పోటీ

ఈ పోటీకి స్వీకరించిన వ్యాసాల రచయిత [త్రు] లందరికీ ప్రత్యేకంగా కానుకలు ఇవ్వగలమని ప్రకటించాము కానుకగా ఇచ్చే వస్తువులు మాకు ఆలస్యంగా అందాయి! ఈ ప్రకటన వెలువడే సమయానికి కానుకలు పంపడం మొదలవగలదు ఆలస్యం అయినందుకు చింతిస్తున్నాము రచయితలూ, రచయిత్రులూ కానుకలని మా అభినందనతో స్వీకరించగోరుతాము

సంపాదకుడు
ఆంధ్రపచిత్ర వారపత్రిక

### న్యూఢిల్లీ లేఖ

"న్యాయం కావాలి" రాధిక ముఖ చిత్రంతో వెలువడిన 11–3–83 వారపత్రిక మా హృదయాలపై పండు వెన్నెల కురిపించినది నాటి పత్రికలోని "డోలాయమాన స్థితిలో ఉన్న సమాజం" న్యూఢిల్లీ లేఖలో డాక్టర్ జయ్.దుబాషిగారు వ్రాసిన విషయాలు అందరినీ చదివించేలా ఉన్నాయంటే అతిశయోక్తి కాదేమో? మీరు ప్రచురిస్తున్న ప్రశ్నావళి, డాక్టరు సలహాలు శీర్షికలు బావుంటున్నవి

అడబాల సీతామహాలక్ష్మి (దొడ్డిగుంట) ★

త్వరలో ప్రారంభం!

కొత్త సీరియల్ నవలు

# ఇది మేఘసందేశమూ...

రచన.

వక్కలంక పద్మావతి

*

# అతడు అడవిని జయించాడు

రచన·

డాక్టర్ కేశవరెడ్డి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు

[1938–1972]

శుక్రవారం 29–4–'83

రుధిరోద్గారి నామ సం చైత్ర బ విదియ

**సంపుటము 75 సంచిక 35**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 1-50 |
| ఆరు మాసాల చందా | రు | 42 90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 85 80 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





# అన్నిటిలోనూ కమీషను తీసుకోవటమే ...

బంగారానికి సంబంధించినది ఏదీ హేతుబద్ధంగా ఉండదు ఇంతకన్నా తక్కువ హేతుబద్ధమయినది "నల్లబంగారం" లేదా "చమురు" లేదా "పెట్రోలు" ఎన్నో సంవత్సరాలుగా ఈ పదార్థం పీపాకి రెండు డాలరుల చొప్పున అమ్ముడుపోయింది— అంటే, టన్ను షుమారుగా రు 120 పటాతుగా 1973 లో అరబ్బులకి "చమురు అస్త్రం" విలువ తెలిసివచ్చింది వెంటనే దానిని వాడటం ప్రారంభించారు చమురు లేదా పెట్రోలు ధరలు మిన్నంటాయి ముందు నాలుగు రెట్లు అయ్యాయి ఆ తర్వాత దాదాపు 20 రెట్లు అయ్యాయి సౌదీ అరేబియా, సింధుశాఖ అమీర్ల దేశాలూ — అంతకి ముందు అనామకంగా ఉన్నాయనిపించినవి — ఒక్కసారిగా పలుకుబడి గల రాజ్యాలయిపోయాయి

ఇదంతా జరిగినప్పుడు శ్రీమతి గాంధీ చమురు ధరలు పెంచిన అరబ్బుదేశాలని ఒక్కమాట అనలేదు కాని, చమురు ధరలు తగ్గుతూ ఉంటే మన విదేశాంగ శాఖలోని 'బాబు' లు ప్రపంచం తలకిందు లవుతున్నట్లుగా మాటలాడుతున్నారు న్యూఢిల్లీలో త దే స జరిగినప్పుడు బాగా చురుకుగా పని చేసిన ఒక అధికారిని నేను ఈ సమావేశం ముగిసిన ఒకటి రెండు రోజుల పిదప చూశాను ఆయన ఆఫీసు చాలా గొప్పగా ఉంటుంది అంత వైభవంలోనూ కూర్చుని ఆయన చాలా దుఃఖపడుతున్నాడు అసలు జరిగిందేమిటి ? పెట్రోలు ధర కొన్ని డాలరులు పడింది పడినా ఇంకా చాలా ఎక్కువగానే ఉంది ఈయన మాత్రం అరబ్బులు మళ్లీ తమ ఒంటెలు, గుడారాల జీవితానికి మారిపోతారన్నట్లు బాధపడి పోతున్నాడు అంతపనీ జరగవచ్చు కాని భారతదేశానికి ఎందుకు ఇంతబాధ ? మన చమురా చవకగా అమ్ముడుపోతోంది ?

నాకు అరబ్బులంటే సానుభూతి లేదు మనకీ, ప్రపంచంలో పరిశ్రమ లన్నిటికీ వచ్చిన మాంద్యానికి ప్రధాన కారణం అరబ్బుల అత్యాశే అరబ్బులు యుద్ధంలో ఇస్రాయెల్‌తో ఓడిపోయారు, ఆ కోపంతో వాళ్లు చమురుమీద పడారు మనం వారి వల్ల చాలా నష్టపోయాము 10 సంవత్సరాల క్రితం కన్నా ఇప్పుడు బీదవారి సంఖ్య పెరిగి ఉంటే దానికి అరబ్బుల విధానాలే కారణం కదా ? అరబ్బులని పెడత్రోవ పట్టించిన వ్యక్తి ఎవరోకాదు— యాసర్ అరాఫత్ ఇస్రాయెల్‌వారి చేతులలో బాగా దెబ్బలు తిన్నా ఈ పెద్దమనిషి ఇక్కడికి వచ్చి మన స్నేహితుడిలాగా మాటలాడుతాడు, శ్రీమతి గాంధీ తన సోదరి అంటాడు ఇది ఆయన సాహసానికి నిదర్శనం శ్రీమతి గాంధీ ఆయన సోదరే కావచ్చు కాని ఆయన మాత్రం మన సోదరుడు కాదు

అరబ్బులు మన వాళ్లకి వాళ్ల దేశాలలో ఉద్యోగాలు ఇస్తున్నారు, ఇదొక పెద్ద సహాయం— అని న్యూఢిల్లీలో కొందరు పెద్దలు అనుకుంటున్నారని తోస్తుంది అరబ్బు దేశాలలో పనిచేసే భారతీయులు తమ ఇళ్లకి కొంత సొమ్ము తీసుకు రావటం మన పెద్దలకి గొప్పగా అనిపించవచ్చు కాని నిజానికి మనని దోచిన సొమ్ములో కొంత భాగమేకదా మనకి తిరిగి వచ్చేది ? 1980 లో చమురు ఎగుమతి చేసే దేశాల వ్యాపార—లాభం (అంటే చమురు అమ్మగా వచ్చిన లాభం ) రు 120, 000 కోట్లు ఇది భారతదేశంయొక్క జాతీయ ఆదాయంకన్నా అధికమయిన మొత్తం ఇంత లాభం రావటానికి అరబ్బు దేశాలవాళ్లు పడిన కష్టం ఏమిటి ? ఏమీలేదు ! చమురుని వెతికి తీసే సాంకేతిక విజ్ఞాన వినియోగం వాళ్లది కాదు, వాళ్ల దేశాలలో పనిచేసే కార్మికులు విదేశాలవాళ్లు, అసలు అరబ్బుల ఆర్థిక వ్యవహారాలని నిర్వహించేవాళ్లే బయటివాళ్లు అరబ్బులలో రాజులు అమీర్‌లు చేసేది ఏమిటంటే— ప్రతి వ్యాపారంలోనూ కమిషను తీసుకోవటం— అదిమోటారుకారు అమ్మకమేకావచ్చు, విద్యుత్ కేంద్రం స్థాపనేకావచ్చు అరబ్బుదేశాలలో ఎవరు ఏ వ్యాపారం చెయ్యాలన్నా తన భాగస్వామిగా ఒక అరబ్బుని తీసుకోవాలి ఈ వ్యక్తి సాధారణంగా ఒక రాజవంశానికి చెందిన వ్యక్తి అయి ఉంటాడు లేదా వాళ్ల బంధువు అయి ఉంటాడు ఇలాంటి వాళ్లు కోట్ల డాలరులని స్విట్సర్‌లాండులో, ఇతర దేశాలలో దాచుకుంటున్నారు ఎందుకు ? అవసరం వచ్చినప్పుడు దేశం వదిలి పారిపోవటానికి ఇరాన్‌ని పాలించిన 'షా' ఈ పనే చేశాడు కదా ?

ఇప్పుడు జరుగుతున్నదంతా ఏమిటి ?

మీలాంటి, నాలాంటి పేదవాళ్ల సంపదని సింధుశాఖ అమీర్‌లు, ఇరాన్‌షా లాంటి వాళ్లు తీసేసుకుంటున్నారు ఇదే జరుగుతోంది ఇది వ్యాపారం అనటం కన్నా దోపిడీ అనటం బాగా ఉంటుంది మొన్న త దే స లో రాజకీయవేత్తలుగా వేషాలువేసిన వాళ్లు కొందరు దోపిడీదారులు కాక మరేమీకారు

పోనీ ఇంతసంపాదించి వాళ్లు ఏమి చేస్తున్నారు బీద దేశాల వాళ్లకి సహాయం చేస్తున్నారా ? లేదు

ఇంకా విదేశసహాయం ఎక్కువచేసేది యూరోపు దేశాలు, ఉత్తర అమెరికా దేశాలే వీటికన్నా అరబ్బు దేశాలకే మిగుళ్లు అధిక కాని, అరబ్బు దేశాలవాళ్లు తగిన సహాయం చెయ్యరు చెయ్యకపోగా తమలో తాము కొట్లాడుకుంటూ ఉంటారు ఇరాన్ — ఇరాక్‌లకి పడదు, గడ్డాఫీకీ — ఇంకెవరికీ పడదు గడ్డాఫీ ఒక ఉన్మాది అనక తప్పదు అయితే, అతని ఉన్మాదంలో ఒక పద్ధతి ఉంది తన దగ్గర ఉన్న నిధుల సాయంతో తన శత్రువులని చంపించివేస్తున్నాడు సాదత్ హత్యకి కారకులు ఎవరంటారు ? ఇప్పుడు సూడాన్ అధ్యక్షుడి వంతు అయింది ఎందుకంటే ఈయన సాదత్ స్నేహితుడు పెట్రోలు డబ్బుతో భారతదేశంలో కూడా పేచీలు తీసుకువస్తున్నారు మతం మార్పిడులు, అటువంటి ఇతర కార్యక్రమాలు చమురు ఆదాయంతో సాధిస్తున్నవే కొన్ని సందర్భాలలో ఈ ధనం నేరుగా వస్తుంది మరికొన్ని సందర్భాలలో ఇది అరబ్బుల బంటు అనదగిన జియా-ఉల్-హక్ వంటివారి ద్వారా వస్తూ ఉంటుంది

దీనంతటివల్లా వ్యాపారంలో నీతి అన్నది బాగా దిగజారిపోతోంది అరబ్బు దేశాలలో ప్రభుత్వాలకి బాగా లంచాలు పెట్టటం అలవాటుపడ్డ వ్యాపారులు ఇక్కడ అదే పద్ధతిని అవలంబిస్తున్నారు సింధుశాఖ దేశాలలో కట్టడాలు కట్టే సంస్థలు ఎన్నో ఉంటాయి వీటిలోని ప్రభుత్వరంగం సంస్థలు నష్టాలు తప్ప ఎరగవు ? ఇవి నిజంగా వచ్చిన నష్టాలా ? కావు వ్యాపారులూ, స్థానిక ప్రభుత్వాధికారులూ (అక్కడా, ఇక్కడా కూడా) పంచుకున్న లాభాలని ఇలాగ కప్పిపుచ్చుతూ ఉంటారు "అధికారులు," అంటే "మంత్రులు" అనికూడా అర్థం చెప్పకోవచ్చునేమో తెలీదు మన మంత్రులు అరబ్బు దేశాలకి వెడితే బంగారం గడియారాలు వగయిరాలతో తిరిగివస్తూ ఉంటారు ఈ వగయిరాలే కాంగ్రెసు (ఐ) ఎన్నికలలో సాయపడుతూ ఉంటాయి అందుకనే మనవాళ్లు అరబ్బుల అడుగులకి మడుగులు వత్తుతూ ఉంటారు

త దే స తీర్మానాలలో "చమురు" అన్న మాట కనపడదు కాని ఈ చమురే నేటి ఆర్థిక, పారిశ్రామిక సమస్య లన్నిటికీ మూలకారణం ప్రపంచాన్ని పెడదారి తొక్కించటానికి అరబ్బులు చేసే ప్రయత్నంలో మనమూ చేరాము బీదవారిని పెడదారి తొక్కిస్తున్నారు అందరూ ఎక్కువ బాధపడేది బీదవారే ఎప్పుడూ అయినా, చివరికి వాళ్లే నెగ్గుతారు త దే స లో పాలుగొన్నవారిని చూసి వాళ్లు అంటే బీదలు ఎంత నవ్వుకుంటున్నారో ! ★



స్కూలులో ఆరు గంటలు కష్టపడి చదవటం
తరువాత ఆటలు, ఆ తరువాత ఇంటికి వచ్చాకా
మళ్ళీ 2 గంటలు హోంవర్కు.



# ఈరోజుల్లో పిల్లల జీవితాలు కూడా కఠినంగా తయారయ్యాయి.

అందుచేత మీ పిల్లలకు ఉత్తమ మైనవి
లభించాలి
దీనికోసమే వారికోసం తయారైంది బూస్ట్
మీ పిల్లలకు ఉదయమే ఒక కప్పు
రుచికరమైన బూస్ట్ ఇవ్వండి రోజంతా
అత్యంత ఉత్సాహంగా, చురుగ్గా పని
చేసేందుకు కావలసిన శక్తి ఇంధనం వారికి
లభిస్తుంది ఎందుచేత నంటే, బూస్ట్ అతి
నాణ్యమైన పదార్థాల మేలిమితో నిండి ఉంది-
మీగడ పాలు, గోధుమ, బార్లీమాల్ట్,
కోకో




**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

# పొగమంచు

కుందుర్తి ఇందిరా దేవి

గోడగడియారం పదిగంటలు కొట్టింది పుస్తకం మూసి లేచి బయటికి వచ్చాను హాల్లో వరసగా చాపలు పరిచి పక్కలు వేస్తోంది రాధ నా పక్క సర్దుకుని పడుకున్నాను చెల్లెళ్లంతా వచ్చి ఎవరి పక్క వారు ఆక్రమించుకున్నారు

"పెద్దక్కా కథ చెప్పవూ" అంటూ వాసు వచ్చాడు

మా అయిదుగురు ఆడపిల్లలకీ ముద్దుల తమ్ముడు వాడు హైస్కూల్‌కి వచ్చినా వాడికి కథలమీద ఇంటరెస్ట్ పెరిగిందే తప్ప తగ్గలేదు రోజూ ఏదో ఒక కథ చెప్పమంటూ ప్రాణం తీస్తుంటాడు ఎవ్వరూ చెప్పకపోతే నాన్నగారి దగ్గర చేరతాడు వాడికి నాన్నగారంటే ఎంత చనువో! అఫ్‌కోర్స్! అంతకు రెట్టింపు భయం కూడా ఉంది లెండి

వాసు కథ వినడానికి రెడీగా నా పక్కనే పడుకుని ఒక కాలూ చెయ్యి నామీద వేసి నా వైపుకి తిరిగి పడుకున్నాడు

"అక్కా పెద్దగా చెప్పు నేనూ వింటాను" చివరి చెల్లి సుధ ఆర్డరు జారీ చేసింది

"అనగా అనగా" అని మొదలుపెట్టగానే రాధ వచ్చి "అక్కా! నాన్నగారు రమ్మంటున్నారు" అంది

ఉలిక్కిపడి లేచి "ఎందుకు?" అన్నాను

రాధ తెలీదన్నట్టు తలూపి, అంతలోనే నెమ్మదిగా "పెళ్ళి గురించి మాట్లాడ్డానికేమో" అంది

నేనేదో అనబోతుండగా ఎదురుగా ఉన్న గది లోంచి "సంధ్యా" అన్న నాన్నగారి పిలుపు వచ్చింది

నేనూ, నా వెనకే రాధ ఇద్దరం నాన్నగారి గదిలోకి వెళ్లాం అమ్మ అక్కడే కూర్చుని ఉంది

నాన్న నన్ను చూడగానే పక్కమీద లేచి కూర్చుంటూ "ఇటు వచ్చి కూర్చో సంధ్యా" అన్నారు

నాకు నాన్నగారంటే ఎంత చనువున్నా అంతకు పదింతలు భయం కూడా ఉంది అందుకే కూర్చోకుండా అమ్మ ప్రక్కనే సంశయంగా నిలబడిపోయాను

"రేపు నీకు సెలవే కదూ" ఉపోద్ఘాతంగా అన్నారు

నేను 'అవును' అన్నట్టు తలాడించాను

"రేపు ఇంట్లోనే ఉండు ఎక్కడికీ వెళ్ళకు నిన్ను చూడ్డానికి పెళ్ళివారొస్తున్నారు"

నేనేం సమాధానం ఇవ్వలేదు మౌనంగా ఊరుకున్నాను

"అంతే! ఇంకేం లేదు" అన్నారు నాన్నగారు దానర్థం ఇక నువ్వు వెళ్ళచ్చు అని!

నేను నెమ్మదిగా "నా చదువింకా పూర్తి కాలేదుగా నాన్నా" అన్నాను

నాన్నగారు నవ్వి "చదువుకి, పెళ్ళికి సంబంధం లేదు సంధ్యా ఎదిగిన ఆడపిల్లను ఎన్నాళ్ళు ఉంచుకోగలం చెప్పు మా బాధ్యత కూడా తీరుతుంది ఇక నువ్వెళ్ళి పడుకో" అన్నారు

నాకు ఒక్కసారిగా ఏడుపు వచ్చింది ఏమీ అనడానికి ధైర్యంలేక వచ్చి పడుకున్నాను అప్పటికే పిల్లలంతా నిద్రలోకి జారిపోయారు

రాధ దుప్పటి కప్పుకుంటూ "కట్న కానుకలు కుదరాలిగా ఇప్పటినుండే దిగులెందుకో హాయిగా నిద్రపో" అని ఓ ఉచిత సలహా ఇచ్చింది

వచ్చే నిద్ర కాస్తా ఎగిరిపోయింది నాన్నగారు మాత్రం ఏం చేస్తారు? అయిదుగురు ఆడపిల్లలు మధ్య తరగతి కుటుంబాల గురించి అసలు అడగనే అక్కర్లేదు రేపీ పెళ్ళిచూపులు తప్పించుకోవాలి నాన్నగారు తిట్టినాసరే! చివరికి ఒక నిశ్చయానికి వచ్చి తృప్తిగా నిద్రలోకి ఒరిగిపోయాను

* * *

మర్నాడు—

నాన్నగారు పనిమీద బయటికి వెళ్ళారు నేను గబగబా తయారయి వంటగదిలో ఉన్న అమ్మ దగ్గరకి వెళ్ళి "అమ్మా నేను అర్జెంటుగా పనిమీద బయటికి వెడుతున్నాను" అన్నాను

అమ్మ తెల్లబోయి "ఇప్పుడెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు పెళ్ళివారొచ్చేవేళయింది" అన్నది కోపంగా

నేను బ్రతిమాలుతూ "అమ్మా! అమ్మా! ఇప్పుడే వచ్చేస్తానే" అన్నాను "అంతేసి రాచకార్యాలు ఇప్పుడేమొచ్చాయి మీ నాన్నవస్తే నన్నుకేకలేస్తారు" అమ్మ కసిరింది

నేను నీళ్ళుకారిపోతూ "అమ్మాప్లీజ్! అమ్మాప్లీజ్" అని వెంటబడ్డాను

చివరికి అమ్మ ఒప్పుకుని "ఇంతకీ ఎవరింటికి" అంది, ఒకవేళ ఆలస్యమైతే మా చెల్లెళ్ళని నా కోసం కబురుచెయ్యటానికి

నేను ఓ క్షణం ఆలోచించి "సీతావాళ్ళింటికి" అన్నాను

అమ్మ తలాడించింది నేను ఊపిరిపీల్చుకుని బయటపడ్డాను నేను సీతావాళ్ళింటికి వెళ్ళేసరికి



ముందుగదిలో నవ్వులు వినిపించి ఆగిపోయాను గుమ్మంలోనే

నన్నుచూసి సీత ఇంకానవ్వుతూనే "రా రా ! నీకు నూరేళ్ళుఆయుష్షు ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాము"అంది

లోపలికి అడుగుపెట్టాను మంచం మీద పడుకున్న సీత అన్నయ్య కిరణ్ నన్ను చూసి పలకరింపుగా నవ్వాడు.

నేను కూర్చున్న తర్వాత "ఏమిటీ ఈమధ్య సంధ్యారాణిగారు కనిపించటమే మానేశారు" అన్నాడు కళ్ళెగరేస్తూ

నేను నవ్వేసి ఊరుకున్నాను

"ఊ ! ఏమిటి విశేషాలు ? ఊరకరారు మహాత్ములు" సీత నవ్వింది నేను గోళ్ళుగిల్లుకుంటూ "ఊహూ ! ఏమీలేదు ! అలా బయటకువెడదాం రారాదూటే" అన్నాను

సీతలేస్తూ "అయితేపద"అంది

"ఏమిటీ? ఈ అవతారంతోనేవస్తావా"అన్నాను ఆశ్చర్యంగా

"బజారుకా వెళ్ళేది" అంది

"అవునుగాని త్వరగాతెములు" అన్నాను

సీత బట్టలు మార్చుకురావడానికి వెళ్ళిపోయింది

ఇక్కడ నిజంచెప్పాలంటే నేను కిరణ్ ని ప్రేమించాను మా నాన్నగారు, వాళ్ళ నాన్నగారు చిన్నతనం నుండి ప్రాణస్నేహితులు మా రెండుకుటుంబాల మధ్య ఎంత సన్నిహితంఉందంటే మా దగ్గిరబంధువులతోకూడా లేనిప్రేమ, చనువు, అభిమానాలున్నాయి మా ఇద్దరి మధ్య ప్రేమ అంకురించడానికి అది ముఖ్య కారణమైంది సీత వచ్చే దాకా కిరణ్ తో కబుర్లు చెప్తూ కూర్చున్నాను

పది నిముషాల తర్వాత సీతతో రోడ్డు మీద నడుస్తూ ఈ పెళ్ళి చూపుల గురించి చెప్పి "అది తప్పించుకోవటానికే ఇప్పుడు ఇలా వచ్చాను ఈ పెళ్ళిచూపులు నాకు సుతరామూ ఇష్టంలేదు నువ్వే ఏదో ఉపాయం చెప్పి పుణ్యం కట్టుకో" అన్నాను దిగులుగా

"తగలడ్డట్టే ఉంది మీ ప్రేమ" అంది సీత కోపంగా

"అదేం " తెల్లబోయాను

"లేకపోతే ఏమిటే సంధ్యా ! మా అన్నయ్య మీద అభిమానం పెంచుకున్నావు ఆ మాత్రం ధైర్యంగా మీ నాన్నతో చెప్పరాదూ అందుకే నిన్ను పిరికిమోహం అంటాను" అంది ఏ మాత్రం కోపం తగ్గకుండా

"అమ్మ బాబోయ్ ! మా నాన్నగారితో చెప్పే ధైర్యం నాకుండేడిస్తే నిన్నెందుకు బ్రతిమాలుకుంటాను పోనీ నువ్వే ఆ పని చెయ్యరాదూ" కోపంతో చర్రుమన్నాను

సీత నవ్వి "నిజం చెప్పద్దూ ! నాకు మా అన్నయ్య ఈ విషయం ఎప్పుడో చెప్పాడు మా తల్లీ, బుల్లీ అంటూ బ్రతిమాలుకున్నాడు కాని నాకూ భయమే ! అందుకని " నాన్చేసింది

"నా ఖర్మ" నన్ను నేను తిట్టుకుంటూ "ఊ త్వరగా నడువు" అన్నాను

"ఇప్పుడెక్కడికి వెళ్ళడం" సీత సందేహంగా చూసింది

"ఎక్కడికీ లేదు సినిమాకి పద" అన్నాను

"అరెరే ! ఇంటి దగ్గరే ఈ విషయం చెప్తే అన్నయ్య కూడా వచ్చేవాడుగా" అంది

నేనేమీ సమాధానం చెప్పలేదు సినిమా హాలు చేరుకున్నాము సీత హఠాత్తుగా ఏదో గుర్తు వచ్చినట్లు "ఏంమ్మనిషివే తల్లీ సినిమాకి అని ఇంటి దగ్గరే చెప్పేడవకూడదూ ? ఊరికే బట్టలు మార్చుకు రమ్మన్నావు ఈ వెధవ చీరతో, ఈ జిడ్డు ముఖంతో నన్ను ఎవరైనా చూస్తే నవ్వరూ" అని రుసరుసలాడింది

"ఇప్పుడు నీ అందానికి ఏం తక్కువే తల్లీ చంద్రబింబంలా మెరిసిపోతున్నావు" అని గలగల నవ్వాను

సీత రోషంగా తలెగరేసింది ఎక్కడికైనా వెళ్ళాలనుకుంటే సీతచేసే ముస్తాబు గుర్తుకొచ్చి నవ్వుకున్నాను

సినిమాహాల్లో కూర్చున్నానన్నమాటేగానీ నా మనసు మాత్రం సినిమామీద లగ్నం కాలేదు ఇంట్లో నాన్నగారు అమ్మని ఎంతగా కేకలేస్తారో నాకు తెలియంది కాదు వచ్చిన పెళ్ళివారు ఏమనుకుంటారు ? నేను లేకపోతే !

నాన్నగారికి ఎంత తల వంపులు ?

నాన్నగారికి నా మీద ఎంత కోపం వస్తుంది ?

నాకు హఠాత్తుగా లేచి ఇంటికి వెళ్ళిపోవాలనిపించింది సినిమా చూస్తున్న సీత కిసుక్కున నవ్వుతూ "సంధ్యా ఆ హీరోయిన్ ముఖం చూడు నీ ముఖంలా ఎంత దిగులుగా ఉందో" అంది

"సీతా నేనింటికి వెళ్ళిపోతాను" దడదడలాడుతున్న గుండెలతో సీత చెయ్యి పట్టుకున్నాను

సీత ఉలిక్కిపడి చూసింది "నీ మోహం ! ఏమిటి నువ్వనేది ? వెళ్ళిపోతావా ? అయితే ఇంకేం వెళ్ళు ! మీ నాన్నంటే నీకు భయం ! వెళ్ళు వెళ్ళి ఈ పెళ్ళి చూపులకు హాజరుకా ! ఆ మూడు ముళ్ళు వేయించుకుందువుగాని "

"సీతా" నేను రోషంగా కసురుతున్నట్టుగా పిల్చాను

సీత కొంచెం తగ్గింది నా చేతిని నిమురుతూ "హాయిగా ఏ దిగులూ లేకుండా సినిమా చూడు ఇంటికి వెళ్ళి నాలుగు చివాట్లు తిను నెమ్మదిగా నీ మనసులో మాటేమిటో చెప్పేసెయ్యి అంకుల్ ఆ మాత్రం అర్థం చేసుకోలేరా ?" అంది

నాలో ఏదో ధైర్యం తలెత్తింది

* * *

ఇల్లు దగ్గిర పడింది నాకు భయంతో కాళ్ళు వణుకుతున్నాయి నన్ను వీధి మొదట్లోనే చూసిన వాసు తూనీగలా ఇంట్లోకి పరిగెత్తాడు నేను అనుకున్నంతా అయింది గుమ్మంలో అడుగు పెట్టగానే నేను కరంటు షాక్ తిన్నట్టుగా ఆగిపోయాను

నాన్నగారు అక్కడున్న ఈజీ చైర్లో పడుకుని ఇటే చూస్తున్నారు అమ్మ గుమ్మంలో కూర్చుని బియ్యంలో రాళ్ళు ఏరుతోంది రాధ అక్కడే కూర్చుని ఉంది

వాళ్ళు వచ్చి వెళ్ళిపోయారా ? అటువంటి లక్షణాలు ఏవీ అక్కడ నాకు కనబళ్ళేదు నాన్నగారు నన్నుచూస్తూనే కుర్చీలో నిటారుగా కూర్చున్నారు

అయిపోయింది ! నేను రోడ్డు పొడుగూతా రిహార్సల్స్ చేసుకుంటూవచ్చిన నా మాటలన్నీ ఒక్కసారిగా గాలికి ఎగిరిపోయాయి అమ్మ బియ్యంఏరటం ఆపి నావేపు చూడసాగింది

రెండునిముషాలు భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది

"లోపలికిరా ! అక్కడే ఆగిపోయావేం" అమ్మే చివరికి తేరుకుంది నేను తక్కుతూ తారుతూ వెళ్ళిపోబోయాను

"సంధ్యా" నాన్నగారినోటినుండి మృదువుగా వచ్చిందాపిలుపు ఉరుములులేవు ! పిడుగులులేవు !

నేను అప్రయత్నంగా వెనక్కితిరిగి చూశాను

"ఎక్కడికివెళ్ళావు" సౌమ్యంగా ఉందాప్రశ్న

నేను నిస్సహాయంగా చూడసాగాను నోరు పెగలటంలేదు

"సంధ్యా నువ్వు చిన్నపిల్లవికావు ఈ రోజు నిజంగా ఎంతఅవమానం తప్పిపోయిందో తెలుసా ? సీతావాళ్ళింటికి వెడతానని అబద్ధంచెప్పి ఎక్కడికి వెళ్ళావు ఇంకెప్పుడూ ఇటువంటి పిచ్చిపనులు చెయ్యకు"

నాన్నగారి ఆగ్రహం నాకు ప్రతి అక్షరంలోనూ అర్థమైంది "వాళ్ళు ఈరోజు ఏవో పనులుండటం వల్ల రాలేదు ఇంకానయం వాళ్ళువచ్చిఉంటే ఎంత అవమానపడాల్సివచ్చేది" అన్నారు

'ఆ ! వాళ్ళురాలేదా !' నా మనసు ఆనందంతో గంతులువేసింది అందుకేకాబోలు నాన్నగారికిఅంతగా కోపంరాలేదు సంతోషాన్ని అణచుకుంటూ లోపలికి పారిపోయాను

"ఎందుకక్కా అలా పారిపోయావు ఈ పెళ్ళిచూపులే ఇష్టంలేదా ?" రాధ నిలదీసింది

"ఛస్తే ఇష్టంలేదు" బాగ్ గిరాటువేస్తూ నిర్లక్ష్యంగా అన్నాను

"బావుంది నీకు ఇష్టంలేదని ఇల్లాప్రవర్తిస్తే అమ్మా, నాన్నా ఎంత బాధపడుతారు సిద్ధాంతిగారు వచ్చి వాళ్ళు ఈ రోజురావటానికి కుదరదు అనిచెప్పి నప్పుడుగాని అమ్మ స్థిమితపడలేదు " రాధ మందలిస్తున్నట్టుగా అని వెళ్ళిపోయింది

## ఆడిపాడే మరమనిషి !

పాటలు పాడే మరమనిషిని జపానులో ఒక పబ్లిసిటీ సంస్థ తయారుచేసింది ఈ మరమనిషికి ముఖం, శరీరం కాళ్ళు చేతులు ఉంటాయి ఇది గిటారు వాయిస్తూ పాటలు పాడగలదు పాడే సమయంలో పాటలకు అనుగుణంగా శరీరాన్ని కాళ్ళు చేతులు తిప్పగలదు దీనిని వ్యాపార ఆకర్షణగా తయారుచేశారు దీనిని పోలివ్రికిల్ క్లోరైడుతో నిర్మించారు ఇది ఒక బ్యాటరీ సహాయంతో పనిచేస్తుంది బ్యాటరీని కూడా ఇందులోనే అమర్చారు దీనిని ఒక స్త్రీ ఆకారంలో తయారుచేశారు ఈ మరమనిషి పేరు స్పైబట్ !

## పొ గ మం చు

నేను తప్పుచేశానా ? ఏమో !

* * *

సాయంత్రం వేళ !

పబ్లిక్ గార్డెన్స్‌లో ఒక చెట్టు క్రింద చాలా సేపటి నుండి కూర్చుని మాట్లాడుతున్నా మా సమస్య తెగటం లేదు

"ఉద్యోగం సద్యోగం లేకుండా ఏ ధైర్యంతో నిన్ను పెళ్ళి చేసుకుంటానని మీ నాన్నతో చెప్పను" కిరణ్ ఆమాట పదే పదే అంటున్నాడు

నాకు చాలా దిగులుగా ఉంది నా ఆరాటం ఎందుకో అతనికెలా చెప్పను? ఈ మధ్య నాకు రెండు సంబంధాలు వచ్చాయి

ఒకరికి నేను నచ్చలేదు హాతోస్మి అనుకున్నాను!

రెండో సంబంధం మంచి సంబంధమని నాన్న గారు ఊగారు వాళ్ళు కట్నం, పిల్లా రెండూ నచ్చ లేదు అన్నారు బ్రతికానురాబాబూ అనుకున్నాను

రెండు రోజుల క్రితం ఓ సంబంధం వచ్చింది వాళ్ళకి అన్నీ నచ్చాయి కానీ కట్నం కాస్త ఎక్కువ అడిగారు అమ్మ అభ్యంతరం పెట్టింది నాన్నగారు మటుకు 'పదివేలు ఎలాగూ ఇద్దామనుకున్నాం ఇంకా రెండు మూడు వేలదేముంది' అంటూ ముందుకు వచ్చారు

అప్పుడు నేను పడిన బాధ మీ కెలా చెప్పను? ఇక నాన్నగారు సిద్ధాంతిగారితో ఒప్పుకుంటున్నట్టు చెప్తుంటే నేనైతే ఏడ్చేశాను 'దేవుడా నువ్వే దిక్కు తండ్రీ' అంటూ ఆ రాత్రంతా శివరాత్రి జాగరణ చేసి తప్పుకునే మార్గాలు వెతుక్కోసాగాను

తెల్లవారి ఎర్రబడ్డ కళ్ళతో బయటికి వస్తుంటే సిద్ధాంతిగారు నాన్నగారితో "వాళ్ళకి ఇంకో సంబంధం కుదిరిందిట పదిహేనువేలు కట్నంట" అంటుంటే నాన్నగారు మండిపడి "ఆ వెధవ కట్నమేదో నేనే పారేస్తానని చెప్పానుగా వెళ్ళి వాళ్ళకి చెప్పండి" అన్నాను

సిద్ధాంతిగారు చేతులు నలుపుకుంటూ "ఈ రోజు తాంబూలాలు కూడా పుచ్చుకోబోతున్నారు సార్" అన్నారు

నాన్నగారి ముఖం ఆ సమయంలో ఎలా అయిపోయిందో వర్ణించటం నాకు అసాధ్యం ఆడపిల్లల తండ్రికి ఆ మాత్రం ఆరాటం ఉండ టంలో తప్పులేదనిపించింది ఆ క్షణంలో

నాన్నగారు ఆ రోజు భోజనం సరిగ్గా చెయ్యలేదు అన్నం కెలికేసి వెళ్ళిపోయారు అమ్మ కూడా విర్లిప్తంగా ఉండిపోయింది

నేనయితే ఆనందం పట్టలేక రాధని గట్టిగా ముద్దు పెట్టుకున్నాను బజారునుండి కొబ్బరికాయ స్వయంగా కొనుక్కొచ్చి దేవుడికి కొడుతుంటే అమ్మ ప్రశ్నార్థకంగా చూసింది మామూలుగా అయితే కట్నంవల్ల సంబంధం తప్పిపోయిందనే బాధతో మరో ఆడపిల్లయితే దిగులుగా ఉండేదేమో ! కానీ నా పరిస్థితి వేరుకదా !

రాధ కనిపెట్టిందిలా ఉంది "ఏం ! ఈ సంబంధం తప్పిపోయిందనే ఆనందంతో దేవుడికి లంచం ఇస్తున్నావా" అంది కొబ్బరిచిప్ప పగలగొట్టి తింటూ

నేను గతుక్కుమని "ఏడ్వావులే" అని కసురుకున్నాను

ఆ సాయంత్రమే సీత పరిగెత్తుకొచ్చి "సంధ్యోయ్ కొంప మునిగిపోతోంది" అంది

నేను ఆశ్చర్యపడి "ఎవరి కొంప" అన్నాను

"ఇంకెవరి కొంప ! నువ్వూ, అన్నయ్యా కలిసి కట్టుకోబోయే కొంప" సీత ఛర్రుమంది

నేను ఉలిక్కిపడి "ఏమిటే తల్లీ అదేదో సరిగ్గా ఏడూ" అన్నాను

సీత చెప్పిన సమాచారం ఇది "కిరణ్ కి ఏదో సంబంధం వచ్చిందిట వాళ్ళే అతనికి ఉద్యోగం ఇప్పించుకుంటారట కిరణ్ కి ఒళ్ళుమండి రెండు తిట్టి పంపించాట్ట నాన్నగారు కూడా అతని ఉద్యోగ ప్రయత్నాల్తో విసిగిపోయి ఒప్పుకోరా కిరణ్ అన్నారట అతనే ససేమిరా అన్నాట్ట"

ఆ మాటలు వినగానే నేను ఎగిరిపడి "ఏమిటే" అన్నాను

"మీరిలా తాత్సారం చేస్తూండండి పుణ్యకాలం కాస్తా తెల్లారిపోతుంది" సీత విసురుగా అంది దానికి తప్ప మా ఇద్దరి గొడవ ఇంకో ప్రాణికి తెలీదు

"నేను నే నేం చెయ్యను" భయంతో నా కళ్ళు రెపరెపలాడాయి

"భరతనాట్యం" సీత చేతులు వూపుకుంటూ చిరాగ్గా అంది

సీతే అలా అనేసరికి నా బుర్ర పనిచెయ్యడం మానేసింది

"పరిస్థితి చెయ్యి జారిపోకముందే మీరు తొందరపడటం మంచిది"

నేను చేతుల్లో ముఖం కప్పుకుంటూ "భగవాన్ నాకు చావయినా రాదేమిటి" అనేశాను నా గుండెల్లో నుండి భయం తాలూకు దుఃఖం తన్నుకు వస్తోంది నా కిరణ్ నా చేజారిపోతే నాకీ బ్రతుకెందుకు ?

"డోంట్ బి సిల్లీ !" సీత కసురుతూ "పోనీ నువ్వు మా అన్నయ్యతో మాట్లాడరాదూ" అంది ఆరాటంగా

నాకూ అదొక్కటేమార్గం కనిపించింది సీత నాకు ధైర్యంచెప్పి వెళ్ళిపోయింది నాకు ఇష్టం ఉన్నా లేకపోయినా నాన్నగారి ఆజ్ఞమేరకు పెళ్ళి చూపులకు హాజరవుతూనేఉన్నాను కిరణ్ కూడా వాళ్ళ నాన్నగారిమాటలకు కట్టుబడిపోయి పెళ్ళిచేసుకుంటే

అమ్మో ! నాకా ఊహే భరింపరానిదిగా అనిపించింది

సాయంత్రం అమ్మకి ఏవో సాకులుచెప్పి ఆలస్యమవుతుందని కాలేజీనుండి సరాసరి పబ్లిక్‌గార్డెన్స్‌కి వచ్చాను గంటనుండీ కిరణ్‌తో పోట్లాడుతూంటే అతనిచ్చే సమాధానంఇది నాకళ్ళల్లో నీళ్ళుతిరిగాయి

"సంధ్యా"

నేను చప్పున కళ్ళు తుడుచుకుని చూశాను

అతను నాచెయ్యి నిమురుతూ "ఎవళ్ళు ఎంత మంచి ఉద్యోగంఇప్పించినా నేను ఎవర్నీ చేసుకోను నువ్వు పిచ్చిపిచ్చి భయాలన్నీపెట్టుకుని మధ్యనన్ను గాడలకొట్టకు అయినా సంధ్యా ఉద్యోగం సాడూ లేకుండా నిన్ను పెళ్ళిచేసుకుని ఏం పెట్టి పోషించను, నాకు తిండిపెట్టడమేదండగ మళ్ళీ నువ్వుకూడానా? ఎవరైనావింటే నవ్వుతారు" హాస్యంగాఅన్నాడు

"ఉద్యోగంరాకుండా ఉండదుగా" అన్నాను నాకు ఏడుపు తన్నుకుంటూవస్తోంది ఓ పక్క కిరణ్ మాటలు వింటూంటే అరికాలిమంట నెత్తికెక్కుతోంది ఆడపిల్లలమనసులు వీళ్ళకి ఎలా అర్థమవుతాయి !

"అప్పటివరకూ మనం ఆగటమేమంచిది" కిరణ్ ఖచ్చితంగా అన్నాడు

"ఆల్‌రైట్ అలాగేకానీ" విసురుగాలేచి నిలబడి అతనితో అన్నాను నీకు చెప్పాల్సిందేదో చెప్పేశాను తర్వాత ఏదైనాజరిగితే నన్ననద్దు నీ మొండిపట్టుదలమాత్రం నువ్వు వదులుకోవు"

కిరణ్ అనునయంగా అన్నాడు "మనకు పెళ్ళి కాదు అనేభయం వదిలేసెయ్యి మీ నాన్నా, మానాన్నా స్నేహితులు అది నువ్వు గుర్తుంచుకుంటే చాలు"

ఆ ఆశమాత్రం నాలో జీవం పోయసాగింది

* * *




డిసెంబర్ నెల సెలవులు కావటంతో ఇంటి దగ్గరే ఉన్నాను ఒకరోజు సీత మధ్యాహ్నం వేళ రొప్పుతూ రోజుతూ వచ్చింది వస్తూనే "సంధ్యా సంధ్యోయ్ ! అత్తయ్యా సంధ్యేది ?" అని కేకలు వేసింది

ఆ కేకలకి చేతిలో ఉన్న పుస్తకం ప్రక్కన పడేసి బయటికి వచ్చాను

అమాంతం నన్ను చుట్టేసి "సంధ్యోయ్ అన్నయ్యకి ఉద్యోగం వచ్చింది" అంది ఒక్కసారిగా

రాధ మంచినీళ్ళగ్లాసు సీతకిచ్చింది

ఆనందంతో నా గుండెలు ఆగిపోతాయేమో అనిపించింది చప్పున ఆ నీళ్ళు నేను తాగేసి "నిజం" అన్నాను సీతను ఊపేస్తూ

"నిజం ! ఒట్టు" సీత నిజాయితీగా అంది

మా ఇద్దర్నీ చూసి అమ్మ ఫక్కున నవ్వింది నేను చప్పున సిగ్గుపడిపోయాను శుభవార్త కాస్తా చెవిన వేసి సీత వెళ్ళిపోయింది

కిరణ్ కి ఉద్యోగం వచ్చింది అది నాకు కొండంత ధైర్యాన్నిచ్చింది ఆ రోజంతా నేను సంగీతం కూనిరాగం తీస్తూ ఇల్లంతా గలగలా తిరుగుతుంటే ఇంట్లో అందరూ తెల్లబోయారు

పుస్తకం ముందు పెట్టుకుని కూనిరాగాలు తీస్తూంటే "సంధ్యా" అన్న నాన్నగారి పిలుపు వినిపించి గమ్మున నోరు మూసుకున్నాను

రాధ వచ్చి ఎప్పటిలాగే "నాన్న పిలుస్తున్నారు" అంది

నేను ఎగిరిపడ్డాను నాలో ఉత్సాహమంతా చల్లారిపోయింది ఈ పిలుపు ఎందుకో నాకు తెలుసు మౌనంగా వెళ్ళి నిలబడ్డాను

"రేపు ఎక్కడికీ వెళ్ళకు" అన్నారు

నేను మాట్లాడలేదు

"ఏం వినబడిందా ? ఈసారి నువ్వు తప్పించుకోటానికి వీల్లేదు సంధ్యా మంచి సంబంధం నువ్వు తప్పించుకుని నా కోపాన్ని మాత్రం రుచి చూడద్దు" నాన్నగారు శాసిస్తున్నట్టుగా అన్నారు అప్పుడు నేను చేసిన పని నాన్నగారికి బాగా కోపం తెప్పించినట్టుంది

నాలో మొండి ధైర్యం తలెత్తింది ఇప్పుడు కాకపోతే నా మనసులోని మాట ఇంకెప్పుడూ చెప్పలేనేమో అనిపించింది ఇక ఆ అవసరమే రాదేమో అని భయమేసింది

"నాకు నా కు ఈ పెళ్ళిచూపులు ఇష్టం లేదు" అన్నాను వణుకుతున్న స్వరంతో నా చేతివ్రేళ్ళు కంపిస్తున్నాయి

నాన్నగారు తెల్లబోయి చూశారు

అమ్మ నా ముఖం వంకే సూటిగా నోరు తెరుచుకుని చూడసాగింది

"ఎందుకని" నాన్నగారే ముందుగా తేరుకున్నారు

"అసలు పెళ్ళే చేసుకోవా" అమ్మ అనుమానంగా అంది

పయిట చెంగు వ్రేలికి చుట్టుకుంటూ భయం భయంగా చూశాను






బులుసు వేంకటరమణయ్య

# మూడు విధాల వ్యక్తులు

మానవుడు తన పరిసరాలలోని ఇతర మానవులను మూడు విధాలుగా వేరు చెయ్యవచ్చును ఒక రకం వారు మిత్రులు మరొక తెగకు చెందినవారు శత్రువులు ఈ రెండు తెగలకూ చెందనివారు తటస్థులు అంటే వారు మిత్రులూ కారు, శత్రువులూ కారు అన్న మాట మన శ్రేయస్సు కోరేవారూ, సర్వవిధాలా మనకు మేలు చేసేవారూ మిత్రులు మనకు వ్యతిరేకంగా, విరోధం సాధించేవారు శత్రువులు

పూర్వ కాలంలో రాజులు పై వారి పట్ల ఎంతో శ్రద్ధ వహించేవారు శత్రువులను వశం చేసుకోడానికీ, మిత్రపక్షాన్ని బలపరచుకోవడానికి, తటస్థులను గమనించి వారిని తమ పక్షంలో చేర్చుకోవడానికి సర్వవిధాలా ప్రయత్నాలు చేసేవారు శత్రువులను లొంగతీసుకోడానికి సామ—దాన—భేద—దండోపాయాలు ఉపయోగించేవారు సమాన బలంగల శత్రువును సామవాక్యాలతో మంచి చేసుకుని మైత్రికోసం యత్నించేవారు మాటలతో ఆ పని జరగకపోతే కొంత యిచ్చి (దానం చేసి) వారితోడి విరోధం పోగొట్టుకొనేవారు ఆ రెండు పద్ధతులవల్లా ప్రయోజనం లేకపోతే— శత్రుకోటిలోనివారికి పరస్పరం మిత్రభేదం కల్పించి, శత్రువును బలహీనపరచి లొంగదీసుకొనేవారు ఇవేవీ పని చెయ్యనప్పుడు తప్పనిసరిగా దండయాత్రకు బయలుదేరేవారు యుద్ధయాత్ర చివరి ఉపాయమే మొదటనే యుద్ధానికి సిద్ధపడేవారు కారు

సామాన్య మానవుల పట్ల కూడా పయి ఉపాయాలు పనిచేస్తాయి కార్యసాధనకు జనులు వీటిని ఉపయోగించేవారు కూడా

అయితే ఒక విషయాన్ని ముఖ్యంగా గమనించవలసి ఉన్నది మానవుడు తోడి మానవుని తనతో సమానంగా చూచినప్పుడు ఈ వ్యత్యాసం కనబడదు ఎక్కువ తక్కువ భేదం, కిట్టనివాడు అనుకూలుడు అనే భేదం దృష్టిగోచరం అయినప్పుడే మిత్ర శత్రు తటస్థభేదం కనబడుతుంది అందువల్ల ఇతరుల కష్టసుఖాలు తనవిగా భావించి వారు తనవంటివారే అని గట్టిగా అనుకొన్నప్పుడు శత్రువు అనేవాడు కనబడకుండా పోతాడు తటస్థుడూ చల్లచల్లగా జారిపోతాడు ఒక్క మిత్రుడే మిగులుతాడు అందరితోనూ స్నేహభావం కలిగివుండడం ఎంతో అవసరమని అందరూ అంగీకరిస్తారు అట్టి సమానతవల్ల మనశ్శాంతి ఏర్పడుతుంది జీవితం సాఫీగా సాగిపోతుంది ఇది స్వక్షేమానికే కాకుండా దేశ క్షేమానికి కూడా దోహదం చేస్తుంది ★

---

# పొగమంచు

పొగమంచు కనిపిస్తోంది ఎదురిళ్ళు కూడా కనిపించటంలేదు కిటికీ దగ్గరగా ఉన్న మనీప్లాంట్ గాలికి కదులుతోంది జాజిచెట్టు ఆకులమీద మంచు బిందువులు ముత్యాల్లా జారిపడుతున్నాయి

కిరణ్ మీద నేను పెంచుకున్న ఆశలు కూడా ఆ మంచు బిందువుల్లాగే కరిగిపోతున్నాయి గుండెల్లో శూన్యం అలుముకుంటోంది

ఇప్పుడు కిరణ్ నాకు అందుతాడా ? ఉద్యోగం రావటంతో పెళ్ళికొడుకుల మార్కెట్‌లో కిరణ్ రేటుకూడా పెరిగిపోయి ఉంటుంది

నేను నెమ్మదిగా శక్తికూడదీసుకుని స్నానానికి లేవబోతుంటే ఉన్నట్టుండి నాకు ఎంతో ఇష్టంగా ఉండే సుపరిచితమైన స్వరంవినిపించి ఉలిక్కిపడ్డాను సందేహంలేదు కిరణ్ ! నేను బయటికి రాబోయి చప్పున ఆగి కర్టెన్ కొద్దిగా తొలగించి చూశాను

వరండాలో కుర్చీలోకూర్చుని కిరణ్ నాన్నగారితో మాట్లాడుతున్నాడు భలే హుషారుగా ఉన్నాడు "ఉద్యోగంవచ్చింది అంకుల్ రేపు వెడుతున్నాను" అంటున్నాడు

నాలో నవనాడులూ క్రుంగిపోయాయి శక్తిలేనిదానిలా వెనక్కివచ్చేశాను అమ్మకూడా చేరినట్టుంది వాళ్ళమాటలు జోరుగానేసాగుతున్నాయి మధ్య మధ్య నవ్వులు ! నేను అవేమీ వినిపించుకోకుండా మౌనంగాకూర్చున్నాను

చాలాసేపటికి రాధ లోపలికివచ్చింది వస్తూనే నన్నుచుట్టేసి గట్టిగా ముద్దుపెట్టుకుని "అక్కయ్య పెళ్ళికూతురాయెనే" అని రాగంతీస్తుంటే నేను ఆశ్చర్యంగా చూశాను

రాధ నాచుబుకంపట్టి ఊపుతూ "నిన్న నాన్నగారువెడితే సుబ్రహ్మణ్యంఅంకుల్ 'సంధ్యకేంతక్కువ వాడికి ఉద్యోగంలేదని ఇన్నాళ్ళూ ఆగాను కానీ వాడినికూడా ఓ మాట అడిగిచెప్తాను' అన్నారట అంకుల్ అడగ్గానే "కిరణ్ నా కిష్టమేనని చెప్పాడట" నవ్వుతూ చెప్పింది

"నిజం" నా కళ్ళు ఆనందంతో విచ్చుకున్నాయి

"ఔను ! ఇంకా నాన్నగారే కొంచెం వెనకా ముందాడేరు వాళ్ళతోమనం తూగలేము కట్నాలూ కానుకలు ఇచ్చుకోలేంఅని అంకులేమో పెళ్ళిఖర్చులు చాల్లేవోయ్ అన్నారట నేనువెళ్ళి కాఫీపెట్టాలి" అంటూ రాధ వెళ్ళిపోయింది

నాకు సుబ్రహ్మణ్యం అంకుల్ కనిపిస్తే అమాంతం సాష్టాంగ నమస్కారం చెయ్యాలనిపించింది అన్నీ నా పిచ్చి పిచ్చి ఊహలే సూర్యకాంతికి కరిగిపోయే పొగమంచులా సుబ్రహ్మణ్యం అంకుల్ ఆదరానికి, విశాల హృదయానికి నా కళ్ళల్లో గూడు కట్టుకున్న భయాలన్నీ కూడా కరిగిపోయాయి నా కళ్ళల్లో చివ్వున నీళ్ళు తిరిగాయి

గదిలో అడుగుల చప్పుడు విని చప్పున తిరిగి చూశాను గుమ్మంలో పొడవుగా నిలబడి నవ్వుతున్నాడు ! ఎవరతను ?

కన్నీళ్ళ మధ్య మసక మసగ్గా క్రమేపీ సుస్పష్టంగా కనిపిస్తున్న కిరణ్‌ని చూసి నా పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి ★

"నీ మనసులో ఎవరైనా ఉన్నారా" నాన్నగారి కంఠంలో టెన్షన్

"మీరు మీ రు మీ సుబ్రహ్మణ్యం గారిని అడగండి అంకుల్ కాదంటే మీ ఇష్టం చేసుకుంటాను " అని మెరుపులా వచ్చేశాను

ఆశ్చర్యంగా చూస్తున్న రాధకి అంతా చెప్పేశాను

* * *

నాన్నగారు లోపలికి వస్తుంటే నేను ఒళ్ళంతా చెవులు చేసుకుని చూడసాగాను అమ్మ వెళ్ళి మంచినీళ్ళు ఇచ్చింది అవి త్రాగి స్నానానికి వెళ్ళారు ఏ విషయమూ నాకు చెప్పనేలేదు

భోజనాలు చేస్తూ అమ్మ, నాన్నగారు చిన్నగా మాట్లాడుకుంటుంటే నాకు ఒక్క ముక్కకూడా అర్థం కాలేదు

అయిపోయింది ! నా ఆశలన్నీ ఒక్కసారిగా కూలిపోయాయి సుబ్రహ్మణ్యం అంకుల్‌కి నన్ను కోడుక్కి చేసుకోవటం ఇష్టంలేదులా ఉంది

మరి నేనేం చెయ్యాలి ! కిరణ్ కి నేను తగనా ?

ఆ రాత్రంతా నేనసలు నిద్రపోలేదు నాన్నగారి ముందు అనవసరంగా బయటపడిపోయాను నాకు హఠాత్తుగా ఏడుపు వచ్చేసింది

మర్నాడు !

నేను అలంకారప్రాయంగా చేతిలో పుస్తకం పట్టుకుని దిగులుగా కిటికీలోంచి బయటికి చూడసాగాను

చలికాలం కావటం మూలాన బయట దట్టంగా

# పాల నుంచి ఘన పదార్థాలకి
# మీ పాప సులభంగా మారేలా చూడండి...

# నెస్టమ్: సున్నితమైన మార్పుకోసం ప్రత్యేకంగా రూపొందించిన బేబీ సీరియల్



మీ పాపకి మీరు ఎంతో మంచి ఆహారం ఇవ్వాలనుకుంటారు
అందుకే మీరు పాపకి చనుపాలు యిస్తారు మీరు యివ్వగలిగిన
వాటిలో ఎంతో పోషకత్వం కలిగి సులభంగా జీర్ణమయే
ఆహారం అదే
పాపకి నాలుగు నెలలు నిండాక, పాప ఆహారంలో ఘన
పదార్థాలు వుండాలి కాని పాప జీర్ణం చేసుకునే విధానం
ఇంకా సున్నితంగా వుంటుంది అందుకే పాపకి
సులభంగా జీర్ణమయే సీరియల్ కావాలి నెస్టమ్ వంటిది
ప్రత్యేకంగా రూపొందించినది కావటంతో మొదటగా
ప్రవేశపెట్టే ఘన పదార్థంగా నెస్టమ్ సరియైనది.
ఇది బియ్యంతో తయారు చేయబడింది గ్లూటెన్
లేకపోవడం వలన దీనిని సులభంగా జీర్ణమయే
సీరియల్‌గా పోషకాహార నిపుణులు అంగీకరించారు
మీ పాప పోషకాహారానికి ఆధారంగా వుండే 11 విట
మిన్లతోనూ, ఇనుము మరియు కాల్షియంతోనూ బలపరచ
బడినది కావడంతో నెస్టమ్ "కావాలి" అని పోషకాహారం
విలువ తెలిసిన మీ వంటి తల్లులు అంటారు విటమిన్లు
పాప వర్చస్సుకి మెరుపుని ఇస్తాయి కళ్లలో కాంతులు
తెస్తాయి రోగ నిరోధక శక్తిని కలిగిస్తాయి. ఆరోగ్యవంతమైన
రక్తం కోసం ఇనుము, దృఢమైన ఎముకలు, పండ్లకోసం
కాల్షియం అవసరం
పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం ఎప్పుడూ
సులభమైన పద్ధతి కాదు కాని నెస్టమ్ పాలనుంచి ఘన
పదార్థాలకి మార్పు సున్నితంగా వుండడానికి మీకు సహాయం చేస్తుంది




ఇనుము మరియు
11 విటమిన్లతో
బలపరచబడింది

## నెస్టమ్®
## రైస్

SAA/FSL/N/2671 TEL

### తయారు చేయడం సులభం



| ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి | నెస్టమ్ చేర్చండి కలపండి | తినిపించుటకు తయారు |
| --- | --- | --- |



సీరియల్

# అద్దానికి అవతలివైపు

కేవిఎస్వీ

**40**

(గత సంచిక తరువాయి)

'మూన్ ఇంటర్‌నేషనల్' వారి కొత్త ఫిలిం నిర్మాణ ప్రయత్నాలు అతి చురుకుగా జరుగుతున్నాయి సినిమా చాలా భాగం కాశ్మీర్‌లో షూట్ అవుతుంది

ఈలోగా ఒక కొత్త ఫిలిం కంపెనీ ప్రొడ్యూసర్లని తీసుకొచ్చాడు శ్యామలరావు

"మేం కొత్త వాళ్ళమే అయినా టెక్నిషియన్స్ అంతా మంచి అనుభవం ఉన్నవాళ్ళు పనిచేస్తారు మీరు వొప్పుకుంటే అంతా ఫిక్స్ చేస్తాము మీ ఫిగర్ ఏమిటో తెలుసు మేం రెడీ " అన్నాడు వాళ్ళలో కాస్త తలలో నాలుక ఉన్న మనిషి

"అబ్బే ఈ సంవత్సరం నేనిక వేరే కాల్‌షీట్స్ ఇవ్వలేనండీ సో సారీ "

శ్యామలరావు కలగజేసుకున్నాడు " అది కాదు సుందరీ వీళ్ళ సబ్జెక్టు చాలా థ్రిల్లింగ్‌గా వుంది నేను స్టోరీ అంతా విన్నాను మంచి మాసప్పీలు ఉంది "

శ్యామలరావుతో కాకుండా ఆ ప్రొడ్యూసర్‌తో అంది సుందరి - "చూడండి మా వారు ఇంతగా చెప్తున్నారు అంటే మీ సబ్జెక్టు స్టోరీ అంతా కూడా చాలా థ్రిల్లింగ్‌గానే వుండాలి సబ్జెక్టులో అంత బలం వుండి మీరు చెప్పినట్టు మంచి టెక్నిషియన్స్‌ని వేసుకుంటే ఫిలిం మంచి హిట్టవుతుంది నా ఫిగరు మీరిచ్చుకునే పరిస్థితిలో ఉన్నా, నా బదులు వేరే నటి నెవర్నయినా బుక్ చేసుకుంటే— మీకు మంచి మార్జిన్ మిగులుతుంది నేను సిన్సియర్‌గా చెప్తున్నా నీ మాట మా వారి మాట మీద నాకెంతో గౌరవం ఉందిగాని, పనిచెయ్యాల్సింది నేను కాబట్టి మొహమాటం లేకుండా చెప్తున్నాను మీ ఫిలిముకి ఈ సంవత్సరం కాల్షీటులివ్వలేను "

"అది కాదు సుందరీ " అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు శ్యామలరావు

"అయామ్ సో సారీ నాకు వేరే పనుంది" అని లోపలికి వచ్చేసింది సుందరి

ఆ వచ్చిన ప్రొడ్యూసర్లని ఏరకంగా సాగనంపాడో శ్యామలరావు? కాని మళ్ళీ సుందరి దగ్గరికి వచ్చినప్పుడు మాత్రం అతి సీరియస్‌గా ఉన్నాడు ఇద్దరి మధ్యా మాటలు చాలా పదునుగా నడిచాయి

"సుందరీ — నువ్వింత అగ్లీగా బిహేవ్ చేస్తావనుకోలేదు, నలుగురి ముందూ కూడా 'నన్ను ఇన్సల్ట్ చెయ్యనిదే నీకు తృప్తి లేదా? నీలూ చిత్రానికి నా కన్సల్టేషన్ లేకుండా సైన్ చేశావు, నేను పిల్చుకొచ్చిన వాళ్ళని బ్లంట్‌గా రిఫ్యూస్ చేశావు, దట్‌మీన్స్ — "

"బుర్ర నాకూ ఉందన్నమాట ఏ కంట్రాక్టు ఎందుకు సైన్ చెయ్యాలో — ఏది ఎందుకు చెయ్యక్కర్లేదో నాకు తెలుసన్న మాట దీన్ని నువ్వేదో ఇన్సల్ట్‌గా తీసుకుంటున్నావంటే నా బుర్ర నేను ఉపయోగించటం నీకు ఇష్టం లేదన్న మాట దట్‌మీన్స్ దట్ "

"సుందరీ — ఇవాళ నీ స్థితికి కారణం నేను మరిచేపోయావా? నా ప్రోత్సాహమూ నేనిచ్చిన స్వేచ్ఛా లేకుంటే నువ్వు "

"ఇక చాలు — ఆపండి! నాకసలే మూడ్స్ బాగులేవు "

"ఆల్‌రైట్! ఇలా ఎంతకాలం సాగుతుందో నేనూ చూస్తాను "

చాలా చాలా విషయాల గురించి ముఖా ముఖీ అడిగి తేల్చుకోవాలనుకుంది సుందరి కాని అసలే అస్తవ్యస్తంగా తయారైన ఆలోచనలకు ఇంకా కలగాపులగం చేసుకోవటం ఎందుకని పూరుకుండిపోయింది అలాగని అభిమానాన్ని పణంపెట్టి శ్యామలరావుతో రాజీగా బ్రతకటం ఆమెకు ఇష్టం లేదు

చాలా రోజుల తర్వాత అద్దం ముందు సావకాశంగా నిలబడింది సుందరి

అద్దంలో సుందరి నవ్వలేదు గంభీరంగా ఉంది

ముఖంలో మునుపటి కళా, కాంతీ కనిపించటం లేదు బుగ్గలు బరువెక్కి వంపు తిరిగాయి ముక్కుకొన — మునుపటంత నిశితంగా కనిపించటం లేదు మేకప్ వేసుకుని వేసుకుని, కృత్రిమమైన స్టూడియో లైట్ల వెలుతురులో నిలబడి నిలబడి — చర్మం ఒకరకంగా అసహజంగా మెరుస్తోంది కళ్ళలో మునుపటి చలాకీతనం లేనేలేదు స్థిరంగా,దృఢంగా — లోపలికి చూసుకుంటున్నట్లున్నాయి చూపులు

"సుందరీ — ఇలా అయ్యావు! — ఇంకేమవుతావు?"—అనుకుంది సుందరి

అపనమ్మకాల మీద నడిచే సంబంధాలు ఆట్టే కాలం కొనసాగవు శ్యామలరావుతో పేచీ ముదిరి, అది కాస్త విషమించి, విడిపోవటాలదాకా రావటాన్ని ఆపాలని సుందరి ఎంతగా ప్రయత్నిస్తూ వచ్చినా లాభం లేకపోయింది

ఎల్లవేళలా సుందరిని అంటిపెట్టుకుని తిరగటం అతను ఎప్పుడో మానేశాడు ఒక్కోసారి రెండు మూడు రోజులుదాకా కూడా వాళ్ళు ముఖ ముఖాలు చూసుకోకుండా గడిపెయ్యడం కద్దు

ఒకసారి షూటింగ్ నుంచి చాలా ఆలస్యంగా ఇంటికొచ్చింది సుందరి పనివాళ్ళు పరామర్శించి స్నానం భోజనం వగైరా ఏర్పాట్లు చూశారు అలసి ఇల్లు చేరుకున్నాక కులాసాగా కాలం గడపటానికి స్వంత మనిషిలేని దిగులు ఆ సమయంలో సుందరిలో చీకటి తరగలాగా ఉవ్వెత్తున లేచింది ఎవరెవరికో టెలిఫోన్లు చేసింది హలో హలో కబుర్లు చెప్పాక, విసుగెత్తి అదీ మానేసింది చాలా శూన్యంగా అనిపించింది ఫ్రిజ్‌లోంచి బీర్ తీసి కొంచెం తాగి, అదీ అవతల పెట్టేసింది ఏదో డిటెక్టివ్ నవల చేతిలోకి తీసుకునే సరికి మెల్లమెల్లగా నిద్ర పట్టేసింది

అర్ధరాత్రి దాటినవేళ ఎందుకో మెలకువ వచ్చింది సుందరికి మగత నిద్రలో విన్న చప్పుళ్లను బట్టి శ్యామలరావు ఇంటికొచ్చాడని తోచింది ఎంత సేపటికీ అతను గదిలోకొచ్చే సూచన లేకపోగా, లేచి మేడ దిగింది ఆఫీసు గదిలో టేబుల్‌లాంప్ వెలగటం గాజు తలుపుగుండా కనిపించింది నాలుగడుగులు ముందుకు వేసిన సుందరి—చెప్పలేనంత కోపంతోనూ, చిరాకుతోనూ, బాధతోనూ ఊగిపోయింది

ఆఫీసు గదిలో ఎవరో స్త్రీతో సోఫాలో శృంగారం సాగిస్తూ ఉన్నాడు శ్యామలరావు

శ్యామలరావు లేచి రాగల స్థితిలో ఉన్నాడనుకున్నప్పుడే తలుపు తట్టింది సుందరి తలుపు తీసిన శ్యామలరావులో సుందరిపట్ల బోలెడంత ధిక్కారం ఉంది

అతని భావం అంతా క్షణంలో అర్థమైపోయింది ఆమెకు

పెద్ద సీన్ ఒకటి జరగటం ససేమిరా ఇష్టం లేదు

ఏం చెప్పాలో ఎలా చెప్పాలో మాత్రం ఆసరికే ఆలోచించుకుంది "మళ్ళీమీరు బిజీగా వుండి కనిపించరేమోనని— ఇప్పుడు చెప్తున్నా—

**జరిగిన కథ—9** సుందరి చాలా అందంగా వుంటుంది ఆ అందమంతా ఆమె కళ్ళలోనే ఉందని చూసిన వాళ్ళంతా అనుకొంటుంటారు ఓ ఉత్తరం ద్వారా, ఆ తర్వాత తన అందంతో ఆమెను ఆకట్టుకొంటాడు ఉద్యోగం చేస్తున్న శ్యామలరావ్ పరీక్షలవగానే సుందరి శ్యామలరావ్‌ని పెండ్లి చేసుకుంటుంది సుందరి శ్యామలరావ్ ప్రోద్బలంతో, దూరపు చుట్టం జగన్మోహన్ సహకారంతో 'సినిమా' లోకంలోకి అడుగు పెడుతుంది ఆ లోకంలో ఆమెకు రకరకాల అనుభవాలు ఎదురవుతాయి కానీ అనతికాలంలోనే మంచి పేరు సంపాదించుకుంటుంది సుందరి ఆ పేరు సంపాదించుకోవడానికి కొన్ని అడ్డదార్లు కూడా తొక్కవలసివస్తుంది నీలూ కారణంగా శ్యామలరావ్ సుందరిల మధ్య గొడవలు చెలరేగుతాయి

రేపంతా ఇంట్లోనే ఉండండి  మనిద్దరికీ సంబంధించిన వ్యవహారం సెటిల్ చేసుకుందాం ''

బాగా తాగి కూడా ఉన్నాడు శ్యామలరావు సుందరి చెప్పిందాన్ని సరిగా విన్నట్లూ లేదు— ''ఏం? నువ్వు పవిత్రంగా ఉన్నావా? హహ! ఏం? తప్పేం? నా కేం? నా యిష్టం ''

''సరే— మీ ఇష్టమే లోపలికెళ్ళండి మీ ఫ్రెండ్ పాపం కాచుకుని వుంటుంది ''

శ్యామలరావు లోపలికెళ్ళి దఢాల్న తలుపేసుకున్నాడు

వాచ్‌మాన్ని పిలిచి, శ్యామలరావు మర్నాడు తన అనుమతి లేకుండా ఇల్లు కదలటానికి వీల్లేదని చెప్పింది

మళ్ళీ మేడమీదికెళ్ళినా, నిద్రపట్టలేదు సుందరికి ఆలోచనలతో పచార్లు చేస్తూ గడిపింది తెల్లవారుతూండగా లాయర్ గౌరీనాథ్‌కు ఫోన్ చేసింది గౌరీనాథ్ చాలా పెద్దమనిషి, వయసు మళ్ళినవాడూ, సుందరియందు కొంచెం ప్రత్యేకమైన అభిమానం ఉన్నవాడూ

విషయం అంతా విన్న ప్లీడరు గౌరీనాథ్, చాలాసేపు ఆలోచనలో ఉండిపోయి— ''అమ్మా— మీరు అంత ఫైనల్‌గా తీర్మానించుకుంటే— విడిపోవటమే ఇద్దరికీ మంచిది కోర్టు చుట్టూ మీరు తిరిగే పని లేకుండా, అతను ఒప్పుకుంటే కొన్ని సంతకాలతో అంతా సెటిల్ అయిపోతుంది— మీరు చెప్తున్న దాన్నిబట్టి— కొంచెం డబ్బుతో అతణ్ణి ఒప్పించగలరా? ''

వాచ్‌మన్‌తో పేచీపడి బుసబుసలాడుతూ కూచున్న శ్యామలరావు సుందరి పిలవగానే వచ్చి ఇంకా రుసరుసమన్నాడు— ''హౌస్ అరెస్టులో ఉంచావు ఎందుకూ? ''

గౌరీనాథ్ కలగజేసుకుని, అంతావిశదీకరించాడు మొదట ఒప్పుకోలేదు శ్యామలరావు కోర్టన్నాడు పరువు నష్టం అన్నాడు, చివరకి సుందరి దించిన బేరంలోకి సులువుగానే దిగిపోయాడు చేతికందిన పెద్దమొత్తంతో అతను చాలా సంతోషిస్తున్నట్టుగా తెలిసిపోతోంది

సాయంత్రానికల్లా సంతకాల తతంగం ముగిసింది

శూన్యంగా తప్ప, ఏదో తెగిపోయిన బాధ ఏమీ అనిపించలేదు సుందరికి

## 41

''మూన్'' వారి చిత్రం షూటింగ్ మొదలైంది మొదటి రోజే, కాస్త తీరిక దొరికినప్పుడు— సుందరితో వేరుగా మాట్లాడాడు నీలూ

''సుందరీ! జరిగిందంతా తెలిసింది ఎప్పుడో చెప్పాను కదూ నేను ఆల్‌రైట్! నువ్వేం దిగులు పడకు! నేనున్నాను!—''

చిత్రంగా చూసింది సుందరి

నవ్వుతున్నాడు నీలూ - ''నువ్వంటే నాకు వల్లమాలిన ఇష్టమని ఎప్పుడో చెప్పానుగా— నువ్వేం కంగారు పడకు సుందరీ యు జస్ట్ బిలీవ్ మీ నువ్వు నన్ను నమ్ము — చాలు! అంతా నేను చూసుకుంటాను —''

ఆ మాటలు అర్థంకానంత అమాయకురాలేం కాదు సుందరి

ఈ కొత్త బంధం గురించి తీరికగా ఆలోచించాలనుకుంది కాని, తీరికనేదే లేకుండాపోయింది

ఈలోగా నీలుని దూరంగా ఉంచటం ఆమెకు వీలుకాని పని అయిపోయింది

రాత్రి సుందరి బంగళాలో నీలూ- కొత్త సీసా ఓపెన్ చేశాడు కొత్త సీసాను చూసుకున్నట్టే చూసుకున్నాడు సుందరిని

* * *

తమ్ముణ్ణీ తల్లినీ చూసి చాలా కాలమైనట్లనిపించి, వీలు దొరికిన ఒకపూట కారేసుకుని వెళ్ళింది సుందరి

ఆమెకు ఘనమైన స్వాగతం వంటిదేదీ లభించలేదు

మునుపటిలాగే— వాకిట్లో ఆగిన కారు ఎంకా,









సుందరి బట్టల వంకా అసూయ ఉట్టిపడేలా చూడటం తప్ప సుభద్ర ఆత్మీయంగా ఒక్కముక్క మాట్లాడలేదు

కౌసల్య ధోరణి—సుందరి ఎదురు చూడనంతగా మారిపోయింది "వాడితో ఏమైనా పనుండి వచ్చావా ?—" అందామె ఆమాట వెనకున్న వ్యంగ్యం సుందరి మనసును సూటిగా తాకింది

"అదేమిటమ్మా నిన్ను చూట్టానికి రాకూడదా నేను ?"

సురేష్ కలగజేసుకున్నాడు, "ఇక్కడెంత హాయిగా మేముంటామని చూట్టానికొచ్చావు ?— నువ్వు చేసే పనులకి —"

నవ్వింది సుందరి "కొత్తగా ఏం చేశానురా నేను ?"

"ఇంత దూరానున్నా—ఖర్మకాలి—మదరాసులో నువ్వుచేసే ఘనకార్యాలన్నీ మా చెవిన పడుతూనే ఉన్నాయి — కళ్లకి కట్టినట్టు వర్ణించటానికి కొన్ని పత్రికలు కూడా ఉన్నాయి—"

"శ్యామలరావు గొడవేనా ?—"

అసహనంగా చూసింది కౌసల్య — "అనేకాల్లో అదొకటి ! పెళ్ళి చెయ్యటానికీ అచ్చటా ముచ్చటా తీర్చటానికే అయితే పెద్దలు కావాలి ఆ తర్వాత ఎవరి గొడవలు వారివే ఇక్కడ మేం అడిగిన వారికల్లా సమాధానాలు చెప్పలేక చస్తున్నాం అసలే ఈ ఇంటి పరువు అంత మాత్రం " దుఃఖంతో బాధతో, ఆమె గొంతు రుద్ధమైపోయింది

"మనసు లేకపోయినప్పుడు — ఒకరి మెప్పు కోసం గానుగెద్దులా పడుంటం మంచిదంటావా అమ్మా ? నువ్వే ఇలా మాట్లాడితే "

"సుందరీ నా పదాలు నాకే అప్పగించ గలవనుకోకు — ఆశయం వేరూ జీతవిం వేరూ! సరే — జరిగిందేదో జరిగింది అలా చూడు — సినిమా స్టార్ని చూడాలని గేటు ముందు ఎలా ఎగబడుతున్నారో ! ఇలా ఎగబడతారు అలా వీధి మలుపులో అవాకులూ చెవాకులూ పేలుతారు కారులో — ఎక్కడో పీటికి అతీతంగా తిరిగే నీకు — ఇవన్నీ చెవిని పడవు కాని — మాకు తప్పటంలేదు ఇట్లాంటివి భరించటం ఎంత కష్టమో పడేవాళ్ళకి గాని తెలీదు — అంచేత — దయచేసి నువ్వెప్పుడూ

## అందానికి అవతలివైపు

ఇక మా వంక ఇలా రాకు ఈ ఇంటిని నువ్వింక ఇలాగ పావనం చెయ్యనక్కరలేదు "

వాళ్ళ ధోరణి అర్థమౌతూనే ఉంది ఇంకా వాదోపవాదాలకు దిగటం హాస్యాస్పదంగా తోచింది సుందరికి

"అమ్మా — ఇవన్నీ ఎలా ఉన్నా నన్నెంతో గారాబంగా పెంచి పెద్దచేసిన మిమ్మల్ని పూర్తిగా మరిచిపోయాననీ మరచిపోగలననీ మాత్రం ఎప్పుడూ భావించకండి వస్తాను "

గడప దాటుతుండగా వెనుకనుంచి అంది కౌసల్య — "పోనీ — ఆ నీలూతోనైనా "

"వస్తానమ్మా " చురుక్కున చూసి, గిరుక్కున తిరిగి — కారెక్కింది సుందరి

**42**

చలనచిత్ర రంగంలో కొత్తకొత్త ప్రయోగాలు మొదలయాక పరిశ్రమ తీరుతెన్నులూ, వ్యక్తుల జీవితాలూ ఎన్నో మార్పులకు గురి అయాయి

లోబడ్జెట్ చిత్రాలు, కొత్త తారలతో ఎంతో మంచి చిత్రాలు తీసే దర్శకులు, నటీనటులకన్న సాంకేతిక నిపుణులమీదే నిర్మాత దృష్టి కేంద్రీకరింపబడటం— ఇలా ఎన్నో మార్పులు జరిగాయి

అన్నిటికన్న మిన్నగా— ప్రేక్షకుల అభిరుచి నానాటికీ ఫలానా అని చెప్పలేనంతగా మారిపోతూ ఉంది పాత తారల్ని పాత ప్రేక్షకులు అభిమానించ వలసిందే కొత్త ప్రేక్షకులైన కుర్రకారుకి కొత్త తారలు కావాలి

"మూన్ ఇంటర్నేషనల్" వారి భారీ వర్ణ చిత్రం ఎవరూ ఊహించనంత ఘోర పరాజయానికి గురయింది అసలు సరుకులో ప స లే కుం డా స్టారింగ్మా ప్రొడక్షన్ వ్యయాన్ని భారీగా భరించి ప్రేక్షకుల్ని మాయ చెయ్యాలనుకున్నారు, అలా చెయ్యొచ్చనుకున్నారు— నిర్మాతలు ! అంత సులభంగా మాయకు లోనయే అమాయకులు కారు నేటి ప్రేక్షకులు, మరి !

"సుందరీ ! ఈ దెబ్బ నేను సులభంగా కోలుకోగలిగే దెబ్బ కాదు అయాం టెరిబ్లీ అప్సెట్!—" అన్నాడు నీలూ సీసాలు ఖాళీచేస్తూ

"మరీ ఎక్కువ తాగుతున్నావునుమా—నీలూ కొంచెం కంట్రోలు చేసుకోవాలి నువ్వు "

"ఏముందని కంట్రోలు? అప్పటికీ డాడీ వార్నింగ్ ఇస్తూనే ఉన్నా, నేను వినిపించుకోలేదు "

అమెరికాలో తనను దగ్గరికి తీసుకున్న నీలూకీ, ఈ నీలూకీ ఎంతో తేడా ఉందనిపించింది

అయితే చిత్రసీమలో ఇటువంటి ఆటుపోటులు తప్పవు

చాలారకాల పరిస్థితుల్లో చాలారకాల మనుషుల్ని చూసింది సుందరి

రాజ్యమేలేది డబ్బు ! కేవలం డబ్బు !

పరిస్థితి ఆశగొల్పేదిగా ఉన్నప్పుడు అంతా హుషారుగా చలాకీగా కూనిరాగాలమీద వడుస్తూ ఉంటుంది

డబ్బాలు తిరిగొచ్చిన మొహాలైతే— ఇదుగో ఇలాగే

"పోనీ నాతో పార్ట్నర్గా చేరతావా సుందరీ? కొత్త వెంచర్ వేద్దాం ఈ సారి లోబడ్జెట్కెళిపోదాం మంచి పల్లెటూరి సబ్జెక్ట్ కూడా ఉంది "

నీలూ ప్రోద్బలంతో అతనితో పార్ట్నర్షిప్ కలిసి ఆ సినిమాలో నటించటానికి ఒప్పుకుంది సుందరి

పూర్తి ఔట్డోర్లో ఒకే షెడ్యూలులో తీసిన సినిమా కాబట్టి కాలయాపన ఏమీ జరగలేదు

కేవలం ఇరవై ఏడు రోజుల్లో షూటింగ్ అంతా జరిగిపోయింది

అయితే— లాబ్వర్క్, ఎడిటింగ్, డబ్బింగ్ మొదలైన శాఖల్లో నీలూకి అనుభవం తక్కువ ఆ పనులకి ఇతర టెక్నీషియన్స్ మీద పూర్తిగా ఆధారపడవలసి వచ్చింది

అది కారణం కాకపోవచ్చుగాని,— ఈ సినిమా కూడా బాక్సాఫీసు దగ్గర విజయం సాధించలేకపోయింది

పెట్టిన డబ్బయితే అటూ ఇటూగా తిరిగొచ్చిందిగాని పడ్డ శ్రమంతా కూడా మెప్పులేకుండా మరుగున పడిపోయింది

"సారీ సుందరీ ఇలా అవుతుందనుకోలేదు అయినా మునిగిపోయిందేమీలేదు ఈ సారి ఇంకో లోబడ్జెట్ లాగించేద్దాం జనంటేస్టు మారుతోంది కాబట్టి— దాంతోబాటు మనమూ మారాలి ఈసారి పిక్చర్లో హీరోయిన్గా వర్ణశ్రీని బుక్చేద్దాం "

అదిరి పడింది సుందరి

వర్షశ్రీ ఇటీవలే వృద్ధిలోకొస్తున్న తార చాలా సెక్సీగా ఉంటుందని మొదట కుర్రకారంతా విపరీతంగా ఎగబడ్డారు స్విమ్మింగ్ కాస్ట్యూమ్స్‌లో వొళ్ళు విరుపులతో ప్రారంభించిన వర్షశ్రీ ఇప్పుడు "రేపసీన్స్‌లో ఇకపై నటించను ' అని ప్రకటించటంతో బాటు పౌరాణిక చిత్రాల్లో హీరోయిన్ వేషాలకు బుక్ అయి, చాలా బిజీగా ఉంటోంది

"అలా చూస్తావేం సుందరీ? అరె యు మెడ్ శకెట్ ఈజీ! అబ్బే! — ఈ స్పిరిట్ పనికిరాదు నీ సౌందర్యం ఫేడౌట్ అయిపోయిందని కాదు "

అర్థమౌతోంది సుందరికి

నీలూకి తనని వదలటం ఇష్టంలేదు కనీసం, ఇప్పుడప్పుడే వదలటం ఇష్టంలేదు అతనికి కావలసినవి తన పొంట్స్‌లోనూ, బీరువాలోనూ ఇంకా ఉన్నాయి

నవ్వుకుంది సుందరి

"సారీ నీలూ! నువ్వు చెప్పేది వాకర్థమైంది కాని నా 'ఈగో' వొప్పుకోదు ఈసారి నీ ఫీల్మ్ పార్ట్‌నర్‌గా ఉండలేను ఇంతకీ వర్షశ్రీని కాంటాక్ట్ చేశావా ?"

ఆ మాటకి నవ్వి ఊరుకున్నాడు నీలూ ఆ తరువాత అతను సుందరిని కలవటం బాగా తగ్గించేశాడు వర్షశ్రీతో అతను సినిమా తీస్తున్నట్టు త్వరలోనే ప్రకటన వెలువడింది

* * *

ఒకసారి చెట్టియార్ నుంచి ఫోన్ వచ్చింది సుందరికి "ఏమ్మా ఎట్లా వుండావు ? బిజీనా ? "

"చెప్పండి సార్ ! "

"మన పడం మ్యాను చూస్తివా ? యేం లేదు హీరోయిన్ అక్క పోర్షన్‌కి నిమ్ము వేసుకుందామని డైరెక్టరు చెప్తుండాడు కాంట్రాక్టు పంపిస్తునా ? "

"సార్ ! " కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్టు అనిపించింది సుందరికి— "అక్క పోర్షనా? హీరోయిన్ ఎవరూ ? "

"కొత్త ఫేసులే! నీ మాదిరిగా వుంటుంది కొంచెం అందుకుడా — నువ్వయితే అక్క పోర్షన్ సరిపోతావని డైరక్టర్ అంటాడు —"

"సారీసార్ ! నేను ఇవ్వలేను "

"అయ్యో— బేజార్ అయిపోకుమీ నీ కలవరం తెలుసును ఇది అంతదా ! పోనీ యోచిచ్చుకుని రేపు చెప్తావా? ఓకెయిఁయలు మాట్లాడుదాం సాయంకాలమా వొచ్చిపోమీ కారు పంపిస్తునా ? "

"కొంచెం బిజీగా వున్నాన్నార్ వీలయితే నేనే ఫోన్ చేస్తాలెండి (శమ తీసుకుని ఫోన్ చేసారు — చాలా థేంక్స్ ! "

"అయ్యో — దానికేమీ వుంటాను "

దిక్కు తోచటం లేదు సుందరికి

అద్దం ముందుకెళ్ళి నిలుచుంది

అద్దంలో సుందరికేసి చూడాలనిలేదు కొంచెం ఏక్కి వుచ్చుకుంటే

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



ఆంధ్రపత్రిక వారపత్రికలో 'డాక్టర్ సలహాలు', ఆంధ్రపత్రిక (దిన పత్రిక)లో డాక్టర్ కబుర్లు రాస్తున్న డాక్టర్ కె వెంకటేశ్వరరావుగారికి న్యూఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంవారు కమ్యూనిటీ హెల్త్‌లో పిహెచ్ డి ని ప్రదానం చేశారు గతంలో ఆయన మదరాసు విశ్వవిద్యాలయంనించి ఎం బి, బి ఎస్, డి పి హెచ్ పట్టాలనిపొంది 1968 నించీ మదరాసు [అడయారు] లోని వాలంటరీ హెల్త్ సర్వీసెస్ వైద్య కేంద్రంలోనూ, దానికి అనుబంధంగా ఉన్న ఎం ఎ సి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కమ్యూనిటీ హెల్త్‌లోనూ డాక్టరుగా వివిధ హోదాలలో పనిచేసి ప్రస్తుతం జాయింట్ డైరెక్టరుగా ఉన్నారు చెంగల్‌పట్ జిల్లాలోని గ్రామీణులలో కుష్టువ్యాధి నివారణ కార్యక్రమంపై డా వెంకటేశ్వరరావు అధ్యయనం చేసి సమర్పించిన పరిశోధనా వ్యాసానికి ఆయనకి ఈ డాక్టరేట్ లభించింది



బెంగుళూరులో కాంగ్రెసువారుకాని ముఖ్యమంత్రులు నలుగురు సమావేశమయి ఒక 'కూటమి' ని ఏర్పాటు చేసుకున్న అనతి కాలంలోనే ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ కేంద్రం - రాష్ట్రాల మధ్య సంబంధాలని అనుశీలించేందుకు న్యాయమూర్తి శ్రీ సర్కారియాని ఏక సభ్య సంఘంగా పని చెయ్యటానికి నియమించారు ఆయన సిక్కు మతానికి చెందినవారు పంజాబులో సిక్కు తీవ్రవాదులు తమ రాష్ట్రానికి కొన్ని ప్రత్యేకమయిన హక్కులు కావాలని ఆలజడి చేస్తున్నారు

# వారఫలం

29-4-1983 శుక్రవారం మొదలు 5-5-1983 గురువారం వరకు

♈ **మేషం** రవివారంలో సభా గౌరవానికి అవకాశం గలదు రాజకీయంగా మీరు చేసే ప్రయత్నాలు సఫలం అవుతాయి కొందరకు సాహితీ రంగంలో, పత్రికా ప్రకటనలో, ఉద్యోగంలో సదవకాశాలు లభిస్తాయి స్త్రీలకు విద్య, ధన, లాభదాయక వ్యవహారాలలో, నూతనోద్యోగ ప్రయత్నాలు అనుకూలమే

♉ **వృషభం** ప్రతిభ రాణించుటకు, వెనుకటి ప్రయత్నాలు అనుకూలదాయకం అగుటకు, నూతన వస్తు సేకరణకు, నూతనాంశాలు తెలిసికొనుటకు, వ్యవహార విజయానికి అనుకూలమైన వారమే స్త్రీలకు నూతనంగా ఏదైనా ఉద్యోగ ప్రయత్నం ఉంటే అనుకూలమే

♊ **మిధునం**, ప్రతి వ్యవహారం మీకు అనుకూలమవుతుంది అంతే గాక, శుభ ప్రస్తావనలకు, రాజకీయంగా మేలు చేకూరుటకు అనుకూలవారమే చాల కాలంగా మీతో వివాద పడిన మిత్రులు మరలా చేరికొనుటకు అవకాశమున్నది స్త్రీలకు ఒకానొక గృహ వ్యవహారంలో అనుకూలత చేకూరటం, కించిత్తు ధనాదాయం సంభవం

♋ **కర్కాటకం** మిత్ర వర్గీయుల వలనను, బంధువుల మూలాన మేలు చేకూర నున్నది చాల మందికి ప్రయాణ మూలకంగా ఏదో లాభం చేకూర నున్నది పూర్వ శత్రుత్వంతల ఎత్తే ప్రమాదం కూడా లేకపోలేదు, జాగ్రత్త పడాలి స్త్రీలకు ఆదాయం, సాహితీ రంగాన ప్రగతి, ప్రతిభ రాణించటం గమనింప నున్నారు

♌ **సింహం** విలువగల వస్తువులు సేకరించుకో గలరు చాలమందికి అనుకోకుండా ప్రయాణాలు చేయవలసి రావటం, అప్రయత్నంగా కించిత్తు ఆదాయం లభించటం, వృత్తిలో పెంపు చెప్పదగిన అంశాలు కొందరకు ధాన్య విక్రయ సంబంధంగా లాభం చేకూరుతుంది స్త్రీలకు వస్తు వాహన సేకరణ, అధికారుల ఆదరణ, ఆదాయంలో అభివృద్ధి చేకూరటం గమనిస్తారు

♍ **కన్య** విలువగల వస్తువులు కొన గలుగుతారు ముఖ్య బంధువులను కలిసికో గలరు అప్రయత్నంగా ధనాదాయం, అవసరాలు తీరటం, మిత్ర కలయిక, యిత్యాది అనుకూల పరిస్థితులుంటాయి వ్యాపార సంబంధమైన లాభార్జనకు అవకాశమున్నది స్త్రీలకు యత్న కార్య సిద్ధి, వివిధ రంగాలలో అవకాశాలు, ఉద్యోగంలో ముఖ్యంగా పై అంతస్థుకు చేరుకొనే మార్గం ఏర్పడుతుంది, గమనించాలి

♎ **తుల** వెనుక ముగించలేక వదలిన వ్యాపార వ్యవహార సంబంధ విషయాలు ఈవారం పరిష్కారం కానున్నవి కోర్టు సయిబంధంగా చాల కాలం వేధించే వ్యవహారాలు సులభంగా పరిష్కరింప బడగలవు స్త్రీలకు కొందరు నూతనంగా చేసిన ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి క్రొత్తగా ఆదాయంలో అభివృద్ధి చేకూర గలదు

♏ **వృశ్చికం** ముఖ్య బంధువులు యింటికి రానున్నారు మీ యాలోచనలు ఫలింప నున్నవి అధిక వ్యయానికి అవకాశం గలవారం వస్తు వాహనాలు కొనుగోలు చేయుటకు సదవకాశమున్నది అధికారుల ఆదరాభిమానములు చూరగొన గలరు స్త్రీలకు సమ్మాన సత్కారాలకు, ఉద్యోగంలో సదవకాశాలకు అవకాశమున్నది

♐ **ధనుస్సు** చాల కాలంగా రావలసిన ధనం ఈ వారం అందితీరుతుంది శ్రమించండి కొందరకు, ఈరాశివారికి యీ వారం ఆరోగ్యలోపం ఏర్పడుతుంది కళా సాహిత్య రంగాలలో మీకు ప్రగతి ఏర్పడుతుంది స్త్రీలకు నూతనోద్యోగాలకొరకు చేసిన ప్రయత్నాలు ఫలవంతం అవుతాయి, గ్రహించండి

♑ **మకరం** చాలమందికి ప్రయాణాలు చెప్పదగిన వారం అవకాశవాదులు వెంట బడుతారు వారి మాటలకు ఏమాత్రం లొంగరాదు వస్తు వాహనాలు కొనుగోలు చేయుటకు అవకాశం గల వారమే స్త్రీలకు సాహిత్య రంగాలలో మీకు సదవకాశాలు లభిస్తాయి ఉద్యోగంలో మీకు పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి

♒ **కుంభం** చాల కాలం క్రితం యత్నించిన కార్యం, ఈవారం నెరవేరే మార్గమున్నది వస్తు వాహనాలు కొనుగోలు చేయ గలరు అధికారుల మూలాన జరుగ వలసిన పనులుంటే సుకరంగా నెరవేరగలవు స్త్రీలకు గృహ కార్య భారంతో కాలం వ్యయిస్తారు ఈ వారంలో బంధువుల రాకపోకలు వివరింప దగిన ముఖ్యాంశం వ్యవహారం ఏదైనా పరిష్కరింప దగినది ఉంటే నెరవేరగలదు

♓ **మీనం** వ్యాపారం సుకరంగా సాగిపోవటం, కోర్టు వ్యవహారం అనుకూలంగా పరిష్కరింప బడటం, కళా సాహిత్య రంగాలలో సదవకాశాలు లభించ గలగటం, నూతనాంశాలు తెలిసికో గలగటం చెప్ప దగిన ముఖ్యాంశాలు, గ్రహించండి స్త్రీలకు అధికారుల ఆదరణ, ఉద్యోగంలో పెంపు చెప్పదగిన అంశాలు, శ్రద్ధతో గమనించి శ్రమించండి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★




# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన సూపర్ 777 డిటర్జెంట్ బార్

## నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు. దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది. అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి...మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

Shilpi DM 2/83 Tel

# కొత్తగొంతులు

టి.యల్. కాంతారావు

ఈ ఇల్లు -
కీచకుడు సైరంధ్రికోసం ఎదురు
చూస్తూ
ఉబుసుపోకకై కట్టుకున్న
ఇసుక గూడులా ఉంది.
బకాసురుడు వండుకొని పారేసిన
పగిలిన కుండలాగుంది
శూర్పణఖ ముక్కిడి ముక్కులా
గుంది
గడ్డం మీసం వచ్చిన గొ(ద్రాలి
ముఖంలాగుంది
రాజకీయవాది మెదడులోని ఊహా
లోకంలాగుంది.

– పేర్వారం జగన్నాథం

1965లో దిగంబర కవితోద్యమ ప్రారంభం అనంతరం తెలుగు కవితారంగంలో సామూహికంగా కొన్ని కవితా సంకలనాలు ఉద్యమ లక్ష్యంతో పుట్టి ఉద్యమస్థాయిని అందుకోలేకపోయాయి అటువంటి ఉద్దేశంతో పుట్టిన చేతనావర్త కవులలో పేర్వారం జగన్నాథం ఒకరు 1934లో భిలాషాపురంలో పుట్టి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం ఏ పట్టం పొంది కాకతీయ విశ్వవిద్యాలయం వరంగల్లు తెలుగుశాఖలో రీడర్‌గా పని చేస్తున్నారు 1960లో సాగర సంగీతం అనే కావ్యాన్ని అచ్చువేశారు ప్రముఖమైన గుర్తింపు కవిగా చేతనావర్త సంకలనాలతోనే లభించింది

చేతనావర్తం కవితా సంకలనాలు దిగంబర కవితోద్యమానికి కౌంటర్ రియాక్షన్ కవిత్వంలో 'ఇజాల కీకారణ్యం' అని కొంతమంది అంటూనే వారు కూడా ఒక ఇజంలోకి ప్రయాణించటం మనం చూస్తూనే ఉన్నాం అట్లాగే చేతనావర్త కవులు కూడా ఒక ఇజానికి నిబద్ధులైనవారే జగన్నాథంగారు చేతనావర్త కవుల మానిఫెస్టోలాంటి అభిప్రాయాలను అంగీకరించి వారు కనుకనే వారి కవిత్వం ఆ అభిప్రాయాల పరిధిలో ఇమిడిపోయింది

జగన్నాథంగారి వచన కవిత ఎక్కువ భాగం సెటైరికల్‌గా ఉంటుంది వారు ప్రయోగించే సెటైర్‌లో పురాణ ప్రతీకలు అధికంగా ఉంటాయి పురాణ పురుషుల్లో కొంతమంది మంచివాళ్ళని కొంతమంది చెడ్డవాళ్ళని సాధారణ అభిప్రాయాలున్నాయి. ఆ భావాలనే జగన్నాథం గారు కూడా తు చ తప్పకుండా పాటించారు వచన కవిత్వంలో అంత్య ప్రాసల ప్రయోగం ప్రమాదకరమైనది అంత్యప్రాస కవిత్వంలో భాగమైతే తప్ప లేకపోతే ఇట్టే పట్టేస్తుంది జగన్నాథంగారు ఉపయోగించిన అంత్య ప్రాసలు చాలాచోట్ల అంత్యప్రాసలుగానే మిగిలిపోయి కవిత్వ గుణాన్ని సన్నబడేటట్లు చేస్తాయి 'ఈ మగడు నాకొద్దు! విడువలే తుమ్మమొద్దు!' లాంటి పాదాలు కవిత్వానికి దూరంగా ఉంటాయి

ఈ సమాజం అసమంగా ఉన్నదనీ, ఇక్కడి జీవితాలు అనంతమైన ఆర్థిక దారిద్ర్యాన్నీ, భావ దారిద్ర్యాన్నీ అనుభవిస్తున్నాయని, భారత దేశంలో తొంభై శాతం భూభాగం చీకట్లోనే ఉందనీ, దానికి కారణం దేశాన్ని పాలించే రాజకీయ నాయకులేననీ, నమ్ముతూ, ఈ వ్యవస్థ మారాలనీ ప్రగాఢంగా కోరుకొంటున్న కవి పేర్వారం జగన్నాథంగారు ప్రజలు చైతన్యవంతులై అన్యాయాలమీద తిరగబడాలని కవితా ఖండికల్లో ధ్వన్యాత్మకంగా సూచిస్తారు జగన్నాథంగారు ఈ చైతన్యం సామూహిక సాధన కాదనీ, కేవలం వ్యక్తిగతమైనదనీ చేతనావర్త కవుల విశ్వాసం కనుకనే దిగంబర కవితోద్యమాన్ని 'యదా యదాహి ధర్మస్య గ్లా నిర్భవతి భారత 'అనే వారి కావ్య ఖండిక పేరుతోనే వెక్కిరించటం జరిగింది 'మేం కనే అయ్యకు కానేకాం వారసులం! ఆకాశంనుండి ఊడిపడ్డ బేవారసులం! కలం బడితిమా కానేకాం మనుషులం' అనే పాదాలు స్పష్టంగా దిగంబర కవులను వెక్కిరించడమే



మార్క్సిస్టు ఆలోచనా ధోరణి అనేది ఒక భయంకరమైన విషయమని, అది విజాతీయమైనదని అనుకొనటంలోంచే ఈ భావాలన్నీ ఏర్పడతాయి 'రంగు మార్చడం ఎవడిక్కావాలి, అంతరంగంలో మార్పు రావాలి! జిల్లేడుచెట్టు కొమ్మల్ని కోయడం కాదు! సమూలంగా పెరికి వేయాలి!' అని కవి ఆశించేటప్పుడు అంతరంగంలో రావలసిన మార్పు ఈ వ్యవస్థను సమూలంగా విధ్వంసం చెయ్యడానికే కదా! మన కన్నతల్లి కీనాడు వెన్నులో రాచపుండు పుట్టిందనీ, దానికి ఏదో చికిత్స చెయ్యాలనీ జగన్నాథంగారు కూడా భావిస్తున్నారు ఒక తరం దీనికి శస్త్ర చికిత్సే మార్గమని నమ్ముతోంది, వ్యక్తి వికాసంలోంచే ఈ మార్పు వస్తుందని వీరు నమ్ముతున్నారు రాచపుండుకి నాటువైద్యం పనికిరాదని జగన్నాథంగారే చెప్పారు గతం భూతమని, వర్తమానం నమ్మించి దగాచేస్తోందని, భవిష్యత్తు ఉజ్వలంగా ఉటుందని చెబుతున్నారు జగన్నాథం గారు

దగా, వంచన, దోపిడీతో కూడిన ఈ సమాజంలో మనిషి మనిషిగా బ్రతకటానికి మార్పు అనివార్యమని, ఆ మార్పు మానవతావాద ప్రధానంగా జరగాలని జగన్నాథంగారి కవిత్వం విశదపరుస్తోంది ఆయన కవిత్వంలో వాచ్యత తక్కువ వ్యంగ్యం పాలు ఎక్కువ ఏది చెప్పినా స్పష్టంగా ఉంటుంది గాని సూటిగా ఉండదు పాఠకుడు ఆగి ఆలోచించవలసిన అవసరం ఎక్కువగా ఉంటుంది వ్యక్తివాద కవితకు సాధారణ లక్షణమైన మార్మికత ఈయన కవిత్వంలో కనబడదు అస్పష్టతకు అసలు ఆస్కారమే లేదు వారి దృక్పథంతో ఏకీభవించినా, ఏకీభవించకపోయినా కవిత్వం మేరకు ఆయన్ను అంగీకరించవలసిందే వర్తమాన సమాజంమీద ఆయనకు గల ఏవగింపును కూడా గుర్తించవలసిందే దానికి పరిష్కార మార్గంలో ఇతర ఆధునిక కవులకూ, జగన్నాథంగారికీ పోలికలేదు భవిష్యత్తు మీద ఆశతోనే ఆయన కవిత్వం రాస్తున్నారు ఆ ఆశ సఫలీకృతం కావడానికి కేంద్రీకృతం కావలసిన జనచైతన్య స్వరూపాన్ని గురించి జగన్నాథంగారు పునరాలోచిస్తారేమో!

రేపు ఋతుపవనాలు మనవైపే వీచి
అమృతవర్షం కురుస్తుంది
రేపు మనింటికే ఉజ్జ్వల భవిష్యత్తు
నడుచుకుంటూ వస్తుంది
రేపు నాగులూ వరదలూ తగ్గినాక
ఈ నేలంతా సమతలంగా
మారుతుంది 



# డాక్టర్ సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**వై. బి. డి. — ఆదోని**

నా వయస్సు 18 సం॥లు నాకు తరచు శరీరం అంతా నీరసంగా ఉండి తరచు తలనెప్పి వస్తూ ఉంటుంది

★ మీరు ప్రతిరోజూ కాల్షియం, మల్టీవిటమిన్ మాత్రలు తీసుకోవటం మంచిది

ప్రతిరోజూ విధిగా రాగుల పిండితో చేసిన జావ త్రాగటం మంచిది

**కె. ఆర్. కె. — హైదరాబాదు**

నా వయస్సు 24 సం॥ గత రెండు నెలలుగా గుండెవద్ద ఒక విధమైన నెప్పి వస్తున్నది రాత్రి వేళల్లో నిద్ర పట్టడంలేదు నడుస్తున్నప్పుడు తల తిరుగుతున్నట్లు ఎడిపోతున్నట్లు తోస్తుంది

★ మీరు ఛాతీ ఎక్స్-రే, ఇ సి జి బేరియం మీల్ ఎక్స్-రేలు తీయించుకోవలసి ఉంటుంది వాటిని నిపుణులైన వైద్యులవద్ద చూపించి చికిత్స చేయించుకోవలసి ఉంటుంది మామూలుగా సక్రమమైన ఆహార లేమివల్ల ఈ లక్షణాలు వస్తూ ఉంటాయి కొన్ని సందర్భాలలో ఇది సైకోసొమాటిక్ రోగం అని తేల్చవలసివస్తుంది అంటే మానసిక వ్యధ శరీరంమీద పనిచేస్తున్నదని అర్థం

**డి. ఎస్. ఆర్. — హైదరాబాద్**

నా వయస్సు 25 సం॥లు యూరిన్ ఫోర్సుగా రావటం లేదు మామూలుగా వస్తుంది యూరిన్ టెస్టు, బ్లడ్ టెస్టు చేయించాను లోపం లేదు అపాయం ఏదైనా ఉందా?

★ మూత్రం ఎక్కువ ఫోర్సుగా రావాలసిన అవసరం లేదు మరీ సన్నగా ధార వస్తూ ఉంటే అంగభాగంలో పిన్ హోల్ మి యేటస్ ఉందేమో పరీక్షింప చేయవలసి ఉంటుంది వయస్సు మీరిన తర్వాత ఏర్పడగలిగే ప్రొస్టేటిక్ ఎన్‌లార్జిమెంటులో ఇలా జరిగే అవకాశం ఉంటుంది గొనోరియా అనే సుఖరోగం ఉన్నప్పుడు మూత్రనాళంలో అవరోధం ఏర్పడి ఇలా జరిగే అవకాశం ఉంటుంది వీటికిగాను పరీక్ష చేయించుకోవటం మంచిది

**ఎం. వి. జి. — గరగపర్రు**

నా ఫ్రెండ్ ఒకాయనకి రోజూ భోజనం చేయగానే తిన్నదంతా వాంతి అయిపోతూ ఉంటుంది ఇలా రెండు నెలల నుంచి జరుగుతున్నది ఒక్కోసారి లేచీ లేవగానే పసరు వెళ్ళిపోతుంది ఇది తగ్గటానికి చాలా మందులు వాడినా ఫలితం లేదు

★ మీ ఫ్రెండుకి ఉన్నది డుయోడినల్ అల్సర్ విత్ అబ్‌స్ట్రక్షన్ అయి ఉంటుంది దీనికి వెను వెంటనే శస్త్రచికిత్స చేయించవలసి ఉంటుంది మీ దగ్గరలో ఉన్న శస్త్ర వైద్యుని వెంటనే సంప్రదించండి

**బి. కె. ఎం. ఆర్. — విజయవాడ**

ఇతనికి మందు పెట్టారు, అది కక్కించక పోవటంవల్ల చనిపోయాడు మరి కొందరు ఇతనికి మందు పెట్టారు అది నాటుమందు వేసి కక్కించు కొన్నాడు అని కొందరు చెప్పుకోడం విన్నాను ఈ ఆధునిక కాలంలో కూడా ఈ మందు పెట్టటం అనేది నిజంగా జరుగుతుందా!

★ ఇలాంటివి కట్టుకథలే తప్ప వాస్తవంగా జరుగవు మతి స్థిమితం తప్పినప్పుడు ఆ సంగతి ఒప్పుకోవటం ఇష్టంలేక కారణాలు వెదకటంలో సులభంగా దొరికేది ఈ "మందుపెట్టటం" అనేది

**ఎస్. ఆర్. ఆర్. — బెంగుళూరు**

మీ సలహాల శీర్షికలో 'సర్కమ్‌సిషన్' ఆపరేషన్ గురించి చదివాను నేను 28 సంవత్సరముల అవివాహితుణ్ణి నా పురుషాంగం చివర చర్మము వున్నది దాని ఆపరేషన్‌కు ఏ డాక్టరును కన్సల్ట్ చేయాలి?

★ శస్త్ర వైద్యులు ఎవరైనా ఈ ఆపరేషన్ చేస్తారు దీనికి బెడ్‌మీద ఉండవలసిన అవసరం లేదు ●

సీరియల్

# రేపటి ఉదయం

## ప్రతాప రవిశంకర్

అనసూయ ఎదురుచూసిన అవకాశం ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు వచ్చింది

అందరూ భోజనాలు చేశారు ఇంట్లో ఒక్క కాశీపతి తప్పించి అందరూ వున్నారు మంచాలు వేసుకుని ఆరుబయట ఇంటిముందు కూర్చున్నారు అనసూయ పిల్లలిద్దరూ అప్పటికే నిద్రపోయారు

రామేశం మంచంమీద అడ్డంగా పడుకుని సిగరెట్టు కాలుస్తూ పొగను రింగులు రింగులుగా బయటకు వదులుతున్నాడు

ఒక మంచంమీద మేష్టారు, ఆయన నాలుగో కూతురు కూర్చున్నారు మరో మంచంమీద తల్లి, ముగ్గురు కూతుళ్లు కూర్చున్నారు

అనసూయ ఏవేవో కబుర్లు చెబుతూ టాపిక్‌ని పెళ్లిళ్లమీదకు తీసుకువెళ్లింది రామేశం మాత్రం ఏమీ మాట్లాడకుండా సిగరెట్టు కాలుస్తూనే వున్నాడు

"రామేశం ఇంకా ఎన్ని రోజులు నీ ఈ బ్రహ్మచారి వ్రతం ఈ వ్రతం పూర్తికాలేదా ?" అనడిగింది నవ్వుతూ

అనసూయ అలా అడగ్గానే మేష్టారి నాలుగో కూతురు శశి వెంటనే నవ్వేసి "బ్రహ్మచారి వ్రతమా" అన్నది

"అవును లేకపోతే పెళ్లీ పెటాకులూ లేకుండా ఎన్ని రోజులూ ఇలా సిగరెట్లు కాల్చుకుంటూ పడుకోవటం" అన్నది

"అవునా ఇంకా ఎన్ని రోజులు ? అమ్మ నీ పెళ్లి గురించి అడగలేదా ఏమిటి ?" అన్నది మేష్టారి భార్య

"అబ్బ ఒకళ్లకు ఇద్దరు మొదలుపెట్టారా ఈ పెళ్లి సొద ? ఇప్పుడెందుకు పెళ్లి గొడవ" అన్నాడు రామేశం

"పెళ్లి గొడవ కాదు నాయనా పెళ్లి చేసుకోకపోతేనే గొడవ ఇప్పుడు నీకు ఎన్నేళ్లను

(గత సంచిక తరువాయి)

కుంటున్నావ్ ? ముప్పయ్యేళ్లవాడివి చిన్నవాడివేం కాదు నువ్వు సరేనంటే నీకో మంచి సంబంధం చెబుతాను" అన్నది అనసూయ

"మంచి సంబంధమా ? ఏమాత్రం కట్నం ఇస్తారేమిటి ?" అన్నాడు రామేశం వెంటనే

"నీకు కట్నం ముఖ్యమా ? ఆడపిల్ల అందచందాలు ముఖ్యమా ?"

"రెండూ కావాలి" అన్నాడు రామేశం తెలివిగా

"రెండూ కావాలంటే కుదరదు అమ్మాయి అందమే నువ్వు కట్నం అనుకోవాలి అయినా నీకు కట్నం ఎందుకోయ్ ఆ కట్నం తీసుకుని నువ్వు ఎంత మంది పెళ్ళిళ్ళు చెయ్యాలి ? కట్నంతో నీకు అవసరం లేదు కాబట్టి నేను చెప్పినట్టు విని నేను చూపించిన అమ్మాయిని పెళ్లి చేసుకోటానికి ఒప్పుకో బాబూ" అన్నది

"ఎవరా అమ్మాయి ?" అన్నాడు రామేశం

"ఇంకెవరో కాదు మన సులోచనే" అన్నది

అక్కయ్యమాట వినగానే ఉలిక్కిపడింది సులోచన

"సులోచనా ?" అన్నాడు రామేశం వెంటనే

"అవును సులోచనే ఏం చేదా ? దానికేం తక్కువ బంగారు బొమ్మ దాన్ని చేసుకో అక్కయ్య కూతురు వుండగా కట్నం కోసం ఇంకెవర్నో చేసుకుంటావా ? మీ నాన్న చేసుకున్నాడు ? బాగా ఆలోచించుకో" అన్నది అనసూయ

అనసూయ ఎదుటి మనిషి తప్పించుకోటానికి వీల్లేకుండా మాట్లాడుతుందనే విషయం ఇంకోసారి రుజువయ్యింది ఈ విషయం రామేశానికి బాగా తెలుసు అందుకే అతను సందిగ్ధంలో పడిపోయాడు అతనికీ కట్నం మీద ఆశ బాగానే వుంది కానీ సులోచన మీద అంతరంగంలో కోరిక కూడా లేక

పోలేదు అనసూయ చెప్పినదాన్లో అసత్యం కానీ, అతిశయోక్తి కాని ఏమీ లేవు సులోచన నిజంగానే అందమయినది అందం విషయంలో ఎవ్వరూ ఆమెకు వంక పెట్టలేరు

"మాట్లాడవేం రామేశం?" అన్నది కొంచెం సేపటి తర్వాత

"మరీ తొందరపెట్టకే అమ్మాయ్ అతన్ని కొంచెం ఆలోచించుకోనీ" అన్నాడు మేష్టారు, పెద్ద కూతురు బావమరదిని తొందరపెట్టటం చూసి

"సరే ఈ రాత్రంతా బాగా ఆలోచించుకో ఏమాలోచించుకున్నా నువ్వు సులోచనను చేసుకోవాల్సిందే ఇది మాత్రం— నిజం" అన్నది అనసూయ చివరగా,

ఆ తర్వాత ఈ విషయం గురించి ఎవ్వరూ మాట్లాడలేదు

ఈ సంభాషణనంతా సులోచన మాత్రం వూపిరి బిగపట్టి విన్నది ఆమెకు గుండెలు దడదడా కొట్టుకున్నాయి ఎక్కడ రామేశం 'తనని చేసుకోవడం ఇష్టమేనని వెంటనే చెప్పేస్తాడో'నని భయమేసింది అతను తనని చేసుకోవటం ఇష్టం లేదని చెబితే బావుండుననుకుంది

ఆమె హృదయంలో ఒక్క నిరంజనానికే చోటు వుంది మరో మనిషి గురించిన ఆలోచనే సులోచనకు లేదు అటువంటప్పుడు సులోచన తన మామయ్యను భర్తగా వూహించుకోగలదా ??

ఆ రాత్రి సులోచనకు నిద్ర పట్టలేదు ఆమె హృదయాన్ని ఒక విధమైన భయం చీకటి తెరలా కప్పివేసింది

రామేశానికి తనంటే ఇష్టంలేకుండా వుండేలా చెయ్యమని మనసులోనే దేవుడికి దణ్ణాలు పెట్టుకుంది

ఆరోజు తెల్లవారుజామునకు ఎప్పటికో సులోచన నిద్రపోయింది

ఆ రాత్రి కాశీపతి ఇంటికి రాలేదు తెల్లవారిన తర్వాత వచ్చాడు అలా వచ్చిన కాశీపతి నిద్రపోలేదు మెలుకువగానే వున్నాడు మొహం కడుక్కుని కాఫీ తాగాడు

తర్వాత రామేశంతో కలిసి కాలవకట్టకు బయల్దేరాడు ఇద్దరూ కట్టమీదకు వచ్చారు

రామేశం రాత్రి జరిగిన సంభాషణ గురించి కాశీపతితో చెప్పాడు

ఊరిబయట కావటంవల్ల గాలి ఎవరొ

**జరిగిన కథ — 3 :** రంగనాథం మేష్టారు ఆ వూర్లోని బడిలో హెడ్‌మాస్టర్ ఆయన భార్య సత్యవతమ్మ వీరికి సంతానం నలుగురు కూతుళ్లు, ఓ కొడుకు రెండో కూతురు సరళ చిన్నతనంలోనే వైధవ్యం ప్రాప్తించి పుట్టింటికి చేరుతుంది మూడో కూతురు సులోచన మేష్టారి ప్రియశిష్యుడు నిరంజనంను ప్రేమిస్తుంటుంది అతను బియ్యే చదివినా ఏ ఉద్యోగం రాక పట్నంలోని ఓ సినిమా హాలులో పనిచేస్తుంటాడు ఇక ఒక్కగానొక్క కొడుకు కాశీపతి ఇంటర్ నాలుగుసార్లు తప్పి చదువుకు స్వస్తి చెప్పి రోడ్లను సర్వే చేస్తుంటాడు ఆఖరి కూతురు శశి మిలటరీలో పనిచేస్తున్న రంగనాథం బామ్మర్ది రామేశం చాలాకాలం తరువాత ఆ ఇంటికి వస్తాడు కాశీపతి సినిమాహాల్లో గేటుకీపరుగా జేరతాడు చెరువు దగ్గర వేణుగోపాల్ సరళతో మాట కలుపుతాడు

తరుముకు వస్తున్నట్టు రివ్వున వీస్తోంది కాలువలో వున్న నీళ్లలో వుండుండి చిన్న చిన్న చేపపిల్లలు ఎగిరిపడుతున్నాయి

"మరి ఇంతకీ నువ్వు ఏమాలోచించుకున్నావ్ ?" అడిగాడు కాశీపతి సిగరెట్టు వెలిగించుకుని

"నేనూ మీ కుటుంబ పరిస్థితులను దృష్టిలో వుంచుకుని సులోచనను చేసుకోటానికే నిర్ణయించుకున్నాను" అన్నాడు రామేశం గాలికి ఎగురుతున్న చిన్న వెంట్రుకలను చేత్తో అదిమిపెడుతూ

"అయితే మా నాన్న ఛాన్స్ కొట్టేసినట్టే" అన్నాడు కాశీపతి

"అవును అంతేమరి "అని నవ్వాడు రామేశం

అని "అవునూ నువ్వు రాత్రికి ఇంటికి రాలేదేం ?" అన్నాడు రామేశం

దానికి నవ్వివూరుకున్నాడు కాశీపతి

"మాట్లాడవేం? ఎందుకని రాలేదు?" మళ్ళీ అడిగాడు

"దానికో కారణం వుందిలే"

"కారణమా ? ఏమిటది? కొంపదీసి ఏదైనా వ్యవహారంలో పడ్డావా ఏమిటి?"

"నువ్వు ఎవ్వరితోనూ చెప్పనంటే ఈరహస్యం నీకు చెబుతాను లేకపోతే చెప్పను" అన్నాడు కాశీపతి

"ఎవరికీ చెప్పనులే ఫర్వాలేదు చెప్పు"

"చెప్పనులే అంటే కాదు నిజంగానే చెప్పకూడదు చెబితె కొంపలు అంటుకుంటాయి నేను ఒక అమ్మాయిని ప్రేమిస్తున్నాను ఆ అమ్మాయికి కూడా నేనంటే ఇష్టమే రాత్రి ఆ అమ్మాయి సినిమాకు వచ్చింది సినిమా అయిపోయిన తర్వాత ఇద్దరం అక్కడక్కడ తిరిగాము" అని చెప్పి వెంటనే సిగ్గుపడిపోయాడు కాశీపతి

కాశీపతి అలా సిగ్గుపడిపోవటాన్ని చూసి, రాత్రి కాశీపతి—ఆ అమ్మాయి ఎంతదూరం వెళ్లారో వెంటనే ఏ మాత్రం ఆలస్యం లేకుండా గ్రహించగలిగాడు రామేశం

"అంతా అర్థమయింది లక్కీ ఫెలోవి ముందు ఒక షేక్‌హాండ్ ఇట్లా పారేయ్" అని కాశీపతి చేతిని తీసుకుని షేక్‌హాండిచ్చాడు రామేశం

తర్వాత "ఇంతకీ ఎవరా అమ్మాయి ? ఎట్లా వుంటుంది? ఏవూరు? ఈ వివరాలన్నీ చెప్పెయ్యాలి" అని తొందర చేశాడు

"ఆ అమ్మాయిది ఈవూరే ఆ అమ్మాయికి తల్లిలేదు తండ్రి, ఇద్దరు అన్నయ్యలు వున్నారు తండ్రి ముసలాడు అన్నయ్యలిద్దరూ తాపీ పని చేస్తారు ఆ అమ్మాయి పేరు కోటమ్మ ఫిగర్ బ్రహ్మాండంగా వుంటుంది రబ్బరు బొమ్మనుకో" అన్నాడు

"ఒకసారి నాకు చూపించవా ?" అన్నాడు రామేశం

"చూపిస్తాను అసలు నిన్ను ఇటువైపు ఎందుకు తీసుకువచ్చాననుకున్నావ్ నిద్రపోకుండా కోటమ్మ ఈ టైముకు కాలువకట్టకు వస్తానని చెప్పింది అందుకే" అని కట్టమీద నిలబడి పొలాల మధ్యగా డొంకలోకి చూశాడు అతను

నిముషం తర్వాత అతనికి డొంక దారిలో గబగబా వస్తున్న కోటమ్మ కనిపించింది

"అదిగో అదిగో కోటమ్మ వచ్చేస్తోంది" సంతోషంతో అటువైపుకు చూపిస్తూ చెప్పాడు కాశీపతి

ఐదు నిముషాల తర్వాత కోటమ్మ పొలాల మధ్య నించి కాలవ కట్టమీదకు వచ్చింది

కాశీపతిని చూడగానే చిరునవ్వు నవ్వింది

నల్లగా తుమ్మమొద్దులా వుంది ఆమె అయితే పుష్టిగా బలంగా వుంది సంపుసొంపులన్నీ నిండుగా వున్నాయి

కాశీపతి కోటమ్మ వ్యామోహంలో ఏం చూసి పడిపోయాడో సులభంగానే గ్రహించాడు రామేశం

"ఈయనే నేను చెప్పిన మిత్రుడి మామయ్య" కోటమ్మకు రామేశాన్ని పరిచయం చేశాడు కాశీపతి

కోటమ్మ ఒక్కసారి రామేశాన్ని చూసి తర్వాత "ఎంత సేపయిందొచ్చి ?" అన్నది

"ఇప్పుడే" అన్నాడు కాశీపతి

రామేశం – కోటమ్మ సంపుసొంపులను పరిశీలిస్తుండగా, కాశీపతి మామయ్యను పక్కకు పిలి చెవిలో రహస్యంగా "మేమిద్దరం కొంచెం మాట్లాడకోవాలి మామయ్యా నువ్వెళ్లి చెరువు కట్టమీద కూర్చో నేనో గంటలో వస్తాను" అన్నాడ చిన్నగా

రామేశానికి వాళ్లిద్దరూ ఏం మాట్లాడకుంటారో అర్థమయిపోయింది ఉస్సూరుమంటూ అలాగేనని నీరసంగా కాలవకట్ట వెంబడే నడ మొదలుపెట్టాడు

## 11

ప్రేతకళ కప్పివేసిన మనిషిలా వున్నదా వూరు చీకటి వూరినంతటినీ నల్లటి దుప్పటిలా కప్పివేసింది

బిందె తీసుకుని చెరువుకు బయల్దేరింది సరళ

"ఏమిటే ఈమధ్య రోజూ సాయంత్రానికే నీళ్లు అయిపోతున్నాయి" అన్నది సులోచన

"ఏమో అయినా ఇంట్లో మనుషులు పెరగ లేదూ " అన్నది సరళ బయటకు వస్తూ

మేష్టారు ఎక్కడికో వెళ్లాడు

అలవాటయిన దారికాబట్టి సరళ గబగబా నడుస్తోంది ఆమె అడుగులు తడబడుతున్నాయి గుండెలు చిన్నగా అదురుతున్నాయి

చెరువు దగ్గర తనకోసం అతను ఎదురు చూస్తూ వుంటాడని సరళకు తెలుసు అతని కళ్లు అనుక్షణం తనకోసం ఎదురుచూస్తూ వుంటాయని ఆమె తెలుసుకున్నది

అందుకే ఆరోజు అతను కోరినట్టుగా అతనంటే తనకు ఇష్టమేనన్న విషయాన్ని తెలియబరచటానికి మరురోజు కూడా చీకటి పడిన వేళకు బిందెతో చెరువు దగ్గరకు వెళ్లింది

ఆ క్షణంలో సరళహృదయం నిండా అలజడే

ఆరోజు చీకటిపడే సమయానికి అతన్ని కలవటానికి వెళ్లటం గురించి ఆ రోజంతా ఎంతగానో ఆలోచించింది



# రేపటి ఉదయం

అతని ముఖం, మాటలు పదే పదే గుర్తు చేసుకున్నప్పుడు ఆతని మీద చెప్పలేనంత నమ్మకం కుదిరింది

ఏమో ! వాడిపోయిన తన జీవితం తిరిగి చిగిర్చే అవకాశం వచ్చిందేమో ! ఈ అవకాశాన్ని జారవిడుచుకుంటే తను జీవితాంతం ఇలాగే అందరి సానుభూతినీ, జాలినీ పొందుతూ బతకవలసి రావచ్చు అయినా ఎవరో ఒకర్ని నమ్మకపోతే తన బతుకులో పువ్వులు పూసేదెలా ??

"రక్షించారు మీరు వస్తారో రారోనని భయపడుతున్నాను" అన్నాడు సరళను చూడగానే వేణుగోపాల్

ఆమె వెంటనే మాట్లాడలేకపోయింది

అతను ఆమెకు దగ్గరగావచ్చి నిలబడ్డాడు, కలవరపడింది సరళ మళ్లీ ఎన్నోరోజుల తర్వాత ఓ మగాడి పక్కనే ఇలా గుండెలనిండా అలజడితో నిలబడటం

"ఇంతకీ నేను అదృష్టవంతుడిని" చిన్నగా గుసగుసలాడుతున్నట్టుగా అన్నాడు వేణుగోపాల్

భయంగా వుంది సరళకు ఎవరయినా అటువైపు వస్తే దగ్గరిగా నిలబడిన అతన్నీ తననీ చూస్తే ?

అవును చూస్తే ఏమవుతుంది ??

"మీతో చాలా మాట్లాడాలి"

తలెత్తి ఆ చీకట్లోనే అతని మొహంలోకి చూసింది సరళ నక్షత్రాల వెలుగులో మెరుస్తున్న అతడి కళ్ళు కనిపించాయి వెంటనే తల దించుకుంది

"నేనంటే మీకు ఇష్టమేనా ?" సరళ భుజం మీద చెయ్యి వేస్తూ అడిగాడు వేణుగోపాల్

ఒళ్లు ఝల్లుమంది సరళకు శరీరమంతా ఒక్కసారిగా వణికింది ఏదో కంపనం

చిన్నగా నొక్కుతూ "మీకు మాటలు రావా ? చెప్పరేం ? ఈ వేణుగోపాలంటే మీకు ఇష్టమేనా?" అడిగాడు

తల వూపింది ఏదో పరవశంతో

అతను ఏదో మాట్లాడబోయాడు కాని దగ్గరినించి చెరువు కట్టమీదగా వస్తున్న ఏదో ఎద్దుల బండి చప్పుడు వినిపించింది

వెంటనే అతను దూరమయ్యాడు సరళ గబగబా మెట్లుదిగి బిందెతో నీళ్లు ముంచుకుని వెళ్లిపోయింది

ఆ రాత్రి సరళకు నిద్రపట్టలేదు కనులనిండా వేణుగోపాల్ రూపమే ఇప్పటికీ తను ఆ సందేహం నించి బయటపడలేక పోతున్నది చనిపోయిన ఆయన పోలికలు ఈ వేణుగోపాల్‌లో ఎంత బాగా కనిపిస్తున్నాయి అందువల్లనే తను అతన్ని ప్రేమించగలుగుతున్నదా ? అతనంటే ఇష్టపడుతున్నదా ??

*　*　*

"ఏమండోయ్ ?" మెట్ల పక్కనే నిలబడి వున్నాడు వేణుగోపాల్

అతన్ని చూసింది

"ఏమిటి ఇవాళ ఇంత ఆలస్యమయింది ? మీకోసం ఎప్పటినించి ఎదురు చూస్తున్నానో తెలుసా మీకు ?"

మాట్లాడలేదు సరళ

ఆశ్చర్యం ! అతని దగ్గిర ఎందువల్లనో సరళ మాట్లాడలేకపోతున్నది అతనిలో ఏదో గొప్ప ఆకర్షణ వున్నది ఆ ఆకర్షణకు సరళ బాగా లోబడి పోతున్నది

మెట్లమీదకు వచ్చింది

వేణుగోపాల్ ఆమె పక్కకువచ్చి నిలబడి ఆమె భుజాలమీద చేతులు వేశాడు

సరళ పరవశించిపోయింది ఆ స్పర్శతో

'ఇవాళ గుళ్లో ఎవరో ఆకుపూజ చేయిస్తున్నారు తెలుసా ?" అడిగాడు

తెలుసన్నట్టు తల వూపింది సరళ

"భజన కూడా వుంది"

మళ్లీ తల వూపింది ఆ రాత్రికి ఆకుపూజ వున్నట్టూ, భజన కూడా జరుగుతుందనీ సాయంత్రం తన తండ్రి తల్లితో చెబుతున్నప్పుడు సరళ విన్నది వాళ్లు భజనకు వెళ్లాలని కూడా నిశ్చయించుకున్నారు

"అంటే భజన పూర్తయ్యేసరికి రాత్రి పదకొండు గంటలవుతుంది కాబట్టి నాదొక మనవి వింటారా ?"

తల వూపింది సరళ

"కొంచెం పొద్దుపోయిన తర్వాత గుళ్లో భజన మొదలయిన తర్వాత నేను మీ ఇంటి వెనక వున్న ఖాళీ స్థలంలోకి వస్తాను మీరుకూడా రండి మాట్లాడుకుందాం"

ఉలిక్కిపడింది సరళ

రహస్యంగా తను రాత్రివేళ అతన్ని తమ ఇంటి వెనుక కలుసుకోవటమా ?

కలుసుకుంటే ఏమవుతుంది? అతను తనతో ఏం మాట్లాడతాడు? బహుశ పెళ్లి గురించి మాట్లాడవచ్చు

సరళ మనసులో అతను కోరినట్టుగా ఆ రాత్రి అతన్ని కలుసుకోవటానికే నిర్ణయించుకుంది

ఈ అవకాశాన్ని తను వదులుకోకూడదు అతనితో అన్ని విషయాలూ మాట్లాడాలి

ఈ రోజుతో తన బతుకు ఓ మలుపు తిరుగుతుంది

"వస్తారు కదూ ఇది మనకు అపూర్వమైన అవకాశం" చిన్నగా అన్నాడు వేణుగోపాల్ ఆమె భుజం నిమురుతూ

తల వూపింది సరళ

"ధన్యుడిని సరళా" చటుక్కున ఆమె బుగ్గ మీద ముద్దు పెట్టుకుని అక్కడినించి వెళ్ళిపోయాడు వేణుగోపాల్

ఒళ్లంతా కరెంటు షాక్ తగిలినట్టు అయిపోగ చేతిలోవున్న బిందెను వదిలేసింది సరళ

## 12

ఆ రోజు రాత్రి భోజనాలప్పుడు రామేశం తనకు సులోచనను చేసుకోవటం ఇష్టమేనన్న విషయాన్ని బయట పెట్టేశాడు,

ఆ వార్త ఒక్క సులోచనకు తప్పించి మిగిలిన అందరికీ సంతోషంతో ఇక అన్నం సయించలేదు

మేష్టారు, ఆయన భార్య హాయిగా వూపిరి పీల్చుకున్నారు

నిజానికి ఆ క్రితం రోజు రాత్రికే రామేశం ఈ నిర్ణయాన్ని తీసుకున్నా కావాలనే ఇంకా ఆలోచించదలచి అప్పటి వరకూ వాళ్లకు తెలియ బరచలేదు ఆ రోజు ఉదయం కాశీపతికి చెప్పినా అతన్ని కూడా అప్పుడే ఇంట్లో చెప్పవద్దన్నాడు

"మొత్తానికి నా మాటమీద విలువ వుంచావు రామేశం" అన్నది అనసూయ సంతోషంగా

"నీకెలా కృతజ్ఞతలు తెలియజేసుకోవాలో తెలీటంలేదు రామేశం" అన్నాడు మేష్టారు

"ఇంతకీ మన సులోచన అదృష్టవంతురాలు" అన్నది మేష్టారి భార్య

సులోచనకు ఆ మాటలు వింటుంటే కంపరం పుడుతున్నట్టు అనిపించింది కంచంలో చెయ్యికడిగి అక్కడినించి వెళ్లిపోయింది

ఆమె చర్యకు అంతా ఆశ్చర్యపోయారు

"దానికి పొద్దుటినించీ ఒంట్లో బావుండలేదు" అన్నది అనసూయ

అందువల్ల ఎవ్వరూ ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు

*　*　*

చీకటి చిక్కబడింది

ఆంజనేయస్వామిగుళ్లో భజన మొదలయ్యింది

మేష్టారు భార్యను తొందర చేశాడు

అనసూయ తను కూడా వస్తానన్నది

రామేశం కూడా గుడికి బయల్దేరాడు

చివరికి అందరూ కలిసి సులోచనను కూడా గుడికి రమ్మన్నారు

రామేశం తన నిర్ణయం తెలియజేసిన తర్వాత ఇదంతా ఆ దేవుడి దయేనన్న నమ్మకం మేష్టారికి కలిగింది

అందుకే మొత్తానికి సులోచనను బలవంతం చేసి గుడికి తీసుకువెళ్లారు

వెళుతూ "ఇంట్లో నువ్వొక్కదానివే వుండగలవుటే" అన్నది అనసూయ సరళతో

"నాకేం భయం ? తలుపులు వేసుకుని పడుకుంటాను అయినా పిల్లలు వున్నారు కదా" అన్నది సరళ

## అనువాద యంత్రాలు !

జపానులో కొన్ని సంస్థలు అనువాద యంత్రాలను తయారు చేయటానికి కృషి చేస్తున్నాయి ఇందులో విశ్వవిద్యాలయాలు, ఎలక్ట్రానిక్ సంస్థలు, అనువాద సంస్థలు, ప్రభుత్వ సంస్థలు ఉన్నాయి చెప్పినదానిని అర్థం చేసుకుని ధారాళంగా మాట్లాడే చిన్న యంత్రాలు తయారవుతున్నాయి జపాను, ఇంగ్లీషు భాషల్లోకి తర్జుమా చేసేందుకు యంత్రాలను ఉపయోగించబోతున్నట్లు ఒక సంస్థ ప్రకటించింది అయితే వీరు సాంకేతిక పదాలను మాత్రం అనువదిస్తారు వీరు తయారు చేసిన మందులు 80 శాతం మేరకు ఖచ్చితంగా తర్జుమా చేయ కలుగుతున్నట్లు ఆ సంస్థ ప్రతినిధి తెలియచేశారు

వాళ్ళు వెళ్లగానే తలుపులు మూసింది.

పది నిముషాల తర్వాత చిన్నగా ఇంటి వెనుక తలుపులు తెరిచి బయటకు వచ్చింది...

అంతా చీకటిగా వున్నది ... అయినా ఆ చీకట్లోనే కొంచెం దూరంగా నిలబడివున్న వేణుగోపాల్‌ను గుర్తించింది.

''సరళా'' రహస్యంగా పిల్చాడు అతను.

నాగస్వరం విన్న పాములా అయిపోయింది సరళ.

తలుపులను మూసి గొళ్లెం పెట్టింది.

అక్కడంతా పచ్చని గడ్డి మొలిచివున్నది. అతను దగ్గరగా వచ్చాడు.

''అందరూ వెళ్లిపోయారా ?''

తల వూపింది.

''ఇక మనకు భయంలేదు'' అన్నాడు బుగ్గమీద చెయ్యివేసి నిమురుతూ.

ఆ స్పర్శతో సరళకు ఎక్కడో విహరిస్తున్నట్టుగా అనిపించింది.

''ఇక్కడ కూర్చుందామా ?''

తల వూపింది ...

ఇద్దరూ పక్కపక్కనే కూర్చున్నారు.

సరళకు భయంగానూ, ఇష్టంగానూ వున్నది.

తను ఇలా ప్రవర్తించటం ఎంతవరకు న్యాయం? తను తప్పటడుగు వేయటం లేదుకదా?

ఆమెను ఆలోచించనివ్వకుండా అతడు ఆమె వీపుమీద చెయ్యివేసి నిమురుతూ ''నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నా గుండెనిండా నువ్వే వున్నావు'' అన్నాడు చిన్నగా రహస్యం చెబుతున్నట్టు.

సరళ అతని వూపిరి తగిలి మెలికలు తిరిగి పోతున్నట్టు ఫీలయ్యింది. క్రమంగా ఆమెలో చోటు చేసుకున్న భయం తొలిగిపోతూ దాని స్థానంలో కోరిక చెలరేగుతున్నది. ఎన్నాళ్లనించో అణగివున్న కోరిక !

క్రమంగా వయసు పురివిప్పుతున్నది.

ఆమెలో వస్తున్న కదలికలను అతను జాగ్రత్తగా గమనిస్తూ ''నువ్వు నా ప్రాణం సరళా. నువ్వు లేకుండా నేను జీవించలేను'' అన్నాడు ఆమె భుజం మీద గడ్డంతో చిన్నగా నొక్కి.

ఉలిక్కి పడింది ఆమె.

''మాట్లాడవేం?? నాకు నీ మాటలు వినాలని వుంది.''

''ఏం మాట్లాడను?'' చిన్నగా అన్నది సరళ.

''ఏదయినా సరే... ఇంత అందాన్ని అనుభవించకుండా పోవటం ఆయన దురదృష్టం.''

సరళ మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది.

ఆయనకు తను అన్యాయం చేస్తున్నదా ?

ఏమో... తనకేమీ తెలీటంలేదు. తనొక మత్తులో పడిపోయింది. వేణుగోపాల్‌లో వున్న ఆకర్షణకు తను లోబడిపోతున్నది— కాదు— తన బ్రతుకును చిగురింప చేసుకోటానికి ప్రయత్నిస్తున్నది—

ఇందులో ఏది నిజం ??

## 'ఇ'వేమన పద్యాలు







''ఏమిటి ఆలోచిస్తున్నావ్ ?'' అడిగాడు వేణుగోపాల్.

''ఏమీలేదు ...'' చిన్నగా అన్నది.

''కాదు... నువ్వు ఆలోచిస్తున్నావు... నాతో చెప్పకూడదా... ఏమిటి నువ్వు ఆలోచిస్తున్నది ?'' ఆమె మొహంలో మొహం వుంచి అడిగాడు.

''మన పెళ్లి గురించి.''

చిన్నగా నవ్వాడు వేణుగోపాల్ ... ''పంచభూతాలసాక్షిగా ఈ క్షణమే మన పెళ్లి అయినట్టు లెక్క ... నువ్వు నా అర్ధాంగివి సరళా'' అన్నాడు ఆమెను ఆక్రమించుకుంటూ.

ఆమె అతన్ని వారించలేకపోయింది.

ఆ చీకటి రాత్రిలో ఆరుబయట ఆకాశం పందిరికింద మేష్టారి విధవకూతురు సరళ అతనిలో లీనమయ్యింది.

(ఇంకా వుంది)



# సినిమా



'రాజా—రాణీ—జాకీ'లో చంద్రమోహన్, రాధిక

## "త్రివేణీ సంగమం"

"ఈ సమాజంలో అడుగడుగునా అవమానాలకు, అవస్థలకు బలియైన ఒక స్త్రీ జీవిత సంఘర్షణ. ముగ్గురిమధ్య ప్రధానంగా జరిగే ఈ కథను ప్రముఖ తమిళ పాత్రికేయుడు, దర్శక నిర్మాత మదివోలి షణ్ముగం రాశారు," అన్నారు ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అధినేత కె. రాఘవ... సుమన్, తరంగిణి, గొల్లపూడి, పి. ఎల్. నారాయణ, కాకినాడ శ్యామల ఆదిగా గలవారు పాల్గొంటారు. ఫిబ్రవరి 19 నుంచి 21 వరకు జె. వి. రాఘవులు సంగీత దర్శకత్వంలో సి. నారాయణరెడ్డి గీతాలు రికార్డయ్యాయి. పి. లక్ష్మణ్ ఛాయ, బాలు కూర్పుతో ఈ చిత్రానికి తొలిసారిగా కొమ్మినేని కృష్ణమూర్తి దర్శకత్వం వహిస్తున్నారు. సెన్సార్ సభ్యుడైన ఈయన గతంలో "తాత — మనవడు, మేనకోడలు, దొరబాబు" చిత్రాలకు సహకార దర్శకుడుగా పనిచేశారు. ఈ చిత్రం షూటింగ్ మొత్తం మార్చి 1 నుంచి ఏప్రిల్ 1 వరకు హైదరాబాద్ పరిసరాలలో జరుగుతుంది.

## "రాజా-రాణీ జాకీ" త్వరలో విడుదల

"పుట్టుగొప్ప ఎంత ఉన్నతమైనదైనా—పెరిగే వాతావరణం వ్యక్తుల ప్రవర్తనమీద, మనస్తత్వాల మీద తన ప్రభావాన్ని తప్పకుండా ప్రసరిస్తుంది... మానసిక బలహీనతలో ప్రతి మనిషీ కొన్ని తప్పులు చేయక తప్పదు. ప్రముఖ వాణిజ్యవేత్త జగన్నాథ్ కూడా అలాంటి పొరబాటు చేశాడు. తాళి కట్టిన భార్య ఉండగానే మరో యువతికి మనసిచ్చి పుచ్చుకొని ఆమె కన్నెగానే తల్లి అయ్యేందుకు అవకాశం కల్పించాడు. అతను చేసిన నేరానికి శిక్షగా ఆ యువతి అన్న తనకసిని ఒక విధంగా తీర్చుకున్నాడు. అయితే, ఆ కసి పరాకాష్ఠలో ఓ విందు జీవితంతో ఆటలాడుకుంటుందని తెలుసుకోలేక పోయాడు. ఫలితం? ఎన్నో అనూహ్యమైన మలుపులుగల ఎస్. కృష్ణం రాజా చిత్రం నవత ఆర్ట్స్ "రాజా—రాణీ—జాకీ"లో రాధిక ద్విపాత్రాభినయం విశేషాకర్షణ. చంద్రమోహన్, రంగనాథ్, గొల్లపూడి మారుతీరావు, దేవదాస్ కనకాల, సుత్తివేలు, జయభాస్కర్, దీప, శ్రీలక్ష్మి, సత్తిబాబు, వంగా అప్పారావు, జయదేవ్ పాల్గొన్నారు. సర్వసాధారణంగా నవత చిత్రాలన్నిటిలోనూ నిండుగా ఉండే సంగీత సాహిత్యాల సౌరభం ఈ చిత్రంలో మరింతగా పరిణమించింది. గొల్లపూడి మారుతీరావు సంభాషణలు, వేటూరి సుందరరామమూర్తి గీతాలు, రాజన్—నాగేంద్ర సంగీతం, లోక్‌సింగ్ ఛాయ, మారసనేని కళాధర్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పు, ఎస్. అచ్యుతరామరాజు నిర్మాణ సారధ్యం వహించారు. సెంగీతం శ్రీనివాసరావు దర్శకుడు.

## మాదాల రంగారావు "స్వరాజ్యం"

మాదాల రంగారావుది ఓ ఉద్యమం. ఆయన చిత్రాలు రూపొందిస్తున్నది వ్యాపారపరంగా మాత్రమే కాదు; ప్రజల్లో పాతుకుపోయిన మూఢ విశ్వాసాలమీద, బలహీన వర్గాలపై పెత్తందారీల అన్యాయాలమీద, కులమత తత్వంమీద ప్రబోధాత్మకమైన చిత్రాలు నిర్మించడమే ఆయన ధ్యేయం. ఎందుకో సెన్సార్‌వారు భూతద్దంతో ఆయన చిత్రాలను చూస్తున్నారు. ప్రముఖ ప్రతిపక్ష నాయకుల పూనికతో, అనేకచోట్ల యువజన సంఘాల విజ్ఞప్తులతో, నిరాహారదీక్షలతో గాని ఆయన చిత్రాలకు సెన్సార్ వారి అస్తు ముద్ర లభించడం లేదు. "మనకు ప్రాంతీయ సెన్సార్ బోర్డ్ ఆవశ్యకత ఎంతైనా ఉంది. మన భాషాచిత్రాలను మనభాష తెలిసిన సెన్సార్ సభ్యులే పరిశీలించాలి. చలనచిత్ర పరిశ్రమలోని అనుభవజ్ఞులు, పాత్రికేయులు సభ్యులుగా ఉండడం అవసరం. సెన్సారింగ్‌లో ద్వంద్వ వైఖరి ఉండకూడదు," అని ఉద్ఘాటించారు ఇటీవల మాదాల రంగారావు "ప్రజాశక్తి" విడుదల సందర్భంలో సమావేశపరచిన పాత్రికేయులతో. ఈయన కొత్త చిత్రం "స్వరాజ్యం"లో శ్రీ.శ్రీ., అదృష్టదీపక్, భుజంగరాయశర్మ, జి. ఎస్. రావు రాసిన గీతాలను వినిపించారు కూడా. 'అసలిప్పుడు స్వరాజ్యాన్ని అనుభవిస్తున్న దెవరు ? నిజమైన స్వరాజ్యం మానవుడికి అందుబాటయ్యేది ఎప్పుడు, ఎలా ?' అనే అంశాలు గల ఇతివృత్తాన్ని మాదాల రంగారావే రాయగా, ప్రముఖ పాత్రికేయుడు కాగడా శర్మ మరఫిరంగుల లాంటి సంభాషణలను రాశారు. చక్రవర్తి సంగీతం, ఆర్. రామారావు ఛాయ, ఉర్ఫి శిల్పంతో బీరం మస్తాన్‌రావు దర్శకుడు.

## "అరణ్యరోదన" కాదు, "రోజులు మారాయి"

"శ్రీ విజయసారథీ ఆర్ట్స్ పిక్చర్స్ వారి చిత్రానికి 'రోజులు మారాయి'గా పేరు మార్చాం," అని తెలిపారు డైరెక్టర్ వేజెళ్ళ సత్యనారాయణ. ఉండ్రాజవరం గ్రామంలో ఫిబ్రవరి 7న ప్రారంభమైన ఈ చిత్రం 22 రోజుల్లో నాలుగు పాటలతో పాటు, మొత్తం షూటింగ్ పూర్తి చేసుకుంది. "డబ్బింగ్ కూడా పూర్తయింది. మార్చి 21 నుంచి



'సమాజంలో స్త్రీ'
విజయశాంతితో భానుచందర్

# విశేషాలు

-జి. వి. జి.

25 వరకు రీ రికార్డింగ్ జరుగుతుంది అన్నారు ఈ చిత్ర నిర్మాత వై. కేశవరెడ్డి. గుమ్మడి శివకృష్ణ, ప్రభ, రాజ్యలక్ష్మి, తాతినేని రాజేశ్వరి, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, డాక్టర్ శివప్రసాద్, రాజేంద్రప్రసాద్, కిరణ్ బాబు, వల్లం నరసింహారావు పాల్గొన్నారు. కథ, మాటలను పరుచూరి, గోపాలకృష్ణ రాశారు. ఆరుద్ర, డాక్టర్ నెల్లుట్ల గీతాలకు శివాజీరాజా స్వరకల్పన చేశారు. ఆర్. కె. రాజా ఛాయ, కొండపనేని రామలింగేశ్వర రావు శిల్పం, బాబూరావు కూర్పు, రాజు నృత్యాలు, శ్రీనివాసరావు – ధ్రువకుమార్ ప్రొడక్షన్ నిర్వహించారు. "ఉగాదికి విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే ఆనం గోపాలకృష్ణారెడ్డి.

## ధర్మాత్ముడు

"రెండు జెళ్ళ సీత" అనంతరం శాయికృష్ణ కేశవరావు నిర్మించే శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్ "ధర్మాత్ముడు" చిత్రానికి డాక్టర్ ప్రభాకరరెడ్డి కథ సమకూర్చి, సమర్పిస్తున్నారు. కృష్ణంరాజు, జయసుధ, విజయశాంతి, ప్రభాకరరెడ్డి ప్రభృత నటవర్గం. మద్దిపట్ల సూరి సంభాషణలకర్త. సత్యం సంగీతం, సత్తిబాబు ఛాయ, మార్తాండ్ కూర్పుతో ఈ చిత్రానికి హాస్య నటుడు సారథి నిర్మాణ సారథ్యం వహిస్తున్నారు. రిపబ్లిక్‌డేనాడు తొలి చిత్రం రికార్డయింది. ఆ మర్నాటి నుంచి షూటింగ్ ప్రారంభమైంది. "కృష్ణంరాజుగారితో నాకిది తొలి చిత్రం," అన్నారు ఈ చిత్రానికి దర్శకత్వం వహించే బి. భాస్కరరావు.

## రామానాయుడు చిత్రంలో
## చిరంజీవి సరసన
## "పెంకి పెళ్ళాం"గా విజయశాంతి

"మా సురేష్ సంస్థలో చిరంజీవికిది ఫస్ట్ పిక్చర్. "పెంకిపెళ్ళాం"గా విజయశాంతి నటిస్తుంది. శరత్‌బాబు, సత్యనారాయణ, రావు గోపాలరావు, అన్నపూర్ణ కాక ఇంకో ఇద్దరు కొత్త తారలను కూడా పరిచయం చేస్తాను," అన్నారు నిర్మాత డి. రామానాయుడు. ఈయన ఈ చిత్రం ద్వారా కె. మురళీమోహనరావును కూడా డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నారు. బాల మురుగన్ కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాస్తున్నారు. గోకె‌సింగ్ ఛాయ, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తారు. "ఏప్రిల్‌లో పాటలు రికార్డవుతాయి. జూన్, జులై, ఆగస్ట్ నెలల్లో షూటింగ్ పూర్తవుతుంది," అని నిర్మాత తెలియజేశారు.

## "తెల్ల గులాబీలు"

స్నేహం ప్రేమ— అమరమైనవి అనే అంశం మీద అల్లబడిన నవరసభరితమైన కథ అన్నారు రేలంగి నరసింహారావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వం వహించే ఉషోదయ క్రియేషన్స్ తెల్లగులాబీలు చిత్రం షూటింగ్ మన రాష్ట్రంలో ఏప్రిల్ 15— మే 15 మధ్య పూర్తవుతుంది పూసల సంభాషణలు శంకర్ గణేష్ సంగీతం రఘు ఛాయలో ఈ చిత్రాన్ని నిర్మించే రుద్రరాజు సీతారామరాజు సంచలన చిత్రం జాతర లో భాగస్వామి

## వేజెళ్ళ దర్శకత్వంలో
## "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?"

ముఖ్యంగా మహిళల్ని పదే పదే చూడాలనిపించే చిత్రం అన్నారు వేజెళ్ళ సత్యనారాయణ ఈయన దర్శకత్వంలో అన్నమరెడ్డి కృష్ణకుమార్ నిర్మించే ఈ చిత్రానికి ఏప్రిల్‌లో పాటలు రికార్డ్ చేయబడతాయి మే నుంచి షూటింగ్ ఉంటుంది

శ్రీదేవితో అక్కినేని నాగేశ్వరరావు శ్రీరంగనీతులు



# సినిమా

## దాసరి రచన, దర్శకత్వంలో విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "యుద్ధం"

"జస్టిస్ చౌదరి" అనంతరం చిరంజీవి హీరోగా కోడి రామకృష్ణ దర్శకత్వంలో టి త్రివిక్రమరావు నిర్మిస్తున్న చిత్రం చివరి షెడ్యూల్ ఏప్రిల్ 19 నుంచి 30 వరకు ఊటీ, మద్రాసు లలో జరుగుతుంది ఈ చిత్రం తర్వాత ఈ నిర్మాత సెప్టెంబర్, అక్టోబర్ మాసాల్లో షూటింగ్ జరిపే "యుద్ధం" చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజు సరసన జయసుధ, శ్రీదేవి నాయికలు సత్యనారాయణ, రావుగోపాలరావు ప్రభృతులు ఇతర ముఖ్య భూమికలు పోషిస్తారు దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు



'రంగుల పులి' మోహన్‌బాబు

## ఏ.ఎన్ ఆర్ తాతినేని రామారావులతో బుచ్చిరెడ్డి చిత్రం

"మరో రెండు పిక్చర్లకు కథలు రెడీగా ఉన్నాయి," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి ఈయన ప్రస్తుతం ఎ ఎన్ ఆర్ హీరోగా జంధ్యాల దర్శకత్వంలో "అమరజీవి" చిత్రాన్ని నిర్మిస్తున్న విషయం పాఠకులకు విదితమే మళ్ళీ ఎ ఎన్ ఆర్ తో వచ్చే జనవరిలో ఇంకో చిత్రాన్ని మొదలెడతారు ఇందులో శ్రీదేవి నాయిక, తాతినేని రామారావు దర్శకుడు ఈలోగా సెప్టెంబర్ నుండి బుచ్చిరెడ్డి నిర్వహణలో "వేగుచుక్క" అనే చిత్రం చిరంజీవి, రాధికలతో తయారవుతుంది

## షూటింగ్ పూర్తయిన "అగ్నిజ్వాల"

మోహన్‌బాబు నరేష్ సోదరిగా జయంతి ఒక ఛాలెంజింగ్ రోల్‌లో అగుపిస్తారు అమాయకుల బ్రతుకులలో నిప్పులు చెరగించిన పాపాత్ముల గుండెల్లో సింహ స్వప్నంగా ఉండే కథానాయకుని పాత్ర మోహన్‌బాబుది సైకిల్‌షాపు యజమానురాలిగా కన్పించే పాత్రలో కవిత ఆధునిక యువతిగా అరుణ, ఇంకా— నరేష్ ప్రభాకరరెడ్డి సత్యనారాయణ, గిరిబాబు అల్లు రామలింగయ్య త్యాగరాజు వీరభద్రరావు వేలు అన్నపూర్ణ నటించారు అని తెలిపారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు జి వి కె కంబైన్స్ అగ్నిజ్వాల పాచ్ వర్క్ పూర్తి చేసుకొని తుది మెరుగులు దిద్దుకుంటోంది ఈ చిత్ర నిర్మాత జి వి కృష్ణారావు ఈ చిత్రం కోసం ఎనాకి డాప్ ప్రాంతంలో ఒక గా హౌస్ సెట్‌ను నిర్మింక డానికి ఎంతో ఖర్చయింది అహోబలం అడవుల్లో ఒక చక్కని కాలనీని కొన్ని లక్షల వ్యయంతో నిర్మించాం ఈ మధ్య కాలంలో అవుట్‌డోర్‌లో ఇన్ని భారీ సెట్స్ ఎంతో వ్యయప్రయాసల కోర్చి నిర్మించబడలేదేమో! కామాంధులు కాలాన్ని శాసిస్తే అది అబలల ఆర్తనాదాలకు పునాది వేస్తే ఆ పునాది ఓ మంచి మనిషికి సమాధిగా పరిణమిస్తే ఆ ఆగడాలను అరికట్టాలని, ఆ అన్యాయాన్ని అడ్డు




"ఈ డ్రెస్‌తో చేసిన డాన్సుకేగా ఉత్తమ డాన్సర్‌గా ఎన్నికైంది— బహుమతి అందుకోడానికి ఇట్లా వెళితే ఏం?"

కొట్టాలని చెలరేగుతుందొక అగ్నిజ్వాల! మా యూనిట్ తయారు చేసిన కథకు ఎం డి సుందర్ పకడ్బందీ అయిన స్క్రీన్‌ప్లేను రాశారు, అని వివరించారు సత్యానంద్ దేవరాజ్ సత్యం, సీను త్రిపురనేని వరప్రసాద్ హరిప్రసాద్ త్రివిక్రమరావు ప్రభృతులు తెర వెనుక కృషిచేశారు

### "ప్రజారాజ్యం"

"ఏప్రిల్ 15న ఊటీలో షూటింగ్ మొదలవుతుంది. కొన్ని పాటలు ముఖ్యమైన సన్నివేశాలు అక్కడ షూట్ చేస్తాం మే 1 నుంచి పద్మాలయా స్టూడియోస్‌లో షూటింగ్ ఉంటుంది అన్నారు జి. ఆదిశేషగిరిరావు శ్రీమతి జి నాగరత్నమ్మ నిర్మించే రత్నా మూవీస్ ప్రజారాజ్యం చిత్రంలో కృష్ణ, జయప్రద సత్యనారాయణ రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి నూతన్ ప్రసాద్ అల్లు రామలింగయ్య గిరిబాబు రాజ్యలక్ష్మి అరుణ శుభ, కె. విజయ ఒక కీలక పాత్రలో ప్రతాప్ పోతన్ నటిస్తారు పరుచూరి సోదరులు కథ మాటలు రాశారు జి హనుమంతరావు స్క్రీన్‌ప్లే వేటూరి గీతాలు జె వి రాఘవులు సంగీతం పుష్పాల గోపీకృష్ణ ఛాయ కోటగిరి గోపాలరావు కూర్పుతో జి ఆదిశేషగిరిరావు నిర్మాణ సారథ్యం వహిస్తున్నారు. దర్శకత్వం : ఎం. మల్లికార్జునరావు.

"ముగ్గురు మొనగాళ్లు"లో విజయలలిత, శోభన్‌బాబు, నాగేంద్రప్రాయుడు

# సినిమా

## అన్నపూర్ణా స్టూడియోస్ "శ్రీరంగనీతులు"

ఎ ఎన్ ఆర్ హీరోగా ఎ కోదండరామిరెడ్డి దర్శకత్వంలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే చిత్రానికి ''శ్రీరంగనీతులు'' అని నామకరణం చేశారు శ్రీదేవి, చంద్రమోహన్, విజయశాంతి, సత్యనారాయణ, నాగేష్, చలపతిరావు, రాంజీ, రమాప్రభ, రాగిణి, పండరీబాయి వగైరా తారాగణం గల ఈ చిత్రాన్ని వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మిస్తున్నారు డి వి నరసరాజు మాటలు, ఆత్రేయ గీతాలు, చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయతో కొడాలి ఆంజనేయచౌదరి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసరు సెప్టెంబర్ 22 న విడుదలవుతుంది



'కోకిలమ్మ' సరిత

## అనిల్ ప్రొడక్షన్స్ చిత్రంలో మామా అల్లుళ్ళుగా అక్కినేని, నందమూరి బాలకృష్ణ

''నాగేశ్వరరావుగారిది టిపికల్ పాత్ర ఆయన అల్లుడుగా బాలకృష్ణ నటిస్తారు,'' అన్నారు డైరెక్టర్ టి ఎల్ వి ప్రసాద్ అనిల్ ప్రొడక్షన్స్ కొత్త చిత్రం ఆగస్ట్, సెప్టెంబర్, అక్టోబర్‌లలో ప్రతినెలా 11–20 తేదీల మధ్య జరిగే మూడు షెడ్యూల్స్‌లో చిత్రీకరణ పూర్తిచేసుకుంటుంది పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతంతో తాతినేని ప్రకాశరావు నిర్మాత ★

మూడు
రకములుగా
ఉపయోగపడుతుంది.

# చంద్రిక
## సబ్బు






జిడ్డు కారకుండ చర్మాన్ని
సౌందర్యవంతం చేస్తుంది.



జుట్టును శుభ్రపరచి
చుండ్రునుండి
పరిరక్షిస్తుంది.



చర్మాన్ని పొట్టు రాల కుండా
చేసి నల్ల మచ్చలు మరియు ఇతర
చర్మ వ్యాధుల నుండి కాపాడు
తుంది

ఇతర ఏ సబ్బులందు లేని పై ఉపయోగాలు
కల్గిన సాటిలేని సబ్బు – చంద్రిక !
వర్ణ సౌందర్యానికి, ఆరోగ్యదాయకమైన
కేశసంపదకొరకు ఆయుర్వేద శాస్త్ర ప్రమాణాల
ననుసరించి ఎక్కువమొత్తంలో కొబ్బరి నూనె
నుపయోగించి తయారు చేయబడిన
సబ్బు – చంద్రిక సబ్బు.

# చంద్రిక

అన్ని ఋతువులలోను ఉపయోగించే సబ్బు
భారతదేశములో మరియు ప్రపంచవ్యాప్త
ముగా ప్రశస్తి గాంచినది.






"నా గుండెల్లో గుబులంతా నీవేకదయ్యా! నిన్ను తలవని రోజు నా బ్రతుకులో దుర్దినమే కదయ్యా!"

"మాటలు చక్కగా నేర్చావు."

**"మనసు నీ ధ్యాసలోనే ఉన్నదని ఎరుకపరుస్తున్నా దొరా! కొండంత అండగా ఉన్న దొరవు. మాటలతో మీరు మనసును కప్పిపుచ్చానని మండి పడుతున్నావా? ఈ కట్టెలో యింకా ఊపిరి నిలుపుకున్నది నీ కోసమే దొరా! నీ రుణం నా మీద మోయలేని బరువై కూర్చున్నదయ్యా! నన్ను కరుణించు" అంటూ చేతులు ముకుళించి నమస్కరించేడు నారాయణ.**

అది పెద్ద అరుగుల మిద్దెయిల్లు. వసారాలో అరుగుమీద చందనపు కర్రతో చేసిన సింహాసనం లాంటి దానిమీద ఆసీనుడై **ఉన్నాడు వెంకన్నదొర**

వెంకన్నగారు వెలమదొర. మొగిలిచర్ల గ్రామానికి పెదకాపు. తరతరాలనించీ వారసత్వంగా వొస్తున్నది పెదకాపుతనం. నడమంత్రపు సిరిలా నడిమధ్య వొచ్చింది కాదు. రాజసమూ, ఠీవీ ఆ రక్తంలో ప్రవహించేయి. చిన్నతనం నుంచే చేతకర్ర పుచ్చుకుని తిరగటమంటే గ్రామం మీద కర్ర పెత్తనం!

నిండుగా నిలువెత్తు విగ్రహం. కరిగించిన బంగారమే ఆ ఒంటి జిలుగు. కిర్రు చెప్పులూ, కావిరంగు జరీధోవతీ, కళ్ళు చెదిరే వజ్రాల ఉంగరాలూ, మెడలో పులిగోరు, నిండైన పైకండువా కాక బిగించి కిరీటంలా చుట్టిన తలపంచె ... యిదీ వెలమవారి వెంకన్నదొర ఆకారం.

నారాయణ చేతులు కట్టుకుని వినయమే రూపుదాల్చినట్టు నిలిచివున్నాడు. అంత ఎండలోనూ, కాలు చుర్రుమంటున్నా కదలకుండా నిలబడి వున్నాడు. ఒక్క వినయమేతప్ప మరి ఏ సంపదలూ లేని హరిజనుడు నారాయణ. ఆకారం బక్కచిక్కిన బడుగురైతు ఆకారమే. నిట్టూర్పులే అతని అలంకారాలు. బండి నిండినా ఇంకా మిగిలివుండే సంసారం అతనిది. రెక్కాడినా డొక్కాడని హీనపు బ్రతుకు.

నారాయణ మూడేళ్ళనాడు వెలమవారి సంస్థానంలో వెంకన్నగారి పాదాలదగ్గర చేరి అరక నేలను గుత్త సేద్యానికి స్వీకరించాడు. నేలతల్లి ఆ అమాయకునిపై దయచూడలేదు. బకాయిపెరిగింది. నడుము విరిగింది. అయినా ఆశ నిండా నూరేళ్ళు బ్రతుకుతుంది. నారాయణ మళ్ళీ అదే నేలను గుత్తకుకోరాడు.

వెంకన్న వెటకారమే రూపుదాల్చినట్లునవ్వేడు. ఆ నవ్వు శ్రావణ పూర్ణిమకు కృష్ణమ్మ తల్లిలా

# లల్లాదేవి

# తిరుచరణాలు



గలగలమని ప్రవహిస్తుంటే నారాయణ మనసులో లగ్నిపర్వతాలు పగిలేయి అయితే ఆతనిది మౌన విషాదపర్వం కాబట్టి అది ప్రక్కవారికి కూడ అర్థం కాదు

ప్రకృతి చేసిన భీభత్సానికి తానే నేరంచేసినట్లు తల వొంచేడు నారాయణ కుటుంబమంతా కుమిలి కుమిలి ఏడ్చింది

ఎటు చూచినా ఎడారి ఇటువంటి దుర్దినాలు ఎదురైతే నారాయణను ఓదార్చి ధైర్యం చెప్పగల ఒకేఒక వ్యక్తి అప్పుడా గ్రామం విడిచి దేశాంతరం వెళ్లి వున్నాడు నారాయణ ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఎదురుచూచేడు ఆ వ్యక్తి కోసం

వ్యవసాయపు పనులు సాగే కాలం వొచ్చింది వెంకన్నదొర పొలంపనుల్లో పడిపోయేడు మళ్ళీ గుత్తకు పొలం అందిరాకపోగా, అందివచ్చిన యిద్దరు బిడ్డల్నీ బలవంతపు పాలేళ్ళుగా మార్చి పనుల్లో దింపేడు దొర కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందనుకున్నాడే తప్ప పరాయివారితో పన్ను కలిపి చెప్పుకోలేదు నారాయణ

నారాయణ హరిజనుడే అయినా చక్కని విద్యాగంధమున్నవాడు చక్కగా పంచ కావ్యాలు కంఠస్తం చేసినవాడు చదువు అతనివరకే ఆగిపోయింది కాని పదిమందికి చెప్పే అవకాశం అతనికి దొరకలేదు



వ్యవసాయం వ్యావృత్తి అయింది నారాయణవి అన్నీ ఛాందస భావాలే

భార్యా, కొడుకులూ, కూతుళ్ళూ అతని ఛాందసపు ఆలోచనలు చూచి ఎప్పుడూ నవ్వుకునేవారు అప్పుడప్పుడూ విసుక్కునేవారు ఎవరేమనుకున్నా అన్నా అతనిదారి అతనిది అతని చెవికి ఎక్కాలంటే ఒకే ఒక్క వ్యక్తి అలా చెప్పగలడు

ఆయన పేరు కృష్ణస్వామి

మొగిలిచర్ల కాకతీయ సామ్రాజ్యంలో తెలుగుతనం ఉట్టిపడే ఊరు అక్కడే ఏకవీరాదేవి ఆలయం ఉంది అది చారిత్రకంగానూ, కావ్య విషయకంగానూ ప్రసిద్ధిచెందిన ఆలయం

ఆ ఆలయానికి కూతవేటు దూరంలో కృష్ణస్వామి నివసించే పర్ణశాల వుండేది అందులో ఆయన ఒంటరి శిష్యులూ, అభిమానులూ అనేక మంది వున్నా వారంతా తోటవరకే వెళ్ళేది తోట దాటి కుటీరంలో కాలు పెట్టినవారు ఎవరూలేరు

అవి రుద్రమదేవి పట్టాభిషిక్తురాలైన తొలినాళ్ళు వీరశైవులు జైనులతో హోరాహోరి పోరాడుతున్నారు గణపతిదేవుడు పాలించే దినాల్లో కృష్ణస్వామి ఆస్థానంలో వుండి తాత్త్విక చర్చలు నిర్వహించేవాడు గణపతి పోయాక రాజకీయాలు రాకూడని స్థాయికి వచ్చాయి కృష్ణస్వామికి ఓరుగల్లు విడిచిపెట్టి పోవాలనిపించింది వెంటనే తన శేష జీవితాన్ని గడిపేందుకు ఒక ప్రదేశాన్ని నిర్ణయించుకున్నారు

ఆ నిర్ణయం ప్రకారమే మొగిలిచర్లలో ఏకవీరాదేవి ఆలయం ప్రక్కన పర్ణశాల నిర్మించారు ఆయన ప్రతి పొద్దూ మూడు వంతులు మౌనంగా గడుపుతారు ఆ సమయంలో పర్ణశాల విడిచి వెలుపలకు రావటం జరగదు

ఇక మిగిలిన సమయాన్ని నారాయణలాంటి వారి కోసం వినియోగిస్తారు వాళ్ళకు అవసరమైన సలహాలివ్వటం, సాహిత్యమూ, తత్త్వమూ వాళ్ళకి చెప్పటం చేస్తుండేవారు ఆయన దగ్గరకు నిత్యమూ వెళ్ళి దర్శనం చేసుకునేవారిలో నారాయణ ఒకడు

## తిరు చరణాలు

ఆయన దేశాంతరం వెళ్ళినవాడు రాగానే నారాయణ వెళ్ళి పరిస్థితులన్నీ ఆయనతో చెప్పుకున్నాడు

అన్నీ విని కృష్ణస్వామి చాల బాధపడ్డారు చివరిసారిగా ఆయన దయ కోసం అర్థించి రమ్మని వెంకన్నదొర దగ్గరకు పంపారు ఇప్పుడు నారాయణ వెంకన్నదొర ముందు ఎఱ్ఱని ఎండలో నిలువుకాళ్ళ మీద నిలబడి వున్నాడు

"నా రుణం నీ మీద మోయలేని బరువై కూర్చున్నదా! నేను నిన్ను కరుణించాలా?" నవ్వుతూ తాపీగా అన్నాడు వెంకన్నదొర నారాయణ గుండెలు దడదడలాడేయి ఆ అనటంలో నీ మీద నేను చూపబోయే కరుణ ఏమీ వుండదన్న ధ్వని వినిపించింది నారాయణకు తెల్లబోయేడు

"ఈ బరువు దించుకోవాలని చాల ఆతృతతో ఉన్నట్లున్నావు కదూ!" అన్నాడు మళ్ళీ నారాయణ పలకలేకపోయాడు చెప్పేందుకేముంది వినటం తప్ప

"నారాయణా నిజం చెప్పు నువ్విప్పుడు ఎక్కడ నుండి వస్తున్నావు?" ప్రశ్నించేడు దొర

"కృష్ణస్వామి ఆశ్రమం నుండి"

"ఏమి ఏమి ఉపదేశాలు పొందేవు?"

"ఉపదేశాలు ఆకలి తీర్చలేవు దొరా అది తీరాలంటే మీ వంటి దొరబాబుల దయకావాలి"

"ఆకలి తీర్చుకునేది యిక్కడ ప్రాణాచారాలు గాంధీ పర్ణశాలలో అవునా? మిమ్మల్ని ఎలా నమ్మాలి?"

"స్వామి బ్రతుకులో అర్థాన్ని చూపుతారు బ్రతుకు తెరువు మీరే చూపాలి దొరా!"

"పాండిత్యం వొంటబట్టిందన్నమాట?" మాటలతోనే నారాయణ స్వాభిమానాన్ని కాలరాచి వేస్తున్నాడు వెంకన్నదొర కృష్ణస్వామి ఉపదేశానికి అనుగుణంగా నారాయణ పైకి పొంగలేదు కాని లోలోపల అగ్నిజ్వాలలు రగులుతున్నాయి అభిమానం బుసలు కొడుతోంది

నారాయణ చాలాసేపు అలాగే నిలువుగుడ్లేసుకుని నిలుచుండిపోయేడు దొర అతని మాట మర్చిపోయినట్లే తన పనులు తాను చూసుకోసాగేడు

"బిజ్జిలా! బిజ్జిలా!" పిలిచేడు దొర ఆ పిలుపు అందుకుని దొరబిడ్డ వసారాలోకి వొచ్చేడు అతని రూపురేఖలు చాల చిత్రంగా ఉన్నాయి మనిషి క్రిందినించి పైకి ఒకేలావులో గుండ్రడి కొయ్యలా వున్నాడు నిండా యిరవై ఏళ్ళు కూడ లేని అతనికి చెంపలు బాగా ఉరి జారిపోయి వున్నాయి కళ్ళు బాగా ఉబ్బి మగతగా వున్నాయి చూడగానే ఇతడు సోమరి అనిపించేలా వున్నాడు నడక చాల మందకొడిగా బద్ధకంగా ఉన్నది

"పిలిచేరా?" అన్నాడు నడిచి వొచ్చినందువల్ల కలిగే ఆయాసంతో రొప్పుతూ

"బిజ్జిలా! యీపూట వ్యాయామశాలకు వెళ్ళివొచ్చేవా?" ప్రేమతో ప్రశ్నించేడు ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటం చాల శ్రమతో కూడుకున్నపనే అన్నట్లు నిలబడిపోయేడు బిజ్జిలుడు

దొర కన్నులెత్తి బిజ్జలునికేసి చూచేడు అతడు ఏదో తాయిలం తినటంలో లీనమైపోయి తండ్రిని పట్టించుకోనట్లుగా నిలబడి వున్నాడు

వెంకన్న దొరకు మనసు నలుచుకుపోతోంది తరతరాలుగా వొస్తున్న యీ కుటుంబ గౌరవాన్ని, పెదకాపుతనాన్ని యీ బజ్జలుడు నిలుపుకోగలడా అని ఆయన ప్రశ్నించుకున్నాడు సమాధానంగా మనసు బాధతో మూలిగింది రానున్నవి చాల క్లిష్టమయిన రోజులు మతకల్లోలాలు రాజకీయాలలోకి దూరి పరిస్థితుల్ని తారుమారు చేస్తున్నాయి రుద్రాంబ మహా పరాక్రమశాలి పట్టు సడలని దీక్ష ఆమెకు మొదటినుండి అలవడింది

ఆమె జైనులమీద యుద్ధాన్ని ప్రకటించింది అన్నివిధాల ఎంతో ఉన్నతుడయిన గణపతి దేవుడు మత విషంలో చాల మొండివైఖరి ప్రదర్శించాడు అతని అడుగుజాడల్లో రుద్రాంబకూడ జైనులమీద యుద్ధం ప్రకటించింది జైనస్వామి తన పరివారాన్ని అరణ్యాలలో నేలమాళిగల్లోనూ,, కొండగుహల్లోనూ దాచివుంచి సమయంకోసం ఎదురుచూస్తున్నాడు ఏ క్షణంలోనైనా విప్లవజ్వాలలు ఆంధ్ర సామ్రాజ్యాన్ని అలా జరిగితే తాను కూడ ప్రత్యక్ష చర్యలకు చుట్టుముట్టవచ్చు దిగవలసిన అగత్యం ఏర్పడుతుంది ఇంతవరకూ ఎలాగో సుందరపాండ్యవర్మనూ జైనస్వామినీ పట్టుకుని తను కాలాన్ని వెళ్ళదీస్తున్నాడు ఇకపై ఇలాగే సాగుతుందన్న నమ్మకం లేదు

ఈ స్థితిలో అన్నివిధాల శక్తివంతులైనవారు తప్ప తమకున్న సంపదల్నీ, పదవుల్నీ కాపాడుకోలేరు కాని తన కడుపున లేక లేక కాచిన యీ పసికందు మనసు ఇంకా వికసించలేదు ఇరవై నిండుతున్నా శైశవం పోలేదు రానున్న అల్లకల్లోలాలమధ్య తన వంశాంకురం ఏమైపోతాడన్నదే ఆయన బాధ తాను జైనస్వామితో చేయి కలిపాడన్న విషయం వీరశైవుల దృష్టిలో పడితే ఏమౌతుంది ? అనే విషయం ఈమధ్య వెంకన్నదొరకు పదే పదే గుర్తుకు వొస్తోంది

"నాయనా బిజ్జలా ! యీ పూట వ్యాయామ శాలకు వెళ్ళివొచ్చేవా" అన్నాడాయన మళ్ళీ విసుగుని స్వరంలో కనిపించకుండా అదిమివేస్తూ బిజ్జలుడు వెకిలిగా నవ్వేడు

"గురువుగారు శలవు ప్రకటించేరు" అన్నాడు

"ఈవేళ అమావాస్య కాదు పూర్ణిమ కాదు శలవు ఎందుకట ?"

"హి హి హి"

"సమాధానం చెప్పరా తండ్రీ !" మళ్ళీ సమాధానంగా బిజ్జలుడి నవ్వే వినిపించింది వెకిలిగా

"గురువుగారు గ్రామాంతరం వెళ్ళారా ?"

"కాదు కాదు"

"వారింటికి ఎవరైనా బంధువులు వచ్చారా ?"

"లేదు లేదు"

"మరి ? ?"

"గురుపత్ని హిహిహి"

"అంటే ?"

"గురుపత్ని హిహిహి"

"గురుపత్నికి సుస్తీ చేసిందా ?"

"అలా హిహి అలాంటిదే" నారాయణకి వొస్తున్న నవ్వుని పెదాలమధ్య ఆపటం ఇక అసాధ్యమనిపించింది అరచేయిని నోటమీదపెట్టి పెదవుల్ని బంధించేడు

దొర పరిస్థితిని గమనించేడు తల తీసివేట్టె వుంది

"నీవు లోపలకు వెళ్ళి మన పెద్దపాలేరుని పంపు" అంటూ ఏదో మిష చూపించి కుమారరత్నాన్ని లోపలకు పంపివేశాడు

బిజ్జలుడు వెళ్ళగానే వెంకన్నదొర నారాయణను చూచేడు

"నారాయణా !నీవింకా వెళ్ళనే లేదన్నమాట "

"మీ ఆజ్ఞ కోసమే చూస్తున్నాను "

"అలాగే వెళ్ళు "

"అదికాదు వెంకన్నదొరా! బకాయి విషయంలో మీ అభిప్రాయమూ తెలుసుకోవాలని వొచ్చాను "

"గొప్ప మెలికే తెచ్చిపెడుతున్నావు రుణం విషయంలో నేను చెప్పవలసిందీ, నీవు వినవలసిందీ ఏముంటుంది రుణాన్ని తీరిస్తే పోతుంది ఇక నేను చెప్పవలసింది ఏమిటి ?"

"తీర్చే శక్తి లేదు కనుక "

"ఆఁ కనుక ?"

"వొచ్చే ఏడాది పంటలకు నా అరక నేల వాకు యిప్పిస్తే మళ్ళీ రుణశేషం లేకుండాచేసుకుంటాను "

"పంటలు బాగా పండితే తీరుస్తావు నీ మీద నాకు ఆ మాత్రం విశ్వాసముంది కాని పండకపోతే ఏమిచేస్తావు" నారాయణ నిలువు గ్రుడ్లు వేసుకుని చూస్తుండిపోయాడు డబ్బు కలవాళ్ళకు రెండు ప్రక్కలా పదును కలుగుతుంది వాళ్ళు ఏది మాట్లాడినా అర్ధవంతంగానే వుంటుంది వాస్తవానికి పంటలు పండకపోతే యిప్పుడున్న అప్పు ఇబ్బడి ముబ్బడి అవుతుంది ఈ రుణభారంతోనే నడుము విరిగి లేవలేక నానా అవస్థలూ పడుతున్న తను ఇక అప్పుడు చేయగలిగింది ఏమిటుంటుంది ? అని ఆలోచిస్తున్నాడు

"ఇంతకూ వేగిర పడ్డందువల్ల జరిగే పనులు ఏమీ లేవు బిడ్డలిదర్ని పనిలోకి పంపావు కదా ! కొన్నాళ్ళుపోతే ఋణం అదే చెల్లుపడి పోతుంది ఎందుకంత దిగులుపడి కూర్చుంటావు" అంటూ హెచ్చరించాడు దొర

అప్పటి వరకూ ఎండలో నిలబడి కాళ్ళు పీకటంవల్ల నిలబడిన చోటనే కూర్చోవాలని ప్రయత్నం చేస్తున్న నారాయణకు యీ మాటలు కొరడా కొసలవలె చెళ్ళుమనిపించాయి లేచి నిటారుగా నిలబడ్డాడు

దొర గొప్ప చిక్కే తెచ్చిపెట్టేడు ఇద్దరు బిడ్డల్నీ ఆయన బాకీ క్రింద అప్పగించి ఊరుకుంటే తనకు సంసారం గడిచే దారిలేదు తన శరీరంలో ఓపిక ఉన్నన్ని నాళ్ళూ ఎవరికీ ఎదురు చూడలేదు ఇప్పుడు జవసత్వాలు ఉడిగిపోయాయి

"దొరా ఒక బిడ్డను విడుదల చెయ్యి" అన్నాడు నీరసపడిపోతున్న కంఠంలోకి విశ్వాసాన్ని కూడదీసుకుంటూ

"ఈ గుంట చిక్కులన్నీ ఎక్కడ నేర్చావో ?"

"కడుపు మంట అలాంటిది దొరా !"

"ఎవరిమీద ? నా మీదే !"

"ఆకలి మంట దొరా !"

"అదా సంగతి లాభం కోసమే కదా వ్యవసాయం చేశావు ? నష్టానికి కూడా నువ్వు సిద్ధపడే ఉండాల్సింది "

"తమరు దొరలు తమ బుద్ధి చాల దొడ్డది "

"మంచిది రెండు నెలలు పోయాక కనిపించు ఏదైనా దారి దొరుకుతుందేమో చూస్తాను "






# కాలానుగుణమైన ప్రత్యేక రంగుల నేత

## ఆప్కోవారి గద్వాల్ చీరల జరీపూత

ఆ యా ఋతువులను ప్రతిబింబించే వర్ణాలలో సంచలనమైన ఉత్తమ నూలు శోభలు. సిల్కు అంచులతో నికరపు జరీ జిలుగులు. శోభాయమైన గద్వాల్ చీరలు కల్యాణ వధూ వస్త్రాలలో అగ్రతారలు.







చేనేతలు

kiron/apco/834p

"అలాగే" అంటూ వెళ్ళిపొయ్యేందుకు ఉద్యుక్తుడయ్యేడు నారాయణ నాలుగు అడుగులు అలా వెయ్యనిచ్చి వెనకకు పిలచేడు వెంకన్నదొర

"నారాయణా !" నిలిచిపోయేడు నారాయణ

"రెండు మాసాలు సమయం ఎందుకిచ్చానో గ్రహించావా ?"

లేదన్నట్టు తల అడ్డంగా ఊపేడు అతని చూపులు దీనంగా, జాలిగా, పేలవంగా ఉన్నాయి జన్మతః విధి చేతులో అందరూ కీలుబొమ్మలే కాని దరిద్రుడు డబ్బున్నవారి చేతిలో కూడా కీలుబొమ్మ కావటం ఇదే కాబోలు అనుకున్నాడు మనస్సులో తలవొంచి వింటున్నాడు

"నీకు ఆస్తిపాస్తులు అంతగా లేకపోయినా అన్ని విషయాలు తెలిసినవాడవు ముఖ్యంగా హరిజనవాడలో తిరుగులేని ఏకైక నాయకుడవు ఇప్పుడు కాకతీయుల పరిపాలనకు కాని కాలం రాబోతున్నది అన్ని గ్రామాలూ, అందరు వ్యక్తులూ స్వయంగా ముందుకు వచ్చి తమ వంతు పాత్రను నిర్వర్తించవలసిన సమయం ఆసన్నమయింది ఈ రెండు మాసాలలోగా నీవు నీ అర్హతను నిరూపించుకోవాలి ఆ తరువాత జరుగనున్న జైన సదస్సులో జైనాచార్యులచేత నీకు దీక్ష ఇప్పిస్తాను ఆలోచించుకో" అంటూ సింహాసనంలాంటి దానిమీదనుండి చివాలున లేచి లోనికి వెళ్ళేడు దొర ఆయన నారాయణ సమాధానం కోసం ఎదురు చూడలేదు

నారాయణ సమాధానం చెప్పే స్థితిలో కూడ లేదు ముందు నిశ్చేష్టుడయ్యేడు ఆ తరువాత దీర్ఘ ఆలోచనలో నిమగ్నుడయ్యేడు చాలసేపటికి నీరసంగా అక్కడనించి కదలి వెళ్ళిపొయ్యేడు

నారాయణ ఆలోచనల్లో మునిగిపోయి పరధ్యానంగానే పర్ణశాలకేసి నడువసాగేడు పర్ణశాలకి పోయే దారిలోనే ఉన్నది ఏకవీరాదేవి ఆలయం

వడ్డేపల్లెలో బుద్ధగణపతి మొగిలిచెర్లలో ఏకవీరాదేవి ఆలయాలు కాకతీయ సామ్రాజ్యంలో సుప్రసిద్ధాలు

ఏకవీరాదేవి ఆలయం ఎటుచూచినా రెండున్నర మూడు ఫర్లాంగులకు తక్కువ వుండదు అంటే దాదాపు రెండు వందల యాభై ధనుస్సులు దూర మన్నమాట అంతదూరమూ ఆలయానికి చుట్టూ చాల దృఢమైన ప్రాకారాలున్నాయి

ఏకవీరాదేవి ఆంధ్రుల ప్రత్యక్ష దేవత జమదగ్ని మహాముని భార్య పరశురాముని తల్లి అది చెక్కిన శిల్పనైపుణ్యం అమోఘం ఏకవీరాదేవిని చూచినప్పుడు ఎనిమిదేళ్ళ బాలిక సజీవ మూర్తిని చూచే అనుభూతి కలుగుతుంది ఆ తల్లి ఆదిశక్తి అపరావతారమే ఈ దేవాలయం దగ్గర బవనీలు ఎప్పుడూ పరశురాముని కధలు చెప్తూ వుంటారు

అక్కడకు ఎల్లప్పుడూ తీర్థప్రజలు వొస్తూనే వుంటారు ఏకవీరాదేవి ఆలయానికి ఉన్న ప్రాకారాలు చాల దృఢమైనవి తూర్పు ప్రాకారానికి ముఖద్వారం ఉన్నది అక్కడకు వెళ్ళి చూచినప్పుడు అది ఒక దుర్గంలా కనిపిస్తుందేతప్ప ఒక దేవాలయమని పించదు అంత దృఢమైన నిర్మాణం తూర్పు ముఖద్వారానికి రెండువైపుల "శరభసాళ్వాలు"



## తిరుచరణాలు

(సింహాలను చంపగలిగిన ప్రాచీన జంతువు) భయం గొలుపుతూ వుంటాయి చక్కని చెక్కడపు పనులు చూచేవారి హృదయాన్ని ఆకర్షిస్తాయి

ప్రాకారాలలోపల ఏకవీరాదేవి ఆలయానికి పార్శ్వ భాగాల్లో నాలుగు ప్రక్కల చిన్న చిన్న రాళ్ళున్నాయి వాటిలో భైరవేశ్వరుడు, వీరభద్రేశ్వరుడు, కేశవస్వామి, మైలారదేవుడు ప్రతిష్ఠ చేయబడి భక్తుల పూజలు అందుకుంటూ వున్నారు ఇక్కడ వర్ణవిచక్షణ బొత్తిగా లేదు కేవలము అటు పట్టణమూ, ఇటూ పల్లేకాని యీ మొగిలిచెర్లలో యింత మహత్తరమైన ఆలయం ఉండటం విశేషమే లోపలకు వెళ్ళి అమ్మను దర్శించి కృష్ణస్వామిని చూచేందుకు బయలుదేరేడు నారాయణ

కృష్ణస్వామి వ్యక్తిత్వంలో ఎన్నో అద్భుతాలున్నాయి ఆయన గొప్ప తాత్త్వికుడు కావటంచేత ఎప్పుడూ నిశ్శబ్దంగా, గంభీరంగా ఉండగలడు అది చాల ప్రశాంతమయిన ఆశ్రమం నారాయణ వెళ్ళే వేళకు కృష్ణస్వామి మాలతీ మాధవానికి దోహద క్రియలు చేస్తున్నారు ఆ పూట ఆయన హృదయంలోని ప్రసన్నతాదీప్తి ఆ పరిసరాలను పునీతం చేస్తోంది

అక్కడే పరుపు పరచినట్లున్న శాద్వలాల్ని మునిపంటితో తాకుతూ అటూ ఇటూ లెంగు లెంగున గంతులేస్తోంది లేడికూన కృష్ణస్వామి పటాంచలాన్ని నోటితోపట్టి సుతారంగా లాగుతూ వుంది ఆయన దానిమీద దయను వర్షించే చూపుల్ని ప్రసరిస్తున్నారు

నారాయణ ఒక మామిడిగున్న క్రింద చతికిలపడ్డాడు అక్కడ ఉన్న మామిడిగున్న అన్ని సొంపులూ అమరిన కన్యలా చాల మనోహరంగా ఉంది దానిచుట్టూ ఎత్తయిన అరుగు ఉన్నది ఆ అరుగుమీద కూర్చుని కృష్ణస్వామి శిష్యులతో అభిమానులతో ప్రసంగిస్తూ వుంటారు

నారాయణను చూడగానే చేతిలోని పని వదలి ఆయన మామిడిగున్న వద్దకు కదలివచ్చారు నారాయణ నమస్కరించేడు అతని శిరస్సును తాకి ఆశీర్వదించేడు కృష్ణస్వామి

'నారాయణా ! వెళ్ళిన పని ఏమయింది ?''

"అనుకున్నంతకన్నా లోతుకు వెళ్ళింది స్వామీ"

"అంటేవాస్తవానికి దగ్గరగావెళ్ళావన్నమాట"

"ఆ వాస్తవమనేదాని నిజస్వరూపాన్ని నగ్నంగా చూడగలిగేను"

"అవును నాయనా ! అది చూచి భరించటం కష్టమే మతమనేది అజ్ఞానాంధకారంలో కుళ్ళిపోతున్న జీవితాలకు మందులాంటిది దాన్ని దురుపయోగం చేస్తే ఆ మతమే మత్తుమందు అవుతుంది మతమంటే ఒక అభిప్రాయం అన్న విచక్షణ మరువకుండా ఉన్నంతవరకూ అది చేదివ్వెలా వెలుగు చూపుతుంది లేకపోతే ఒళ్ళంతా కాలుతుంది" అన్నారాయన ఆయన చెప్పిందేమిటో నారాయణ గ్రహించేడు

"అమ్మా ! ఏకవీరా ! నారాయణకు దాహం తెచ్చి యివ్వు" అంటూ పిలిచారాయన ఆ చుట్టుప్రక్కల పొదల మధ్యలోంచి రెండు పాదాలు పర్ణశాల వైపు గల్లు గల్లుమని మోతపుట్టిస్తూ పరుగెట్టాయి

# ఫోటో బాగుంది

డా॥ సి. నారాయణరెడ్డి

కెమెరాకు కితకితలు పెట్టే చిరునవ్వు
చెమట చుక్కల్ని మింగి తేన్చిన పౌడర్
దైన్యాన్ని చొక్కా మాటున దాచేసి
ధనుస్సుల్లా ఎక్కుపెట్టిన కళ్ళు
మూపును కుంగదీసే సమస్యల్ని
ఓ తోపు తోసేసి
వెదురు బద్దలా నిలచిన నీవు
రెడీ రెడీ స్టెడీ స్టెడీ — ఓకే
బాగా వచ్చిందా ? అద్భుతం.

దరఖాస్తుకు అంటించిన ఫోటో
దర్జాగా వుంది
ఏమి రాచఠీవి ?
ఇంటర్వ్యూ అయిన సాయంత్రం బస్సులో
ఏ మాత్రం నలిగిపోకుండా
ఇంటికి తిరిగొచ్చింది
ఫోటో విడిచిన నిట్టూర్పు.






## తిరు చరణాలు
## 2

ఆమె మునికన్య పేరు ఏకవీర రూపసి తొలి యౌవన దశలోని మిసిమి పసిమి మేనిఛాయకు వన్నె పెడుతోంది, కృష్ణస్వామి సంరక్షణలో పెరుగుతోంది కృష్ణస్వామి నెలకొల్పుకొన్న ఆశ్రమంలోని పవిత్రతకు ఆమె చిహ్నం

ఏకవీర రూప లావణ్యం మొగిలిచర్ల పరిసర గ్రామాల్లో కూడ పేరెన్నిక కన్నది ఆమె నడిచే మెరుపుతీగ కృష్ణస్వామి ఎక్కువ సమయాన్ని మౌనధ్యానంలో గడుపుతారు ఆయన ఋషి తుల్యుడు ఏకవీర సంరక్షణ భారం స్వీకరించాక స్వయంగా కణ్వమహర్షే అయ్యేరు

కృష్ణస్వామికి సమకూర్చవలసిన పూజా ద్రవ్యాలను ఆమే సమకూర్చుతుంది ఆయన స్నానం ముగించే వేళకు ఆకాశంలో ఇంకా వెన్న ముద్ద పోటమరించే ఉంటుంది బ్రాహ్మీ ముహూర్తం వేళకు ఆయన సంధ్యా అనుష్టానం పూర్తి అవుతుంది ఉషోదయం వేళకు లేడిపిల్లలకు శాద్వలాలు తినిపిస్తూ వుంటారు ఆయన పెంచే లేడికూన పేరు పద్మ ఆ పేరు ఏకవీర ముచ్చటపడి తానే స్వయంగా పెట్టుకున్నది

అదికాక ఏకవీర సంరక్షణలో పెరిగే ఆవుదూడ లక్ష్మి ఉండనే ఉన్నది పాలనురగ లాంటి స్వచ్ఛమైన తెల్లదనం ప్రకృతి దానికిచ్చిన ఆభరణం చూడగానే ముద్దు పెట్టుకోవాలనిపించే అందం ఆవుపెయ్యది కృష్ణస్వామికన్నా రవ్వంత పొద్దు ముందుగానే లేచి ఆశ్రమమంతా ఊడ్చి కలయంపి చల్లి, రంగవల్లులు తీర్చుతుంది ఏకవీర ఆయన అనుష్టానానికి అవసరమయ్యే ఏర్పాట్లు చేస్తుంది పూజకు పూలు సమకూర్చుతుంది ఆయన లేడికూన పద్మకు శాద్వలాలు తినిపించేవేళ తాను ఆవుపెయ్య లక్ష్మికి పసుపు రాచి బొట్లు పెట్టి అలంకరిస్తుంది అది కొంటెతనంగా గంతులు వెయ్యపోతే మెత్తని చెవులు పట్టుకుని ఆపుతుంది

ఈ దృశ్యాలన్నీ కలిస్తే కృష్ణస్వామి ఆశ్రమమౌతుంది అది ప్రకృతికే ఒక పులకింత పవిత్రతకే ఒక సంకేతం సృష్టికి ఒక సొబగు హైందవ సంస్కృతికి సొబగులు వెలార్చే ఒక తీయని జ్ఞాపకం

**( ఇంకా వుంది )**



బ్యూటీ క్లినిక్‌లో కేశాలంకరణ చేస్తున్న బ్యూటీషియన్ శ్రీమతి అనుపమని చిత్రంలో చూడవచ్చు.

# అతివలు - అలంకరణలు!

అందం అలంకరణ స్త్రీకి ఈనాటి వ్యాపకం కాదు ఏ సాంప్రదాయంలో చూసినా అతి ప్రాచీన కాలం నుంచీ తమ అందాన్ని ఇనుమడింప చేసుకోవడానికి అతివలు కొన్ని సాధనాలు వాడుతూనే ఉన్నారు ఇటు మన సాహిత్యంలో సహితం కస్తూరి పునుగు జవ్వాది ఇంకా చెక్కిలి అద్దకాలు వగైరా ఎన్నో కనిపిస్తాయి విరాట మహారాణి దగ్గర సైరంధ్రిగా ఉన్న ద్రౌపతి కూడా ఈ అలంకరణ పనులే కదా చేసింది!

జగదేక సుందరి క్లియోపాత్రాకు ఒకప్పుడు అందానికి సంబంధించి ఇలాంటి సమస్యే ఎదురైంది మరీ సున్నగా ఉన్న ఆమె కేశాలను అందంగా నొక్కులుగా మార్చుకోడానికి హెన్నా అనే ఆకు పసరు వాడిందని అంటారు

జన్మతహః ప్రతి స్త్రీలో కొంత సౌందర్యం ఉండకపోదు దానిని బహిర్గతం చేసి ద్విగుణీకృతం చేయడమే బ్యూటీ క్లినిక్ ఉద్దేశ్యం' అంటున్నారు శ్రీమతి అనుపమ ఈమె ఇటీవల విజయవాడలో వుమన్స్ వరల్డ్ బ్యూటీ క్లినిక్ తెరిచారు ప్రకృతి సిద్ధమైన ఔషధాలనే చర్మ కేశ రక్షణకి వాడతారట దీనివల్ల శరీరానికి ఏవిధమైన హాని ఉండదని అంటున్నారావిడ

ఈ హెర్బల్ క్లినిక్‌లు ఆంధ్రప్రదేశ్‌లో రెండే ఉన్నాయట ఒకటి మన రాజధానిలో రెండోది విజయవాడలోని శ్రీమతి అనుపమగారి క్లినిక్

తరచుగా స్త్రీ పురుషులకు అందానికి అవరోధంలా తయారైన మొటిమలను శాశ్వతంగా పోగొట్టడమే గాక ఆ సంబంధమైన మచ్చల్ని కూడా రూపుమాపగలమంటున్నారీమె. ఎలాంటి జుట్టుని ఏవిధంగా అలంకరించుకోవాలి వగైరా కేశాలంకరణ జాగ్రత్తలు, చర్మ సౌందర్య విధానాలు ఈ క్లినిక్‌లో అందచేస్తారు. ముడతలుపడ్డ చర్మాన్ని సహితం చక్కగా చేయగల థర్మోహెర్బల్ చికిత్స కూడా ఇక్కడ చేస్తారట. కాకపోతే కాస్త ఖర్చెక్కువంటున్నారు!

లండన్‌లో కూడ ఈ విధమైన హెర్బల్ ట్రీట్‌మెంట్ మీద వనితలు ఎక్కువ మోజు చూపిస్తున్నారని, మన దేశంలో కూడా కేవలం దీన్ని ఫేషన్‌గా మాత్రం అనుకోకుండా చర్మ, కేశ సౌందర్య రక్షణకు ముఖ్యంగా స్త్రీలు శ్రద్ధ తీసుకోవడంలో తప్పులేదని, లండన్‌లో బ్యూటీ అండ్ స్కిన్ కేర్‌లో పోస్టుగ్రేడ్యుయేషన్ డిప్లొమా తీసుకున్న శ్రీమతి అనుపమ అంటున్నారు.

తమ క్లినిక్‌లోనే ఒక శిక్షణా కేంద్రాన్ని కూడా నెలకొల్పాలని ఆమె ఆలోచిస్తున్నట్లు తెలియచేశారు. దీనివల్ల ప్రతిసారి క్లినిక్‌కి వచ్చే అవసరం లేకుండా ఇంటి దగ్గరే తమకు తామే జాగ్రత్తలు తీసుకోవచ్చు!

ఈ క్లినిక్‌లో ఇంకా గోరింటాకుతో అరచేతులకు, పాదాలకు రకరకాల అలంకరణలు చేయడం, పెళ్ళి కుమార్తెని అలంకరించడం మొదలైనవి కూడా చేస్తారు.

ఏది ఏమైనా ఫాషన్‌లు వెర్రితలలు వెయ్యనంత వరకూ, పద్ధతి పాతదైనా కొత్తదైనా ఆరోగ్య దాయకమే!

— 'అశ్విని' *

ఆంధ్ర ప్రాంతం అంతర్ విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుల షటిల్ బ్యాడ్‌మింటన్ పురుషుల డబుల్స్‌లో విన్నర్స్‌గా వచ్చిన సిద్ధార్థ కళాశాల అధ్యాపకులు శ్రీ కె. ప్రసాదరావు, శ్రీ హర్షవర్ధన్‌లకి బహుమతి ప్రదానం చేస్తున్న డా. కె.వసుమతి, సిద్ధార్థ కళాశాల ఫిజికల్ డైరెక్టరు శ్రీ పి. అంకమ్మచౌదరిని చిత్రంలో చూడవచ్చు.





## "రాజు"

"ప్రియాతి ప్రియమైన నా రాణికి,

దయచేసి చివరివరకు ఈ ఉత్తరం చదువు

ఆరోజు నాకు 'గుడ్‌బై' చెప్పి వెళ్లిపోయావు మన స్నేహం, ప్రేమ ఒక్కమాటతో విడిచిపెట్టగలిగావా

లంచ్ అవర్‌లో రాధ, కమల టిఫిన్ తిని, చేతులు తుడుచుకుంటుండగా రాధ క్లాసమ్మాయి వచ్చి

"రాధా! నీకు ఉత్తరం వచ్చింది" అంటూ ఒక కవరు యిచ్చి వెళ్లింది అడ్రసు చూసి 'గోపాల్ రాశాడు' అంది కమల



రాధ కవరు తీసుకుని ఒక్కక్షణం ఆలోచనలో పడింది

చదవటమా! చించిపారెయ్యటమా!

చదవాలనే నిర్ణయానికి వచ్చింది చివరకు

" నువ్వు ఎందుకు 'గుడ్‌బై' చెబుతున్నావో కారణం చెప్పవలసిన కనీస బాధ్యత నీకు లేదా!

ఆ రోజు నుండి ఈ రోజు వరకు మానసికంగా ఎంత వేదన పడ్డానో నీకు తెలుసా? ఎందుకు?

ఈ "ఎందుకు" అనే ప్రశ్న నేను ఎన్నివేల లక్షలసార్లు వేసుకున్నానో "

* * *

ఎందుకు?

ఎందుకిలా జరిగింది? ఎందుకిలా మాట్లాడింది?

గత కొద్దిరోజులుగా తన ప్రవర్తనను గుర్తుకు తెచ్చుకున్నాడు

ఊహుఁ

తనకు తెలిసినంతవరకు ఏమీ తప్పుగా ప్రవర్తించలేదు కష్టం కలిగించేటట్లుగా మాట్లాడలేదు

ఒకవేళ వాళ్లవాళ్లు ఎవరయినా తమని చూసి, ఆమెని మందలించారా!

అదే జరిగితే రాధ సిరికిది కాదు

మరయితే ఏం జరిగింది?

అలా నిస్తేజంగా రాత్రి ప్రొద్దుపోయేవరకు ఆలోచిస్తూ, తనే ప్రశ్నలు వేసుకుంటూ, తనకు తనే జవాబులు చెప్పుకుంటూ గడిపాడు

ఇంటికి వచ్చి మంచం మీద పడుకుని ఆలోచనలో పడ్డాడు మళ్లీ

గోపాల్ ఆలోచనలు క్రమంగా గతంలోకి దారితీశాయి

గోపాల్, రాధ ప్రక్కప్రక్క వీధుల్లోనే వుంటున్నారు ఒకసారి పుస్తకాలషాపులో పరిచయమయింది క్రమంగా పేర్లు, చిరునామాలు తెలుసుకున్నారు

రాధ ఉమెన్స్ కాలేజీలో చదువుతోంది గోపాల్ వేరే కాలేజీలో బి కాం మూడవ సంవత్సరం చదువుతున్నాడు

పరిచయం ప్రణయంగా మారటానికి ఎక్కువ కాలం పట్టలేదు

గోపాల్, రాధలు సినిమాలు, షికార్లు కూడా అలవాటు చేసుకున్నారు

రాధ విషయం, రాధ కాలేజీలో చాలా మందికి తెలుసు గోపాల్ రాధ కోసం వచ్చి, కాలేజీ గేటు దగ్గర నిలబడటం, రాధ అతనితో కలిసి బయటికి వెళ్లటం జగమెరిగిన సత్యం

రాధ ఇంటర్ సెకండియర్ రాధ క్లాస్‌మేట్, ఆత్మీయురాలయిన స్నేహితురాలు కమల రాధ, గోపాల్‌ల సంభాషణలు కమలకు పూర్తిగా తెలుసు

అలాగే గోపాల్‌కి గూడా కమల గురించి, కమలకు రాధకు గల స్నేహాన్ని గురించి రాధే చెప్పింది

ఉదయం 9 45 అయింది

ఉమెన్స్ కాలేజీ గేటుకి ఎదురుగా రాధ కోసం ఎదురు చూస్తున్నాడు గోపాల్

పరుగులాంటి నడకతో చెయ్యివూపుతూ వచ్చింది రాధ

"ఎంతసేపయింది మీరు వచ్చి"

"దేవిగారు వచ్చిన టైముకి పది నిముషాలు ముందుగా "

"ఎక్కడికెళ్దాం"

"దేవిగారి ఆజ్ఞకోసం ఈ ప్రేమదాసుడు ఎదురు చూస్తున్నాడు" నాటకీయంగా కొద్దిగా తలవంచి అన్నాడు గోపాల్

నవ్వింది రాధ

"ముందు త్వరగా యిక్కడి నుండి బయట పడాలి కొంచెం సేపటిలో మా అన్నయ్య ఇటే వస్తాడు చూశాడంటే యిక నా కాలేజీ బందే "

రెండు సందులు తిరిగి మెయిన్‌రోడ్డుకు వచ్చారిద్దరూ

"ఇప్పటికైనా రాణీగారి ఆజ్ఞ సెలవిస్తారా"

"ఏమిటో ఆ తొందర" చిరునవ్వు నవ్వుతూ అడిగింది రాధ

"నా రాణీ ఎక్కువదూరం నడిస్తే కాళ్లు కందిపోవా ?"

"ఎక్కడికెళ్దామంటారు ?"

"దేవిగారి యిష్టమే భక్తుడి యిష్టం"

"అయితే, ఎవ్వరూ లేనిచోటుకి, ఎవరూ రాని చోటుకి, మనిద్దరం మాత్రమే వుండే చోటుకి"

"ఊ వెళ్లి"

"ఛీ పాడు అన్నీ కొంటె మాటలే"

"అయితే రిక్షాఎక్కి పట్టాభిపురం వెళ్దాం" అంటూ రిక్షా పిలిచాడు

మరో అర్ధగంట తరువాత

ఇద్దరూ పట్టాభిపురంలో రైలు పట్టాలకు కాస్త దూరంగా పచ్చికలో ఒకరినొకరు ఆనుకుని కూర్చున్నారు

రాధ గోపాల్ భుజం మీద తల ఆనించి ఆలోచనల్లో పడింది

కొంతసేపటికి మెల్లగా అడిగింది

"గోపాల్ నన్ను విడిచిపెట్టవుగా నిజంగా"

"ఛఛ అలాంటి పాడు సందేహాలు ఎలా వస్తాయి నీకు?" తలమీద లాలనగా చెయ్యివేసి అన్నాడు

"నీమీద అనుమానం కాదు, నామీద నాకే సందేహం"

"రాధా! నామీద నీకు ఎలాంటి సందేహాలున్నా అనుమానాలున్నా నువ్వు సూటిగా అడుగు నేను చెబుతాను అంతేగాని నీ మనసులో ఏదో అనుమానం పెట్టుకుని నువ్వు బాధపడి నన్ను బాధ పెట్టవద్దు"

"లేదు లేదు" కంగారుగా అన్నది రాధ

"మీమీద నాకు అనుమానం లేదు నా అదృష్టాన్ని గురించే నా భయం ఈ నా అదృష్టం శాశ్వతంగా వుండదేమోనని నా భయం"

"నీకంత యిదిగా వుంటే చెప్పు నేను నిన్ను వెంటనే పెళ్లి చేసుకుంటాను రాధా"

తృప్తిగా సంతోషంగా గోపాల్‌ని చూసిందిరాధ

"మైడియర్ పిచ్చీ! ఒక విషయం గుర్తు పెట్టుకో! ఏనాటికయినా, ఏ పరిస్థితులలో నయినా నువ్వే నన్ను కాదనవచ్చు నేను మాత్రం ఆ మాట అనను ఒకవేళ నువ్వు నన్ను కాదంటే నేను ఈ లోకంలోనే వుండను"

గంభీరంగా చెప్పిన గోపాల్ మాటలు విని నిరుత్తరురాలయింది

ఇంత గాఢంగా తనను ప్రేమిస్తున్నాడా! ప్రేమకోసం, తను కాదంటే ఒకవేళ అంటే తాను వుండడా నిజంగా ప్రేమ అంత బలమైనదీ ఎదురు తిరుగుతే భయంకరమైనదా

తన్మయత్వంగా "గోపాల్" అని మాత్రం అనగలిగింది

"అవును రాధా! మనిద్దరి పోషణకు సరిపోయిన సంపాదించాల అవకాశాలు, శక్తి, నమ్మకం నాకున్నాయి పైగా మన విషయం మా అమ్మా నాన్నలకు కూడా తెలుసు"

"నిజమా" అన్నట్లు చూసింది రాధ

"కనుక నేను నిన్ను వదిలే ప్రసక్తే లేదు" ఇద్దరూ లేచి నడక సాగించారు

"గోపాల్! నేను నిన్ను వదిలివెళ్లను ఒకవేళ మా వాళ్లు ఒప్పుకోకపోతే వెంటనే నీ దగ్గరకు వచ్చేస్తాము సరేనా"

* * *

అలాంటి రాధ ఎందుకిలా చేసింది ?

ఆలోచనలతో తల పగిలిపోయేలావుంది

రెండు పగళ్లు, రెండు రాత్రులు ఆలోచించాడు

చివరికి స్ఫురించింది కారణం

అందుకే అయివుండాలి అయితే యింత చిన్నకారణానికి యింత శిక్షా! అయినా అది తన తప్పుకాదే! అందులో తన తప్పు లేశమైనాలేదే!

సరే!

ఉన్న విషయం తెలియచేస్తే ఆ తర్వాత ఎలా జరగాలనుందో అలా జరుగుతుంది లేచి కాగితం, కలం తీసుకున్నాడు గోపాల్

* * *

ఉత్తరం చదవటం ఆపి ఆలోచనలో పడింది రాధ

ఆ రోజు

సాయంత్రం నాలుగున్నరయింది

అలవాటుగా గోపాల్ ఉమెన్స్ కాలేజీ గేటు ఎదురుగా సైకిలు పట్టుకుని నిలుచున్నాడు

మరో పదినిముషాలలో రాధ, కమల కలిసి బయటకు వచ్చారు

కమల ఇంటిదారి పట్టింది రాధ గోపాల్ దగ్గరగా వచ్చింది

"ఇంత లేటా నేను వచ్చి"

"గోపాల్, నేను నీతో మాట్లాడాలి" అంది రాగానే సీరియస్‌గా రాధ

రెండు మూడు సందులు తిరిగి గాంధీ పార్కులోకి వచ్చి, జనానికి దూరంగా ఒక పున్నాగ చెట్టుక్రింద కూర్చున్నారు

"ఊ ఇక చెప్పండి రాణీగారూ"

"మీ వరస నాకేం నచ్చలేదు"

"ఏ విషయంలోనో సెలవిస్తే ఈ పూజారి తప్పు దిద్దుకుంటాడు" అంటూ రాధ చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు

విసురుగా తన చెయ్యి వెనక్కి లాక్కుంది

"గోపాల్! నిన్ను గురించి ఎన్నో ఆశలు పెట్టుకున్నాను కాని నువ్విలాంటివాడివనుకో లేదు"

విషయం చాలా తీవ్రమైనదని గుర్తించాడు లేకపోతే రాధ యింత సీరియస్‌గా వుండదు

"అసలు నీ మనసులో వున్నదేమిటో సూటిగా చెప్పు రాధా" అనునయంగా అడిగాడు

"సారీ! ఇక మనిద్దరికీ కుదరదు"

"అసలు ఏమయిందంటే"

"ఇంకా ఏమీ కాలేదు కనుకనే యిదంతా! నేను నిన్ను చేసుకోను ఇవాల్టినుండి నీ దారి నీది నా దారి నాది

నీలో ఏమాత్రం సంస్కారం వున్నా, కాలేజీ దగ్గరకుగానీ, మా యింటి దగ్గరకుగానీ రావద్దు నాతో మాట్లాడటానికి ప్రయత్నించవద్దు "గుడ్ బై టు యూ"

గబగబా అనేసి విసురుగా లేచి వెళ్లిపోయింది

* * *

మరి ఈ వుత్తరమేమిటి ?

చూస్తుంటే సంజాయిషీలావుంది చదవ కుండా చింపేస్తే

చదివితే

చివరివరకూ చదవమన్నాడు కదా

చదివితే ఏంపోయింది ఎలాగూ చింపేసేదే గదా!

చదివి చింపితేసరి ఎలాగూ చదవటం ప్రారంభించాను గదా!

మళ్లీ ఉత్తరంలోకి దృష్టి సారించింది

" కారణం ఊహించగలిగాను నా వూహ కరక్టే ననుకూడా అనుకుంటున్నాను

పోయిన ఆదివారంనాడు నేను, నా స్నేహితుడి భార్య, మూడేళ్ల వాళ్ల పాప సినిమాకి వెళ్లాం చివరి క్షణంలో మా స్నేహితుడికి ఆఫీసు మేనేజరు వద్దనుండి కబురు రానటంవలన అతను రాలేదు మేము మాత్రమే వెళ్లాము

నేను, నా స్నేహితుడు హైస్కూలు నుండి స్నేహితులం అతనికి, నాకు అరమరికలులేని స్నేహం వుంది

అతని పాపకు నేను చాలా మాలిమి తన తండ్రితోపాటు నన్నుకూడా 'నాన్నా' అనే పిలుస్తుంది

ఆ పిలుపు మాన్పించాలని చాలా ప్రయత్నం చేస్తున్నాము

అదే సినిమాకు నీ స్నేహితురాలు కమలగారు కూడా వచ్చారు ఆ పాప నన్ను 'నాన్నా' అని పిలవటం వినేవుంటారు అందుకే ఆ రోజు సినిమాలో ఇంటర్వెల్‌లో వారు 'తలనెప్పిగా వుంది' అని వెళ్లిపోయారు

ఆ తరువాత జరిగిన సంఘటనలను బట్టి వారు నీకు ఆ విషయం చెప్పారనీ, అందుకే నాకు నువ్వు గుడ్‌బై చెప్పావనీ భావిస్తున్నాను

యామై కరెక్ట్!

## గృహోపకరణ పరికరాల్లో కంప్యూటర్లు!

జపానులో కంప్యూటర్లలో కూడిన గృహోపకరణ పరికరాలను తయారు చేస్తున్నారు ఒవెన్లు, ఏర్‌కండిషనర్లు మొదలగు వానిలో మైక్రోప్రాసెసర్లను ఉపయోగిస్తున్నారు మైక్రోప్రాసెసర్లను సుమారు పది సంవత్సరాల క్రితం పాకెట్ కేలిక్యులేటర్లలో ఉపయోగించేందుకు తయారు చేశారు మైక్రోవేవ్ ఒవెన్లలో ఇవి ఉష్ణోగ్రతను అదుపుచేస్తాయి వాతావరణ ఉష్ణోగ్రతను బట్టి ఏర్‌కండిషనర్లను ఇవి అదుపు చేస్తాయి మైక్రోప్రాసెసర్ల వలన వంటపని సులభమైంది ఏర్‌కండిషనర్లలో విద్యుచ్ఛక్తి వినియోగం తగ్గుతుంది



'బేబీ ఇండియా' చి లావణ్యతో ఆమె తల్లి డాక్టర్ శ్యామలమ్మ, మొమెంటో అందజేస్తున్న విజయవాడ నగర కార్పొరేటర్ శ్రీమతి కొత్తా వెంకటలక్ష్మిగార్లని చిత్రంలో చూడవచ్చు

# బేబీ ఇండియా లావణ్యా!

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్న నానుడి "సూపర్ ఛైల్డ్" అవార్డుపొంది రాష్ట్రపతి స్వర్ణపతకం పొంది బేబీ ఇండియా గా అవార్డును సాధించుకొన్న బేబీ లావణ్య విషయంలో నిజమైంది

ఈ బాలికను కన్న అదృష్టవంతులు తిరుపతికి చెందిన శ్రీ ఎస్ వెంకటరెడ్డి డా శ్యామలమ్మ

ఏప్రిల్‌లో చిరంజీవి లావణ్యకు ఢిల్లీలో జరిగే ఒక ప్రత్యేక కార్యక్రమంలో బేబీ ఇండియా అవార్డు బహూకరింపబడుతుంది

భారత ప్రభుత్వం తరఫున కల్చర్ ఇండియా గత ఏడాది మార్చి 23న ఈ బాలను ఎంపిక చేసింది

1981 నవంబరు 11న ఢిల్లీలో జరిగిన జాతీయ బాల భారత్ సమ్మేళనంలో బేబీ లావణ్య సాత్వికాభినయం ఆంగికాభినయం అత్యద్భుతంగా ప్రదర్శించి సూపర్ ఛైల్డ్ అవార్డును సాధించుకొన్నది ఆమె ప్రతిభను గుర్తించిన రాష్ట్ర నృత్య అకాడెమి బేబీ ఇండియా పోటీకి ఈ బాలను ఎంపిక చేసి పంపించింది విద్య, లలితకళలు క్రీడలు నడవడి, నడక మున్నగు వాటిల్లో పరీక్షలు జరిపి కల్చర్ ఇండియా సంస్థ ఈ బాలను బేబీ ఇండియాగా ఎంపిక చేసింది

లక్షరూపాయల విలువైన వజ్ర కిరీటం వెండి గులాబీ పూవుల గుచ్ఛం ఒక కారు ఆమె చిత్రం గల బంగారు షీల్డు ఈ బాలకు బహూకరింపబడతాయి

కేంద్ర ప్రభుత్వం దేశ విదేశాల్లో ఏర్పాటుచేసే కార్యక్రమాలకు ఈమె హాజరుకావలసి వుంటుంది మరో బేబీ ఇండియా ఎన్నికయ్యే వరకూ ఢిల్లీలోని సెంట్రల్ గెస్ట్ హౌస్‌లో వసతి కల్పించబడుతుంది ఈ బాల ప్రభుత్వం నిర్వహించే ప్రదర్శనలు ఇచ్చేందుకు వీలుగా రైళ్లలో విమానాల్లో ఉచిత ప్రయాణ సౌకర్యం కల్పింపబడుతుంది

— పి ఎస్

రాధా !

శ్రేయోభిలాషులు చెప్పేది వినవలసిందే ! విన్నదాన్ని మన విచక్షణాజ్ఞానంతో విశ్లేషణ చేసి చూసుకోవాలి

లాజిక్ స్టూడెంట్‌వి కదా !

మనం తెలుసుకున్న విషయాన్ని తార్కికంగానూ హేతువాదంతోనూ ఆలోచించి అభిప్రాయం ఏర్పరచుకోవాలి నిర్ణయం తీసుకోవాలి

ఏదో ఒక విధంగానే ఆలోచిస్తే వచ్చే ఫలితాలు సరియైనవి సంపూర్ణమైనవి కావు హేతువాదం, తార్కికవాదం కలిస్తేనే నిజమైన లాజిక్ అవుతుంది

## లాజిక్

లాజిక్' స్టూడెంటుకి ఈ విషయం చెప్పక్కర లేదనుకుంటాను

ఆ పాప నన్ను నాన్నా అని పిలిచింది కనుక తార్కికంగా ఆలోచిస్తే ఆమె నా భార్య కనుక నా కింతకుముందే వివాహమయింది కాని ఆ విషయం దాచి, స్వార్థంతో నిన్ను మోసం చెయ్యటానికి ప్రయత్నించాను

కదూ !

ఇది నీ ఆలోచన

క్రింద నా స్నేహితుడి అడ్రసు వ్రాశాను మీ స్నేహితురాలు కమలగారిని తీసుకుని ఆ యింటికి వెళ్లండి మీ అభిప్రాయం హేతువాద పూర్వకంగా ఎంతవరకు సబబైనదో రుజువు చేసుకోండి

చివరగా ఒక్కమాట

నువ్వు నాకు వ్రాసిన మొట్టమొదటి ప్రేమ లేఖ భద్రంగా, నా దగ్గరే వుంది ఆ సంగతి నీకూ తెలుసు ఆ ఉత్తరం ఈ ఉత్తరంతో కలిపి పంపిస్తున్నాను

ఇకముందయినా ప్రతి విషయాన్ని హేతువాద పూర్వకంగా తార్కికవాద పూర్వకంగా — రెండు విధాలా — ఆలోచించి సరియైన నిర్ణయాలు తీసుకుంటావని ఆశిస్తాను

ఇట్లు,
నువ్వు నా దానివి కావాలని కోరుకున్న
నీవాడు కాలేని
గోపాల్

ఉత్తరం చదివి చింపెయ్యలేదు మడిచి కవరులో పెట్టేంది అంతవరకూ రాధ ముఖంలో భావాలు చదవటానికి ప్రయత్నించి విఫలురాలై కమల—

ఏం రాశాడే అంది ఆతృతగా

ఏం జవాబు చెబుతుంది?

హేతువాదం తార్కికవాదం, రెండూ కలిపితే నిజమైన లాజిక్ అవుతుంది

నిజమే !

కాని ఈ ఉత్తరంలో యింకా ఏదో వుంది ఏదో తనకు అర్థంకాని మెలికవుంది

మళ్లీ ఒకసారి ఉత్తరం మొత్తం చదివింది రాధ

చివరి వాక్యాలు మళ్లీ చదివింది

ఆలోచించి సరియైన నిర్ణయాలు తీసుకుంటావని ఆశిస్తాను

ఇంతవరకు తమ పరిచయంలో గోపాల్ తన దగ్గర దాచిందేమీ లేదు తన గురించీ తన కుటుంబం గురించీ అన్నీ తనకు చెప్పాడు

తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవటానికి తన స్నేహితుడి అడ్రసు కూడా యిచ్చాడు

తను వ్రాసిన ప్రేమలేఖ తిరిగి తనకు పంపాడు అంటే

ఎంత సంస్కారం!

రాధ ముఖం ప్రఫుల్లమయింది

తన ప్రేమలేఖ తనను పంపటంలో వున్న లాజిక్ అర్థమయింది

నిజాయితీ తెలిసింది

ఇప్పుడు తన కర్తవ్యం ? తాను అతనిని కాదంటే

హటాత్తుగా గోపాల్ మాటలు గుర్తుకు వచ్చాయి

ఒకవేళ నువ్వు నన్ను కాదంటే నేనీ లోకంలోనే వుండను

కంగారుగా లేచి నిల్చుంది రాధ

ఎక్కడికే తనూ లేచి నిలబడుతూ అంది కమల

గోపాల్ కాలేజీకి

గేటువైపు వడివడిగా అడుగులేస్తూ చెప్పింది రాధ 

# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్

Imageads M 1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ – తాజాతనము నందించు సబ్బు.

# జీవన్మృతులు

## ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

## స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్




"లూసీ చివరిదశలో మీరెంతో ఆమెకు సేవ చేసారు ఆమె ఎలా చనిపోయిందో నాకు తెలుసుకోవాలని వుంది లూసీ గురించి మిగతా అన్ని విషయాలు నాకు తెలుసు అవి వివిపించండి, చాలు మీకెంతో ఋణపడి వుంటాను ఆమె అంటే నాకెంతో, ఎంతో ప్రేమ" అన్నాను

అతను నా కోరికను విస్తుపోయాడు అతని మొహంలో ఎంతో భయం ఆవరించింది "ఆమె ఎలా చనిపోయిందో చెప్పాలా? ఏమయినా సరే, నే చెప్పలేను" అన్నాడు

"ఏం, ఎందుకని?" అడిగాను నేను గంభీరంగా మారిపోయాను నాలో బాధ ఎక్కువవుతోంది అతను క్షణం మౌనంగా వున్నాడు అతన్ని చూస్తూంటే, ఏదో ఒక నిషకోసం ఆలోచిస్తున్నట్లు వున్నాడు "చూడండి! డైరీలో ఎక్కడో ఒక భాగం కావాలంటే వెతికి చూడడం కష్టం అది నిజం అబద్ధం కాదు" వెంటనే అన్నాడు పిల్లాడిలా

నేను వదిలి పెట్టలేదు లూసీ గురించి అతను ఎంతో రికార్డు చేసి వుంటాడు అది తెలుసుకుంటే, ఆ భయంకర వ్యక్తి గురించి కొన్ని వివరాలు దొరుకుతాయి, అనిపించింది వెంటనే అన్నాను "అయితే, డాక్టర్ సెవార్డు! మీ డైరీని నేను కాపీ చేసి పెడతాను ఈ టైప్‌రైటర్ మీద"

అట్లా నేను అడగడం అతనికి ఏమాత్రం ఇష్టం లేనట్టు అనిపించింది అతని మొహం బాగా పాలిపోయింది

"అబ్బెబ్బే! లేదు, వీల్లేదు ఆ దారుణమైన విషయాలు మీరు తెలుసుకోడానికి వీల్లేదు" అన్నాడు

ఇది మరీ దారుణం నేనేం చెప్పాలో తోచక గదిలో అటూ ఇటూ పరికించాను అక్కడి టేబుల్ మీద టైప్‌చేసిన కాగితాలు కనిపించాయి వాటిని చూడడం అతను గమనించాడు

"మీరు నన్ను సరిగా అర్థం చేసుకోలేదు అవిగో, నా భర్త, నేనూ రాసిన డైరీల తాలుకు

**(గత సంచిక తరువాయి)**

టైపుచేసిన కాగితాలు వాటిని చదివితే నేను మీకు అర్థమవుతాను మీరు నన్ను నమ్మటం లేదు" అన్నాను

నిజంగా అతను గొప్పవాడు పాపం లూసీ అతని గురించి బాగానే వూహించింది అతను వెంటనే లేచాడు టేబుల్ సొరుగులాగి ఫోనోగ్రాఫ్ తాలుకు రికార్డు బయటకు తీసాడు

"నిజమే నేను మిమ్మల్ని నమ్మటం లేదు ఎందుకంటే మీ గురించి నాకు తెలీదుగాబట్టి ఇప్పుడే మీరంటే ఏమిటో అర్థమయింది మీ గురించి మొదటే తెలిసివుంటే బాగుండేది లూసీ నా గురించి మీకు చెప్పి వుంటుందని తెలుసు మీ గురించి కూడా చెప్పింది ఇక నా రికార్డు మీరు వినవచ్చు వాటిల్లో ఆరడజను దాకా నా వ్యక్తిగత విషయాలకు సంబంధించినవి అవి మీకు భయాన్ని కలిగించే విషయాలు కావు కేవలం నా గురించి తెలిపేవి ఈలోపు భోజనం ఏర్పాట్లు పూర్తి అవుతాయి నేను కూడా కొన్ని కాగితాలు చదవాలి" అన్నాడు

అతను తయారుచేసిన రికార్డు వినటానికి వీలుగా ఫోనోగ్రాఫ్‌ను నాకు ఏర్పాటు చేసిన గదిలోకి తీసుకువచ్చాడు ఇప్పుడు కొన్ని కొత్త సంగతులు తెలుస్తాయి, అవి ప్రేమ సంగతులు ఒకరివైపు నుండి ప్రేమకథ ముందే నాకు తెలుసు ఇకపోతే రెండవ వైపునుండి ఇప్పుడు వినాలి

### డాక్టరు సెవార్డు డైరీ:

సెప్టెంబర్, 29 జోనాథన్ డైరీ అద్భుతంగా వుంది చదువుతూ దాన్లో పూర్తిగా లీనమయిపోయాను వాళ్లావిడ డైరీ కూడా అంతే, చదువుతుంటే, కాలం తెలీలేదు వంట అయిందని మనిషి వచ్చింది అప్పుడు మినా దగ్గర్లో లేదు "ఆమె బాగా అలసిపోయి వుంటుంది విశ్రాంతి తీసుకోనివ్వు ఓ గంట ఆగి భోజనం చేస్తాం" అన్నాను మళ్ళీ నా పనిలో మునిగిపోయాను మినా డైరీ చదవటం పూర్తిచేసాను అదే సమయంలో ఆమె లోపలికి వచ్చింది ఆమె అందమైన మోములో విచారం అలుముకుంది ఆమె కళ్ళు తడితడిగా వున్నాయి, బాగా ఏడ్చినట్టు ఆమెను చూడగానే నా హృదయం ద్రవించింది ఈ మధ్య నాకు ఎక్కువగా కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి కారణం దేవుడికి తెలియాలి నా కన్నీళ్ళు కళ్ళల్లోనే నిలిచిపోయాయి ఆమె అందమైన కళ్ళు కూడా మళ్ళీ కన్నీళ్ళతో నిండిపోయి తళతళలాడుతున్నాయి చేతనయినంతగా బాధను అణచుకుంటూ "నా డైరీ యిచ్చి మిమ్మల్ని బాగా విచారంలో ముంచేసాననుకుంటున్నాను" అన్నాను

"అబ్బే, అదేం లేదు మీ హృదయం తెలిశాక నాకు నేను కదలిపోయాను ఈ ఫోనోగ్రాఫ్ చాలా గొప్ప యంత్రం ఈ యంత్రం మీ మనసునంతా విప్పి చెప్పింది ఒక ఆత్మ దేవుడితో మొరపెట్టుకున్నట్టుగా వుంది చూడండి, మీకు సహాయం చెయ్యటానికి కొచ్చాను మీ మాటలు రికార్డు చేసిన ఫోనోగ్రాఫ్ ఎని, టైప్‌రైటర్ మీద కాపీలు తీసాను మీ హృదయ స్పందన అందరికీ అర్థమయ్యేలా చేసాను" అంది

"వద్దు అది ఎవ్వరికీ తెలియటానికి వీల్లేదు" బొంగురు పోయిన గొంతుతో అన్నాను ఆమె తన చేతిని నా చెయ్యి మీద వేసి, "లేదు అది అందరికీ తెలియాలి" అంది గంభీరంగా

"తెలియాలా? ఎందుకు?" అడిగాడు

'ఎందుకంటే ఇందులో కొంత భాగం దారుణమైన కథ కొంత భాగం లూసీ మరణానికి, అందుకు దారితీసిన కారణాలకు సంబంధించినది ఇంకా ఎందుకంటే, ఇటువంటి రాక్షసుడ్ని ఈ భూమ్మీద నుండి వదిలించుకోడానికి అందరికి తెలియజేసి, వీలైనంత సహాయాన్ని ఇతర్ల దగ్గర్నుంచి పొందటానికి మీరిచ్చిన రికార్డు, నాకు చెప్పాలనుకున్న విషయాల కన్నా ఎక్కువే వున్నాయి ఈ అంతుబట్టని విషయాల గురించి మీదానిలో కొంత ఆధారాలు దొరుకుతాయనిపిస్తోంది నేను మీకు సహాయకారిగా వుంటాను చెప్పండి, వద్దా? మీడైరీలోని విషయాలు సెప్టెంబర్, 7 వరకు చదివినా, నాకు కొంత మేరకు విషయాలు తెలుసు అవేమిటంటే, లూసీ ఎట్లా బాధపడింది, ఆమె దుష్టశక్తులకు ఎట్లా లోబడిపోయిందీనూ ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్

**జరిగిన కథ – 24:** ఆ రాత్రికి లూసీ సమాధి దగ్గరకు వచ్చి చూస్తే దాంట్లో ఆమె కనిపించదు చర్చి ఆవరణలో పొంచివున్న సెవార్డ్‌కి లూసీ కనిపిస్తుంది వాన్‌హెల్సింగ్‌కి దొరికిన పసిపాపను పోలీసులకి అప్పగిస్తారు కానీ ఆ పాప మెడపై గాట్లు లేకపోవడం గమనిస్తారు ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఉత్తరం ద్వారా ఆర్థర్‌ను, క్విన్సీమోరిస్‌లను రప్పిస్తాడు వాళ్లకి కూడా సెవార్డ్‌కి చూపించిన దృశ్యాన్ని చూపిస్తాడు ఆర్థర్‌ని గుర్తుపట్టిన లూసీ అతన్ని చేరుకోబోయేంతలో వాన్‌హెల్సింగ్ అడ్డుపడతాడు లూసీ సమాధిలోకి వెళ్తుంది లూసీ శరీరంలో ప్రవేశించిన రాక్షసిని హతమారుస్తాడు ఆర్థర్, వాన్‌హెల్సింగ్ చెప్పిన విధంగా

కలిసిన తరువాత జోనాథన్, నేనూ, ఈ విషయాలు గురించి రాత్రింబగుళ్ళు పరిశోధిస్తున్నాం ఆయన విట్‌బీ వెళ్లారు, కొన్ని విషయాలు సేకరించడానికి రేపు వచ్చి మనకు సాయంగా వుంటారు కాబట్టి, మన మధ్య రహస్యాలకు తావులేదు ఒకరికొకరు నమ్మకంగా కలిసికట్టుగా పనిచేస్తే, మనకి బలం ఎక్కువగా వుంటుంది' అని ఆమె నా వంక చూసింది ఆమె ధైర్యానికి, ఆమె నిర్ణయాలకి నాకు ముచ్చట వేసింది వెంటనే 'అలాగే' అనాలని పించింది "మీకు ఎలా తోస్తే అలా చెయ్యండి నేనేమైనా తప్పు చేస్తే క్షమించాలి ఇంకా ఎన్నో భయంకరమైన విషయాలు తెలుసుకోవాల్సినవి వున్నాయి లూసీ మరణం వరకు మీకు విషయాలు తెలుసు వాటితో మీరు సంతృప్తి చెందరని నాకు తెలుసు కానీ—చివరకు—చిట్టచివరకు మీ మనసుకు ప్రశాంతిని కలిగించే విషయం వుంది పదండి భోజనం సిద్ధంగా వుంది మన ముందున్న విషయాలకు ఎదురు నిలబడాలంటే, ముందు మనం బలంగా వుండాలి ఎంతో దారుణమైన, భయంకరమైన పనులు మనం చెయ్యాల్సివుంది భోజనం అయిన తర్వాత ఆ విషయాలు తెలుసుకుందురుగాని



తర్వాత మీ ప్రశ్నలకు, సందేహాలకు జవాబుచెప్తాను" అన్నాను

## మినాహార్కర్ డైరీ :—

సెప్టెంబర్, 29 భోజనం ముగించాక డాక్టర్ సెవార్డుతో కలిసి అతని పరిశోధన గదిలోకి వెళ్లాను నా గదిలో వున్న 'ఫోనోగ్రాఫ్ యంత్రం' అతను తీసుకు వచ్చాడు నేను టైపురైటర్ ముందు కూర్చున్నాను నేను కూర్చోడానికి అనువుగా వుండే కుర్చీ యిచ్చాడు ఫోనోగ్రాఫ్ నా చేతికి బాగా అందుబాటులో వుంచాడు ఫోనోగ్రాఫ్‌ను ఆపాలంటే ఏం చెయ్యాలో చెప్పాడు అతను కుర్చీ వేసుకు కూర్చున్నాడు, అతని వీపు నాకు కనపడేటట్టుగా, కాస్త నాకు ఏకాంతంకల్పించడానికి అతను చదవటం మొదలెట్టాడు నా చెవులకు వినికిడి పరికరాన్ని పెట్టుకుని వినటం మొదలెట్టాను

లూసీ ఎంత భయంకరంగా చనిపోయిందో,—తర్వాత జరిగిన సంఘటనలు, అన్నీ టైప్ చేసాను నీరసంగా వెనక్కివాలాను అదృష్టవశాత్తు నాకు స్పృహకోల్పోయే జబ్బులేదు డాక్టర్ సెవార్డు నన్ను అట్లా చూసినప్పుడు, ఒక్క గంతులో నా దగ్గరి కొచ్చాడు గబగబా అలమరలో నుండి బ్రాందీ సీసా తీసి, గ్లాసులో కాస్తవొంపి చేతికిచ్చాడు కొద్దినిముషాల తర్వాత తేరుకున్నాను నాబుర్ర బాగా తిరిగిపోయినట్టుయింది అన్నీ ఎంతో ఒళ్ళు గగుర్పొడిచె భయంకర సంఘటనలే లూసీ చివరకు ప్రశాంతంగా చనిపోయిందని తెలిసి కాస్త మనసు వూరట చెందింది లూసీ గురించి ఇంత విన్నాక తట్టుకుని వుండలేక పోయాను అబ్బ! ఈ విషయాలు వినటానికి ఎంత దారుణంగా వున్నాయి! ఏ మాత్రం నమ్మదగినవిగా లేని వింత సంగతులు జోనాథన్ అనుభవాలు ఇంతకి ముందే విన్నాను గనక సరిపోయింది లేకపోతే, లూసీ చావు, తర్వాత సమాధి చేయడం వగైరా, ఏ మాత్రం నమ్మేదాన్ని కాదు ఇప్పటికీ సరిగా నమ్మబుద్ధి కావటంలేదు ఈ పరిస్థితుల్లో మళ్ళీ పనిలో పడటం మంచిది అనుకున్నాను మళ్ళీ టైపు చెయ్యడం మొదలెట్టబోయే ముందు —

"ఈ సంగతులన్నీ నేను టైపు చేయాలి డాక్టర్ వాన్‌హెల్సింగ్ వచ్చేటప్పటికి మనం సిద్ధంగా వుండాలి విట్ బీ నుంచి లండన్‌కి రాగానే వెంటనే బయలుదేరి ఇక్కడకు రమ్మని జోనాథన్‌కు టెలిగ్రాం ఇచ్చాను మీరు చెప్పిన విషయాలు తేదీలు చాలా ముఖ్యం కావలసిన విషయాలన్నీ సేకరించి పెట్టుకోవాలి జరిగిన సంఘటనలు తేదీల క్రమంలో పేర్చుకుని వుంచాలి అప్పుడు చదవటానికి బాగుంటుంది లార్డ్ గాడ్ అల్మింగ్







(ఆర్డర్), మిస్టర్ మోరిస్ కూడా వస్తున్నట్టు మీరు చెప్పారు వాళ్ళు వచ్చేటప్పటికి వాళ్ళకి చక్కగా కథలా చెప్పగలిగితే చాలు,'' అన్నాను

అప్పుడు అతను మళ్ళా ఫోన్‌గ్రాఫ్‌ని మెల్లగా పెట్టాడు ఏడవ రికార్డు దగ్గర్నించి మొదలుపెట్టి టైపు చేయసాగాను టైపు చేయటానికి పల్చటి కాగితాలు ఉపయోగించాను, మూడు కాపీలు రావటానికి వీలుగా మిగతావన్నీ పూర్వం అలాగే చేసాను అవన్నీ పూర్తి చేసేసరికి బాగా ఆలస్యమయింది డాక్టర్ సెవార్డు తన పేషంట్లను చూడటానికి వెళ్ళాడు తర్వాత తిరిగి వచ్చి నాకు దగ్గరగా కూర్చున్నాడు చదువుతూ అతను తోడుగా వుండటం వల్ల నాకు ఒంటరిగా వున్న బెంగ లేకపోయింది అతను ఎంత మంచివాడు! పనులు చక్కగా ఆలోచించి చేస్తాడు ఏమిటో, ఈ ప్రపంచమంతా మంచితనం వున్న మగాళ్ళతో నిండిపోయినట్టు అనిపిస్తుంది, కొంతమంది రాక్షసులు కూడా వున్నాకూడా 'ఎగ్జిటర్'లో సాయంత్రం పేపరులో ఒక విషయం చదువుతూ, ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఎంత ఆందోళన చెందాడో జోనాథన్ తన డైరీలో రాసుకున్నాడు ఆ విషయం నాకు గుర్తొచ్చింది డా సెవార్డ్ వార్తాపత్రికలన్నీ జాగ్రత్త చేస్తున్నట్టు గమనించాను అతను ఫైలుచేసిన 'ది పాల్‌మాల్ గెజిట్'ను 'ది వెస్ట్ మినిస్టర్ గెజిట్'ను అడిగితీసుకున్నాను వాటిని నా గదిలోకి తీసుకెళ్ళాను 'ది డైలీ టెలిగ్రాఫ్', 'ది విట్ బి గెజిట్' పత్రికల్లో కొన్ని వార్తలను కత్తిరించి జాగ్రత్త చేసినట్టు గుర్తువచ్చింది వాటినిబట్టి డ్రాకులా 'విట్ బీ'కి రావటంతో ప్రకృతిలో ఎంత భీభత్సం జరిగిందో అర్థం చేసుకోవచ్చు అప్పటి 'సాయంత్రం పత్రిక'లన్నీ చదివితే ఇంకా కొన్ని విషయాలు వెలుగులోకి రావచ్చు చేతినిండా పని వుండటంవల్ల నాకు నిద్ర రావటం లేదు

### డాక్టర్ సెవార్డు డైరీ :

సెప్టెంబర్, 30 జోనాథన్ తొమ్మిది గంటలకు వచ్చాడు అతని భార్య ఇచ్చిన టెలిగ్రాం అందుకున్నాడు, బయలుదేరి వచ్చేముందు అతను అసాధారణమైన తెలివిగలవాడు, దిట్టమైనవాడు అని అతని మొహం చూస్తుంటే అనిపిస్తుంది

## జీవన్మృతులు

అతను డైరీలో రాసుకున్న విషయాలు, అనుభవాలు, నిజమయితే, అతను ఎంతో మనో నిబ్బరంగల మనిషి అనిపిస్తుంది అతను డ్రాకులా కోట క్రింది అంతస్తులోకి రెండోసారి పాక్కుంటూ వెళ్ళటం, చాలా గొప్పధైర్యంతో కూడుకున్న పని! అతనిడైరీ చదివిన తర్వాత నేనొక గొప్ప మగధీరుణ్ణి కలుసుకోబోతున్నట్టు అనుభూతి చెందాను తీరా కలిసిన తర్వాత, ఎంతో సౌమ్యంగా, తన పని తాను చూసుకునే మనిషిలా కనిపించాడు

తర్వాత భోజనం అయిన తర్వాత అతను, అతని భార్య తమ గదిలోకి వెళ్ళారు ఒకసారి అటువేపు వెళ్ళినపుడు టైపురైటర్ శబ్దం విన వచ్చింది అంటే వాళ్ళు కాగితాల పనిమీదే వున్నారు డైరీలు వార్తాపత్రికల కత్తిరింపులు, వీటిలోని విషయాలన్నీ ఒక వరుసక్రమంలో పేర్చి వుంచుతామని చెప్పింది 'విట్ బీ'లో డెలివరీ తీసుకున్న చెక్కపెట్టెల తాలూకు ఉత్తరాలను, జోనాథన్ సంపాదించాడు అతను ఆమె టైపుచేసిన నాడైరీని చదువుతున్నాడు అది చదివి వాళ్ళు దాన్నో ఏం రాబడతారో అనిపించింది ఇదిగో ఏదో చెప్పకుంటున్నారు

చాలా వింతగా వుందే! మా ఇంటి పక్కనే డ్రాకులా వుంటున్నాడా! రెన్‌ఫీల్డు ప్రవర్తన వల్ల డ్రాకులా గురించి కిటుకులు తెలుసుకోవచ్చా! మా పక్క ఇల్లు కొనడం గురించి బోల్డు ఉత్తరాలు టైపు చేసినవి వున్నాయి ఇవన్నీ ముందే తెలిసినట్లయితే, పాపం లూసీని రక్షించుకోడానికి వీలుపడేది ఇట్లా ఆలోచిస్తూపోతే పిచ్చి ఎక్కుతుంది ఆపేస్తాను జోనాథన్ మళ్ళీ బయట కెళ్ళాడు, ఏవో కొన్ని విషయాలు సేకరించడానికి మళ్ళీ భోజన సమయానికల్లా, డ్రాకులా విషయాలన్నీ ఒక కొలిక్కి తీసుకు వచ్చి చూపిస్తానన్నాడు ఈలోపు ఒకసారి రెన్‌ఫీల్డును చూసి రావాలి ఎందుకంటే, అతని ప్రవర్తనలో మార్పునుబట్టి, డ్రాకులా రాకపోకల గురించి తెలుస్తుంది అని అంటాడు అతను నాకు మాత్రం అలా అనిపించలేదు ఇంకా ఈ మధ్యన జరిగిన సంఘటన తేదీలు ఒకసారి చూస్తేగానీ ఈ విషయాన్ని ఒప్పుకోలేను మినా, నా రికార్డు అంతా టైపుచేసి మంచిపని చేసింది లేకపోయినట్టయితే, ఆ తారీకుల విషయం నేను అసలు పట్టించుకునే వుండేవాణ్ణి కాదు

రెన్‌ఫీల్డు చేతులు ముడుచుకుని కూర్చున్నాడు మెల్లగా నవ్వుతున్నాడు అతన్ని చూస్తుంటే, ఒక్కసారి అతనికి పిచ్చిలేదనిపిస్తుంది అతని దగ్గర కూర్చుని విషయాలు మాట్లాడాను వాటన్నిటినీ అతను మామూలుగా విన్నాడు ఆ సమయంలో అతను తన ఇంటికి తిరిగివెళ్ళే విషయం గురించి అడిగాడు అతను ఇక్కడకు వచ్చిన తర్వాత ఎప్పుడూ ఆ విషయం అడగలేదు అప్పటికప్పుడు డిస్‌ఛార్జి చేసినా వెళ్ళిపోవడానికి సిద్ధంగా వున్నాడు మినా టైపుచేసిన కాగితాలు చదివాక, తారీకులు చూసాక, ఇక అతన్ని వదిలిపెట్టాలనుకోలేదు అవి చూడనట్టయితే, ఒకటి రెండు రోజులు అతని ప్రవర్తన పరిశీలించి, తర్వాత అతను చెప్పినట్టే పంపిం వుండేవాణ్ణి ఇప్పుడు గొప్ప ఇరుకున పడిపోయాను అతను వున్నట్టుండి తప్పించుకు పారిపోవడాలు డ్రాకులా రాకకు ఏవో సంబంధాలున్నాయి మరయితే, ఇతను మామూలు మనిషి అయి వెళ్ళిపోతాననడంలో ఏమిటి అర్థం? డ్రాకులా పొందుతున్న విజయాలు ఇతనికి తృప్తినిస్తున్నాయా? అంతే అనుకోవాలి అతను ఒక జంతువులా పిచ్చిగా ప్రవర్తించినపుడు 'మాస్టర్' అని అరవడం తనకి తెలుసు కాసేపు వుండి నేను తిరిగి వచ్చేసాను అతనితో మాట్లాడుతూ కూర్చుందామనుకున్నా గానీ, అతను చాలా తెలివిగా వుండటంవల్ల నా ఆలోచనను మానుకున్నాను కానీ అతన్ని నమ్మటానికి వీల్లేదు ఎప్పుడు ఏ రకంగా మారతాడో తెలీదు అందుకే అక్కడవున్న తనకి రెన్‌ఫీల్డును దగ్గరగా వుండి గమనించమని చెప్పాను

### జోనాథన్ డైరీ

సెప్టెంబర్ 29, లండన్ వెళ్ళే రైల్లో — ఏ విషయం అడిగినా చెప్తాను అని మిస్టర్ బిల్లింగ్‌టన్ ఎంతో ఆప్యాయంగా రాయటం 'విట్‌బీ'కి స్వయంగా వెళ్ళడం మంచిదనుకున్నాను ఓడలో వచ్చిన సరకు లండన్‌లో ఎవరికి వెళ్ళిందో కనుక్కోవాలని నా వుద్దేశం తర్వాత దాని గురించి ఆలోచించవచ్చు బిల్లింగ్‌టన్ కొడుకు చాలా మంచివాడు అతనే స్టేషన్‌కి వచ్చి నన్ను కలిసాడు తర్వాత నన్ను వాళ్ళ నాన్న దగ్గరికి తీసుకెళ్ళాడు ఆ రాత్రికి నన్ను అక్కడే వుండమన్నారు వాళ్ళు నన్ను చాలా ఆప్యాయంగా, గౌరవంగా చూసారు నాకు చాలా పనులున్నాయనీ, నేను

ఎక్కువసేపు వుండననీ వాళ్ళకు తెలుసు అందువల్ల, నాకు కావలసిన విషయాలకు సంబంధించిన కాగితాలతో బిల్లింగ్‌టన్ సిద్ధంగా వున్నాడు ఓడలో వచ్చిన చెక్కపెట్టెల గురించిన కాగితాలు చూసాను ఆ ఉత్తరాలు నేను డ్రాకులా దగ్గరవున్నప్పుడు చూసినవే, మళ్ళీ వాటిని ఇప్పుడు చూడటం తటస్థించింది అప్పుడు అతని పనులు ఏమిటో అర్థం కాలేదు అతను అన్నీ పనులు ఎంతో చక్కగా ఆలోచించి, క్రమబద్ధంగా పనులు చేసుకొచ్చినట్టు కనిపించింది తను చేయదల్చుకున్న పనులకు ఎటువంటి ఆటంకాలు రాకుండా ఎంతో జాగ్రత్త తీసుకున్నాడు కేవలం జాగ్రత్తవల్ల అతను పనులను చక్కబెట్టుకున్నాడు సరుకు తాలుకు 'ఇన్‌వాయిస్' చూసాను అందులో 'యాభై మామూలు చెక్కపెట్టెలు— ప్రయోగం నిమిత్తం' అని రాసుంది కార్టర్ పాటర్‌సన్‌కు రాసిన ఉత్తరం, వారిచ్చిన జవాబు, కాపీలు తీసుకున్నాను మిస్టర్ బిల్లింగ్‌టన్ నాకు సేకరించి ఇవ్వగలిగిన విషయాలు ఇవే ఇక అక్కడ్నించి సముద్రతీరానికెళ్ళాను, కోస్టుగార్డ్సుని, కస్టమ్స్ అధికారుల్ని, హార్బర్ మాస్టర్ని చూడటానికి వాళ్ళు ఓడ తుఫానులో ఒడ్డుకి రావటం గురించి చాలా వింతగా చెప్పారు కానీ వీళ్ళెవరూ, యాభై చెక్కపెట్టెలసంగతి చెప్పలేదు అక్కడ్నించి స్టేషన్ మాస్టర్ని కలిసాను, అతను నిజంగా ఆ చెక్కపెట్టెలను ఎవరు అందుకున్నారో ఆ మనుషుల్ని నాకు వప్పజెప్పాడు వాళ్ళ దగ్గరున్న లిస్టు ప్రకారం యాభై చెక్కపెట్టెలు వుండటం సరియైన విషయమే అవి చచ్చేంత బరువుగా వున్నాయని కూడా చెప్పారు

సెప్టెంబర్, 30 ఈ స్టేషను మాస్టరు స్నేహితుడు మరొకతను 'కింగ్స్‌క్రాస్' దగ్గర స్టేషను మాస్టరుగా వున్నాడు అతన్ని కనుక్కోమన్నాడు చెక్కపెట్టెల సంగతి అతన్ని అడిగాను అతను కూడా కొందరు మనుషుల్ని చూపించాడు విషయం వాళ్ళని అడిగాను 'ఇన్‌వాయిస్' ప్రకారం యాభైపెట్టెలున్నాయని వాళ్ళూ చెప్పారు ఇంకా ఎక్కువ విషయాలు సేకరిద్దామనుకంటే, వాళ్ళు అంతకంటే ఏవీ చెప్పలేకపోయారు

అక్కడ్నించి కార్టర్, పాటర్‌సన్ వాళ్ళ సెంట్రల్ ఆఫీసుకు వెళ్ళాను అక్కడ వాళ్ళెంతో సౌమ్యంగా మాట్లాడారు వాళ్ళ ఫైళ్ళు చూసిన తర్వాత ఇంకా ఎక్కువ వివరాలు తెలుసుకోవాలని వాళ్ళ 'కింగ్స్ క్రాస్'లో వున్న ఆఫీసుకు ఫోను చేసారు అదృష్టవశాత్తూ, ఆ పెట్టెల లోడింగ్ అన్ లోడింగ్ చేసిన ముఠా అక్కడ దొరికింది వాళ్ళు చెప్పినదాన్నిబట్టి అది బోళ్ళంత బరువు పని అని మాత్రం చెప్పారు అందులో ఒకడికి కాస్త డబ్బు ఆశ చూపాను, వివరాలు ఇంకా చెప్పమని అందుకు వాడు —

''అక్కడొక పురాతనమైన ఇల్లు వుంది వంద ఏళ్ళుగా దాన్ని ఎవడూ ముట్టుకొని వుండడు ఇంటి లోపలంతా బాగా దుమ్ము పేరుకు పోయి వుంది అది చూస్తే ఎన్నో యుగాంనాటి ఇల్లు అనిపిస్తుంది పాత చర్చిలా వుంది నేను, నా స్నేహితుడు అందులోంచి బయటపడటానికి చాలాసేపు పట్టింది — అంత చీకటిగా వుంది ఓయి దేవుడోయ్ ! చీకటి పడింతర్వాత అందులో ఒక్క క్షణం కూడా వుండలేం'' అన్నాడు

అతను స్వయంగా ఆ ఇంట్లోకి వెళ్ళి వచ్చిన వాడు గాబట్టి అతన్ని నమ్మవచ్చు పైగా ఆ ఇల్లు ఎట్లావుంటుందో నేను కూడా వూహించగలను

ఒక్క విషయం మాత్రం నాకు సంతృప్తి కలిగించింది అదేవిటంటే, అన్ని చెక్కపెట్టెలు, 'వర్నా' నుంచి 'డిమిటర్' ఓడలో 'విట్ బి'కి సురక్షితంగా చేరడం, అవి 'కార్‌ఫాక్స్'లో వున్న పాత చర్చిలాంటి ఇంట్లో చేర్చబడటం ఇప్పటికి కూడా ఆ యాభై చెక్కపెట్టెలు వుండి వుండాలి, డాక్టర్ సెవార్డు డైరీ ప్రకారం, వాటిల్లో కొన్ని అక్కడ్నించి కదిలిస్తే తప్ప

'కార్‌ఫాక్స్' ఇంట్లోంచి చెక్కపెట్టెలు ఎవరు తీసుకెళ్ళారో తెలుసుకోవాలి అప్పుడే కదా రెన్‌ఫీల్డు వాళ్ళతో తిరగబడింది దీనివల్ల మరికొన్ని విషయాలు బయటపడవచ్చు

తర్వాత మినా నేను పగలంతా ఈ పనిమీదే వున్నాం కాగితాలు టైపుచేసి అన్నీ వరుస క్రమంలో సర్ది పెట్టి వుంచాం

## మినా డైరీ

సెప్టెంబర్, 30 ఇంతకాలం నాకు ఒక విధమైన భయం వెన్నాడుతుండేది అదే, జోనాథన్ తన పాత అనుభవాలు గుర్తుకు తేస్తే ఏమౌతుందో అనుకునేదాన్ని కానీ అతను ఎంతో ధైర్యంగా 'విట్ బీ' వెళ్ళడం చూసాను అయినా ఏదో బెంగ నాకు ఈ ప్రయాణం అతనికి బాగా పని చేసింది ఇప్పుడు చాలా మనోస్థయిర్యం చూపించగలుగుతున్నాడు ప్రొఫెసర్ వాన్ హెల్సింగ్ చెప్పినట్టు, జోనాథన్ చాలా పట్టుదల, ధైర్య సాహసాలు గల మనిషి ఇదే మరొకరయితే, తట్టుకొని వుండేవారు కాదు 'విట్ బీ' నుంచి అతను ఎంతో ఉత్సాహంగా, ఏదో చెయ్యాలనే దృఢ సంకల్పంతో వచ్చాడు ఇవాళ రాత్రికి అన్ని విషయాలు ఒక కొలిక్కి తీసుకు రావడానికి సిద్ధంగా వున్నాయి నాలో తెలియని ఉత్సాహం వచ్చేస్తోంది

తర్వాత గాడ్ ఆల్మిగ్ (ఆర్థర్) ప్రభువు, మిస్టర్ మోరిస్ మేం అనుకున్నదానికంటే ముందే వచ్చారు డాక్టర్ సెవార్డ్, జోనాధన్ని తీసుకొని ఏదో పనిమీద బయటకు వెళ్ళాడు ఇక నేను వీళ్ళను చూడాల్సి వచ్చింది వాళ్ళిద్దర్నీ చూడగానే, లూసీ సంగతులన్నీ గుర్తుకువచ్చి బాధ వేసింది వీళ్ళు లూసీని ప్రేమించిన సంగతి నీకు తెలుసునన్న విషయం పాపం వీళ్ళకు తెలీదు

వీళ్ళిద్దరూ నాతో ఏం మాట్లాడాలో తెలీక మౌనంగా వుండిపోయారు దుష్టశక్తుల గురించి నాకు బాగా తెలుసునన్న విషయం కూడా వీళ్ళకు తెలియదు అందుచేత, వేరే విషయాలమీద మాటలు సాగించారు ఇక ఇట్లా లాభం లేదని చెప్పి, అసలు విషయానికొద్దామని నిర్ణయించుకున్నాను డాక్టర్ సెవార్డు డైరీ ప్రకారం లూసీ మరణసమయంలో, మరణం అంటే నిజమైన మరణం, ఆ సమయంలో వీళ్ళు సమాధి దగ్గర వున్నట్టు నాకు తెలుసు అందువల్ల డాక్టర్ సెవార్డు డైరీ, కొన్ని కాగితాలు, జోనాధన్ డైరీ అన్నీ చదివానని, అన్నీ టైపుచేసి వుంచాననీ వాళ్ళతో చెప్పాను చెరొకకాపీ ఇచ్చాను గాడ్ ఆల్మింగ్ (ఆర్థర్) ప్రభువు ఆ కాపీని తీసుకుని అటూ యిటూ తిప్పి చూసాడు అదొక చిన్న బొత్తిలా వుంది

''ఇవన్నీ మీరే టైపు చేసారా ? మిసెస్ మినా ?'' అడిగాడు

అవునని తలూపాను మళ్ళీ అతనే అన్నాడు, ''వీటి అంతర్యం ఏమిటో నాకు తెలీదు కానీ మీరంతా ఎంతో కష్టపడుతున్నారు ఎంతో పట్టుదల చూపిస్తున్నారు మీరు చేస్తున్న పనులు గుడ్డిగా వూకొట్టే, వీలయితే చేతనయినంత సహాయం చెయ్యటం నా విధి పైగా మీరు నా లూసీని ఎంతగానో ప్రేమించారు '' అతను మొహాన్ని పక్కకి తిప్పుకుని రెండు చేతుల్తో కప్పుకున్నాడు అతని కంఠం రుద్ధమయింది మిస్టర్ మోరిస్ ఒక్కక్షణం ఎంతో సున్నితంగా అతని భుజంమీద చెయ్యి వేసాడు ఓదార్పుగా తర్వాత గదిలోంచి బయటకు వెళ్ళిపోయాడు

అమ్మాయిల నైజంలో ఏదో గొప్పతనముంది మగవాడు వాళ్ల ముందు మనసు విప్పి, తన బాధను వెళ్లగక్కుతాడు, ఒక ప్రక్క తన మగ హుందాతనాన్ని నిలుపుకుంటూనే గాడ్ ఆల్మైటీ ప్రభువు (ఆర్థర్) నాతో ఒంటరిగా వున్నాడు అక్కడ సోఫాలో కూర్చుని తన బాధను దాచుకోలేక బయటపడ్డాడు నేను అతని పక్కన కూర్చుని అతని చేతిని నా చేతిలోకి తీసుకున్నాను అంత చనువు తీసుకున్నందుకుఅతనుఏమీ అనుకోలేదను కుంటాను అతను హృదయం పగిలినంతగా బాధ పడుతుంటేచూసాను

"లూసీ అంటే నాకు ఎంతో ప్రేమ ఆమె మిమ్మల్ని పెళ్లాడుతుందని నాకు తెలుసు మీరు కూడా ఆమెను ప్రేమించారని తెలుసు మేం ఇద్దరం తోబుట్టువుల్లా తిరిగాం ఆమె వెళ్ళిపోయింది నన్ను మీ చెల్లెల్నిగా భావించండి మీ బాధను నన్ను పంచుకోనివ్వండి మీ హృదయం ఎంతగా క్షోభిస్తోందో నాకుతెలుసు ఓదార్పువల్ల మీకువూరటగలిగితే, ఆపని నన్ను చెయ్యనివ్వండి కనీసం లూసీ కోసం" అన్నాను

అట్లా అనగానే, అతనికి దుఃఖం ఆగలేదు ఎంతో కాలం నుంచి దాచుకున్న దుఃఖం ఒక్కసారే బయటకు వచ్చినట్టు అనిపించింది అతని ఆవేదన ఎక్కువయింది తన రెండు చేతుల్ని పైకెత్తి చప్పట్లు కొట్టాడు సోఫాలోంచి లేచి నిలబడ్డాడు మళ్ళీ కూర్చున్నాడు అతని కన్నీళ్ళు చెంపలమీదుగా జారుతున్నాయి అతన్ని చూడగానే విపరీతమైన జాలి పుట్టుకొచ్చింది అనుకోకుండా నా చేతుల్ని ముందుకు చాపాను ఒక్కసారిగా పెల్లుబికిన దుఃఖంతో నా భుజంమీద తల వాల్చాడు, చంటిపిల్లాడిలా

అతనలా చేయగానే నేనొక తల్లిలా మారిపోయాను మా ఆడవాళ్లలో అది సహజం

## జీవన్ వృత్తాలు

మనసులో తల్లిలాంటి ప్రేమ కల్గగానే, ఎంతో ఉన్నతంగా ప్రవర్తిస్తాం అతని తల నా ఎదమీద ఆనించి వుంది, చంటిపిల్లాడు తల్లి రొమ్ములమీద తల ఆనించినట్టు అతని తలకు నిమిరాను, అతను నా కన్నబిడ్డ అయినట్టుగా ఇదంతా ఎంత అనుకోని సంఘటన! అప్పుడూ ఏమీ అనిపించలేదు

అతని విచారం తగ్గిపోగానే, తను దూరంగా జరిగాడు, క్షమించమంటూ ఎన్నో రాత్రిళ్ళు, ఎన్నో పగళ్ళు, నిద్ర లేకుండా గడిపానని చెప్పాడు ఎవరితోనూ ఏమి చెప్పుకోలేకపోయాడట తన బాధను వెళ్లగక్కుకునేందుకు, వూరట పొందేటందుకు, ఏ స్త్రీ యొక్క ఆప్యాయతనూ తను పొందలేదట బాధనంతా బయటకు ఎవరికీ చెప్పుకునే స్వేచ్ఛలేక, మనసులోనే కుమిలిపోయాడట "నేనెంత కుమిలిపోయానో నాకు తెలుసు" అన్నాడు కన్నీళ్ళను తుడుచుకుంటూ "నాకే తెలీటంలేదు, ఎవరూ చెప్పలేరు కూడా ఈ రోజు నేనెంత ఆప్యాయత, వూరట ఒక స్త్రీ నుంచి పొందగలిగానో!" మీరు నన్నొక సోదరునిగా భావించండి, ఏం? మనందరి కోసం, లూసీ ఆత్మకోసం" అన్నాడు

"అట్లాగే" అన్నాను అతనితో చేతులు కలుపుతూ

"ఈ రోజు నాకు సంతోషంగా వుంది ఈ రోజు మీరు నాకెంతో దగ్గరయ్యారు దేవుడు మీకు ఎటువంటి కష్టాలు లేకుండా చూస్తాడు మీకెప్పుడైనా కష్టం కలిగితే నాకు తెలియజేయండి నేను నా చేతయినంత సహాయం చేస్తాను సరేనా?" అన్నాడు అతను కాస్త తేరుకున్నాడు విచారంలోంచి అతన్ని మరింత వూరడించడం కోసమని "అలాగే" అన్నాను నేనువరండాలోకి వచ్చాను అక్కడ మిస్టర్ మోరిస్ కిటికీలోంచి బయటకు చూస్తూ కని పించాడు అతను నా అడుగుల చప్పుడు విని వెనక్కి తిరిగి చూసాడు "ఆర్థర్ ఎలా వున్నాడు?" అడిగాడు అతను ఎర్రబడ్డ నా కళ్ళను చూసి "ఓ, మీరు అతన్ని ఓదార్చుతూవున్నారన్నమాట! పాపం, అతనికి ఎవరూలేరు మగవాడి హృదయానికి గాయమయినప్పుడు, ఒక్క స్త్రీ తప్ప మరెవ్వరూ ఓదార్చలేరు అతనికి అల్లాంటి స్త్రీ ఎవరూలేరు" అన్నాడు మోరిస్ కూడా బాధపడ తున్నాడుగానీ, అతను ఎంతో ధైర్యంగా నిలదొక్కు కున్నాడనిపిస్తోంది నేను టైపు చేసిన కాగితాలు అతని చేతిలో కనిపించాయి అవన్నీ చదివేవుంటాడు కాబట్టే, అన్ని విషయాలు నాకు బాగా తెలసని అతనికి అర్థమయి వుంటుంది అందుకే అతనితో అన్నాను "బాధాతప్త హృదయాలను నేను ఓదార్చ గలననే అనుకుంటున్నాను మీరు కూడా నన్ను మిత్రురాలిగా భావించండి మీ బాధల్ని వింటాను" అతను నా వంక చూసాడు ఒక్కసారిగా నా చేతిని అందిపుచ్చుకుని దాన్ని ముద్దు పెట్టుకున్నాడు అతనికి అది ఎంతో ఓదార్పునిచ్చింది అతన్ని చూస్తే జాలేసింది వంగి నుదుటిమీద ముద్దుపెట్టాను అతని కళ్ళల్లో నీళ్ళు నిలిచినాయి అతని కంఠం రుద్ధమయింది ఎంతో నెమ్మదిగా అన్నాడు—

"పాపా! ఇంత ఆప్యాయతను కురిపిస్తున్న నీకు ఎప్పుడూ సంతోషం కలగాలి!" అని వెంటనే తన మిత్రుడి గదిలోకి వెళ్లాడు

"పాపా!" అని పిల్చాడు అతను లూసీని కూడా అలాగే పిల్చాడు మోరిస్ తను గొప్ప స్నేహితుడుగా మరోసారి రుజువు చేసుకున్నాడు

(ఇంకా వుంది)

## వి. బి. ఆర్ — విజయవాడ

ప్రేమకు మరణంలేదు దానికి ఓటమిలేదు అన్నారు ఒక మహాకవి ?

★ నిజమే— ఏనుగులాగా చచ్చినా— బ్రతికినా కూడా ప్రేమకి కీర్తి దక్కుతుంది కదా

## డి. ఎల్. ఆర్. — వత్తువల్లి

మంత్రిగాడికో కారు దేవుడిగాడికో గుడి— మరి భావి పౌరులకు ?

★ ఒక జోలి చాలదా !

## ఎస్. ఎస్. ఎమ్. — ఇల్లెందు

ఈ రోజుల్లో మగవాళ్ల చదువులకే ఉద్యోగాలు రావడంలేదు ఇక ఆడవాళ్ల ఉద్యోగ ప్రయత్నాలెందుకు ?

★ ఎలాగో— ఇల్లు గడవాలి కద— ఎవరు సంపాదిస్తేనేం ?

ప్రేమ విషయంలో చాలామంది పెళ్లిళ్లు చేసుకోరు తల్లి— తండ్రులు పిల్లల ప్రేమలు అర్థం చేసుకోరు ఏం చేయాలి !

★ ప్రేమ— బాధ్యతతో కూడినది బాధ్యతలు పెద్దల నెత్తిన రుద్దేసి ప్రేమ మటుకు మోస్తాం అంటే ఎలా ఒప్పుకుంటారు తల్లి తండ్రులు !

## డి పి. జి. — పి ఎస్. వగర్

మేము మీకిచ్చే ప్రశ్నలకు, దానికి మీరిచ్చే జవాబులను చూస్తే మీకు 99 9% బుర్ర తిరుగుడనిపిస్తుంది దీనికి కారణం ?

★ ఆ ఒక్క పర్సెంటు కూడా నన్నర్థం చేసుకునే తెలివి మీ బుర్రలో లేదని అర్థం గిరిధర్ బాబూ !

## కె. జి. ఎస్. కె — కుప్పం

రచనలకు జీవితానుభవం ఎంతవరకూ అవసరం ?

★ కొంతవరకేనా చాలా అవసరం — లేకపోతే — యిరుగింటి పొరుగింటి జీవితాలని యథాతథంగా చిత్రించేసి — అన్యాయంచేసే ప్రమాదం వుంది




## ఎమ్. ఎమ్ ఎస్. ఆర్ — అక్కుపల్లి

అందమైన ప్రతివస్తువు అందుకోవాలనుకోవడం పొరపాటు కావచ్చు కాని అందిన ప్రతిది అందమైనదనుకొంటే ?

★ అసలు — ప్రతీదీ అందుకోవడమేమిటి !

## పి యు. ఎమ్. — కాశీబుగ్గ

మీ ప్రశ్నావళిలో పాఠకులడిగే ప్రశ్నలకి మీరిచ్చే సమాధానాలు నాకు చాలా బాగుంటాయి కాని నా స్నేహితునికి మాత్రం మహ చికాకు ఎందుకంటారు ?

★ అతగాడిది పద్దెనిమిదో శతాబ్దపు దృష్టి కాబోలు !

## ఎన్. వి ఆర్ జి — మండపేట

కె రా గారూ! నాకు కథలు రాయాలని వుంది కాని ఐడియాలు రావట్లేదు ఎలాగ ?

★ మండపేట లోనే ఐడియాలు రావట్లేదంటే — యిక మద్రాసులో ఎలా దొరుకుతాయయ్యా బాబూ !

## కె వి డి — అవనిగడ్డ

విడాకులు పుచ్చుకున్నవారికి సంతానం ఉన్నచో వారు తద్దినాలు పెట్టాలా ? మీకు తద్దినాలమీద నమ్మకం వుందా ?

★ నాకు తద్దినాలు తెలియదు అయినా విడాకులుచ్చుకుని మనశ్శాంతి కొనుక్కున్నవారికి తద్దినాలు దేనికి !

## ఎం. పిహెచ్. — భిలాయి

తల్లి సత్యం మరి తండ్రి ?

★ నిత్యం !

## పి వి. ఎల్. ఎమ్ — అక్కువల్లి

మీ స్త్రీజాతికి అసలైన స్వతంత్రం ఎప్పుడు వస్తుందంటారు ?

★ తమకి తాము స్వతంత్రులమని తలపోయనంతకాలం ఎవరూ స్వతంత్రులు కారు

## బి. ఎమ్ బి.వి వి - హైద్రాబాదు

రామలక్ష్మిగారూ ! మీకు తెలుగునాడులో ఉండేందుకు చోటే దొరకలేదా, మద్రాసులో మకాం పెట్టారు ?

★ ఏదో తెలుగుప్రజ విరాళాలు పోగుచేసి ఓ కొంపేనా కట్టించి యివ్వదా మకాం పెట్టడానికని ఎదురు చూస్తున్నాను మురళీ !

## ఎస్ ఎస్ — విశాఖ

సాంఘిక దురాచారాలను రచనలద్వారా రూపుమాపకలరు మరి ఎందుకు ప్రయత్నించరు ?

★ దురాచార నిర్మూలనే కథ చేస్తే— మీరు చదువుతారా !

## ఉదయ్ — వజ్రకారూరు

వరకట్నంపై మీ అభిప్రాయం ఏమిటి ?

★ తీవ్రంగా నిరసిస్తాను అబ్బాయి అమ్మాయిలమధ్య ఉండవలసిన నవ్యమైన సంబంధ బాంధవ్యాలని వక్రం చేస్తుందీ— దురాచారం

వరకట్నం బాధలవల్ల ఎందరో అమ్మాయిల జీవితాలు బలి అయిపోతున్నాయి ఇలా అయిపోవలసినదేనా ?

★ అమ్మాయి పుట్టినదాదిగా — పెళ్ళే ధ్యేయంగా పెంచితే వచ్చే చిక్కుయిది అమ్మాయిని ఓ వ్యక్తిగా రూపొందిస్తే యింత దైన్యంగా తయారవదు పరిస్థితి జీవితంలో పెళ్లి ఒక భాగం గాని పెళ్లి జీవితం కాదు కదా !






# పాత చొక్కా - లవలి

"పువ్వులా పుట్టి, పువ్వులా పరిమళించి, పువ్వులా రాలిపోవాలి"

"                    "

"అలా రాలిపోవడానికి ఎంత పుణ్యంచేసుకు పుట్టాలి ?"

"                    "

"అలా నవ్వకురా విస్సీ ! అందుకే అంటాను నీకేంవిటని ఆశపెట్టి నీ వాళ్ళందర్నీ మురిపించ గలిగినంత డబ్బు పోగేసి బ్యాంకులో దాచుకున్నావు నీ కనుసన్నల్లో మెలుగుతూ అడుగులకు మడుగు లొత్తే కొడుకూ కోడలూను 'తాతయ్యా ! తాతయ్యా !' అంటూ          "

ఎంతచిత్రం !! నిన్న ! నిన్నంటే నిన్ననే ఈ చెరువు గట్టుమీద నా ఎదురుగా కూర్చొని లోతయిన కళ్ళు కమ్మిన కన్నీటి పొర మాటున మిలమిల లాడుతూ వుండగా ఈ మాటలు వత్తి వత్తి పలికిన శేషు— ఈ రోజున ఈ లోకానికి దూరంగా— అందుకోలేనంత దూరంగా వెళ్ళిపోయాడంటే నమ్మ లేకపోతున్నాను

ఇంకా వాడు నా యెదురుగా కూర్చున్నట్లే అనిపిస్తోంది ! వాడి మాటలు నా చెవుల్లో మారు మోగుతూనే వున్నాయ్

నిన్న వాడి మాటల్ని నేనంతగా పట్టించుకో లేదు ఏదో మామూలుగానే అంటున్నాడనుకున్నా

ఇపుడు తెలుస్తోంది వాడి మాటల్లోని అర్థం వాడు మరణాన్ని యింత యిదిగా కోరుకున్నాడా ?

కోరుకోక ఏంచేస్తాడు ?

కొందరి జీవితాలింతేనేమో ! పాపం శేషు !

మిత్రుడు శేషు జ్ఞాపకాలతో ఉద్రిక్తమైన కళ్ళతో అశ్రుతర్పణంచేసి కొంచెం తేరుకున్నాను

ఈనాటిదా ? మా అనుబంధం

అ—ఆ ల దగ్గర్నుండి వుద్యోగంలో రిటైరయ్యే దాకా, తర్వాత నిన్నటిదాకా ఒకే బోగీలో ప్రయాణం చేశాం వాడి స్టేషను వచ్చేసింది ! దిగిపోయాడు నన్నొదిలేసి గుడ్‌బై కూడా చెప్పకుండా !

వాడి మాటల బటానీలు నవులుతూ నేనింకా ప్రయాణం చేయాలి !

అందరూ 'శేషగిరిరావూ' అని పిలిస్తే నేను వాడ్ని 'శేషూ !' అనేవాడ్ని

బళ్ళో మాష్టారు కూడా "విశ్వేశ్వరరావూ" అని పిలిస్తే నన్ను "విస్సీ" అని పిలిచేవాడు మా శేషు

సరదాకయినా మేం ఎప్పుడూ మాటా మాటా అనుకోలేదు అరవయి సంవత్సరాలు దాటిపోయినా మా స్నేహం నవనవలాడుతూనే వుంది అంత అన్యోన్యంగా వుండేవాళ్లం

ఆరుగురాడపిల్లలూ ఒక్క మగపిల్లవాడూను మా శేషుకి నాలుగు డబ్బులు వెనకేసుకోలేక పోవడానికి కారణం వాడంతమంది పిల్లల్ని కనడంవే

ఆరుగురాడపిల్లల్నీ ముస్తాబు చేసి సాగనంపే సరికి వున్న కాస్తంత చిరాస్తీ కరగిపోయింది

ఎట్లాగయితేనేం కష్టపడి కొడుకుని ప్రయోజకుణ్ణి చేసి తండ్రిగా తన బాధ్యతల్ని తీర్చుకుని తాను వడ్డెక్కాడు

"ఈ జగన్నాటకంలో నా పాత్రను ఇప్పటి వరకూ నలుగురూ మెచ్చుకనేట్లు బాగానే పోషించా నని అనుకుంటున్నానురా ! ఇంక వోపిక లేదురా ! ముందు ముందు తృప్తిగా నటించలేనేమో ! ఆ సూత్రధారి నా పాత్రకు తొందరగా నిష్క్రమణ చెపితే బాగుండ్ను"

ఈ మధ్య తరచు యీ డైలాగులు చెపుతూండేవాడు విని నేను నవ్వేస్తుండే వాడ్ని

ఏంవిటో ! నన్నేకాదు ఎవర్నీ ఎప్పుడూ దేబిరించి పది రూపాయలు బదులడిగేవాడు కాదు మా శేషు బదులడిగితే తప్పని కాదు అదో పద్ధతి వాడిది

"అప్పు చేయడానికి ప్రయత్నించే దైన్యాన్ని నటించడం నాకు చేతకాదురా !" అనేవాడు

అంత గొప్ప జీవిత నటకుడైయుండీను అయినా నా దృష్టిలో వాడు కొంచెం ఖర్చు మనిషే ! అన్నివేళలా చిరునవ్వుతో నిండుకుండలా వుండేవాడు

అటువంటివాడు వున్నట్టుండి వోనాడు నా ముందు ఎంతో దీనంగా తనగోడు వెళ్లబోసు కున్నాడు

నాకు చాలా ఆశ్చర్యం వేసింది ఈ శేషుకీ ఆ శేషుకీ ఎంత తేడా వుందీ ! అని

చెప్పొద్దూ ! నాకు బాధలంటే ఏంవిటో అనుభవంలోకి రాకుండానే షష్టిపూర్తి చేసు కున్నాను చదవడంవో లేక చెబితే వినడంవో అంతేగాని నాకు బాధ అంటే ఎలా వుంటుందో అనుభవంలో తెలవదు— ఈమధ్య సతీవియోగ బాధ సంభవించే వరకూ

వుద్యోగంలోంచి రిటరయినదగ్గర్నుంచీ వాడి బాధలు మొదలయ్యాయిట కొడుకు దగ్గరే, పుట్టి పెరిగినచోటే వుంటున్నాడు

ప్రావిడెంటుఫండూ, గ్రాట్యుటీ, అవీ ఇవీ గలగల్లాడిన న్నాళ్ళోజులూ బాగానే గడిచింది ఆ తర్వాతే యింట్లో అందరి మొహాలూ వెలిసిపోవడం మొదలైందిట

"మొహాలే కాదురా మా యింట్లో అందరి మనస్సులూ వెలవెలపోయి బోసిగా తయారయ్యాయి నేనేమో ఎప్పుడూ మొహాల రంగులకే ప్రాధాన్యత నిచ్చే జీవిత నటుకుణ్నే వాళ్ళు మొహాలకే కాకుండా మనస్సులకి కూడా రంగుపూసుకోకుండా ప్రదర్శన లిచ్చేస్తున్నారు ఎవరో అయితే బాధపడను నా చేతులలో పెరిగిన నా కన్నకొడుకే నా మొహంరంగు కడిగేస్తానంటే ఎట్లా వుంటుంది ? చెప్పరా !

కూరలూ పచ్చడి విస్తట్లోకి విసరిపడేసి — అన్నం విస్తరంతా చిందేలా విసిరికొడ్తే మా కోడల్ని గొప్ప నటి అని ఎట్లా మెచ్చుకోగలను ? "ముసలాడు రాత్రంతా దగ్గుతూనే వున్నాడు ఈ పూట ఆయనగారు తింటే ఇంక ఈ రాత్రి నేను నిద్ర పోయినట్లే ! ఊఁ ! మీరు లేవండి !" అని మొగుడ్ని భోజనానికి పిలిచే మా కోడలి మాటలకి ఏడవాలా ? "ఆడపిల్లలు — ఆడపిల్లలు — అంటూ ఉన్నదంతా ఊడ్చిపెట్టాడు తీసికెళ్ళి, పట్టుమని పదిరోజు లుంచుకుందికి వాళ్ళకీ తీకానా లేదు అనుభవం వాళ్ళదీ — ఆయాసం వాడీను ఈ పీడ ఎప్పుడు విరగడవుతుందో ?" అన్న నా కొడుకుని చూసి నవ్వాలా ? చెప్పరా, నువ్వు !"

అప్పుడు వాడి మాటల్ని నవ్వుతూ కొట్టి పారేశాను "సర్దుకుపోవాలిరా ! నీకు నేను నటన గురించి చెప్పాలా ?" అని తేలిగ్గా అనేశాను

తవ్వుకున్న కొద్దీ మూతిలో జలలా ఈ దుఃఖం అధికం అవుతుందిగానీ తరగదు మరి — మా శేషు మరణం సహజమైనదేనా ?

జవాబు దొరక్క దిక్కులు చూస్తున్నాను 'కాదు ! కాదు !' అని అవి ప్రతిధ్వనిస్తున్నాయి

తెల్లపోయి ఆకాశంలోకి చూస్తున్నా నీలి మబ్బులు తేలియాడుతున్నాయ్

పక్షులు గూటికి బయలుదేరుతున్నాయ్

పడమర సూర్యబింబం ఎర్రగా — మా 'రమణి' నుదుటి కుంకుమ నా కళ్ళల్లో ప్రతిఫలించినట్టు — చెరువు నీళ్ళల్లో

రమణీ ! నన్నెంత అన్యాయం చేశావ్ నువ్వు ! నా షష్టిపూర్తి వుత్సవంనాడు ఏంవన్నావ్ ?

'కడదాకా మీ అడుగులో నా అడుగు వేస్తా' అన్నావ్ ఆ 'కడ' నాదనుకున్నాను కానీ నీ కడదాకా అని అర్థం చేసకోలేకపోయా

కాస్త ముందూ వెనకానూ ! నేనూ వస్తా ఎంత దూరం పోయినా నిన్ను కలుస్తా !

నీ పేరు పెట్టుకున్న మనవరాలే నాకు తోడు లేకపోతే ఇలా వంటరిగా దొర్లించగలనా రోజులు, కొడుకూ కోడలూ ఎంత ప్రేమతో చూసుకుంటే మాత్రం ?

ఇంటికి రావడం — స్నానం చేయడం — సంధ్య వార్చడం — భోజనం చేయడం — మేను వాల్చడం — మనవరాలితో ముచ్చట్లాడడం — అన్నీ అన్యమనస్కం గానే జరిగిపోయాయి యీ పూట

రోజూ మనవరాలు చెప్పే కబుర్లకి ఊఁ కొడుతూనే నన్ను నిద్ర కమ్మేసేది కమ్మగా

ఇవ్వాళ అస్సలు నిద్ర పట్టడం లేదు

"ఎవరి కెవరూ " ఏదో వైరాగ్య గీతం వినవస్తోంది రేడియోలో

అది మా కోడలు గొంతుక్కాదూ ?

ఆఁ ! అది — అదీ నారక్తం పంచుకుపుట్టిన వాడి గొంతేనా ?

"   మనం కూడా ఫ్రిజ్జూ, టి వీ కొనుక్కుందాంవండీ !"

"   ఈ ముసలాడు చచ్చేదాకా మన కా సరదాలు తీరవ్ డియ్యర్ !"

"ఈ లోగా మనం చావకుండా వుంటే మన సరదాలు తీరినంత ఫలం !"

"                    "

"                    "

"ఏమిటి ? ఈ రవణివి చదువూ సంధ్యా లేకుండా మొద్దులా తయారు చేస్తున్నావ్ అస్తమానూ 'తాతయ్యా ! తాతయ్య !' అంటూ వెధవతిరుగుడూ యిదీను దీన్ని బడులో పెట్టి చదివించకపోతే బొమ్మలా తయారవుతుంది అప్పుడు దీన్నెవడూ చేసుకోడు ఆఁ! తర్వాత నీ యిష్టం "

"వూరుకోండి ! మెలుకువగా వున్నాడేమో ! వింటాడు !"

"వింటే ఆ డబ్బు కాస్తా ఏ అనాధాశ్రమానికో ఇచ్చేస్తాడనా నీ భయం ! డియ్యర్ నిజ్జంగా నువ్ సినీమాల్లో చేరివుంటే తారాపధానికి "

అబ్బా !

బాధ అంటే ఇట్టా వుంటుందా ! రమణి నా శరీరాన్ని నిలువునా చీల్చుకుంటూ వెళ్లిపోయిన నాడు కూడా నాకింత బాధ అనిపించలేదు

ప్రాణంలా చూసుకునే కొడుకూ కోడలూ నాకేఁవిటి ? అని పొంగిపోయాను ఇన్నాళ్ళూ

అదంతా వట్టి భ్రాంతియేనా ? కన్నకొడుకు నిజస్వరూపం యిదా ? ఈ పచ్చి నిజాన్ని భరించ గలనా ?

వడగాలికి చిగురాకులా ఇలా విలవిల్లాడి పోతోం దేఁవిటి నా మనస్సు

వాడి మనస్సు లోతుల్లో వున్న కోరిక యిల్లాగ మాటలతో బయట పడింది — ఇంక చేతల్లోకి దిగుతుందా ?

ఛ! ఛ!

ఇది ఆ వయస్సు ప్రభావమా ? లేక మారు తున్న కాల ప్రభావమా ?

నే నిల్లాంటివి ఎరగనే !

తలిదండ్రుల సేవే మహద్భాగ్యం అనుకున్నాను. నా రమణి నన్ను అనుసరించింది

ఇట్లా కన్నకొడుకు మాటలు నా చెవుల్లో గింగుర్మంటూ వుంటే ప్రాణాలు నిలబడేనా ?

చెవులు చిల్లులు పడిపోతున్నాయ్ మనస్సును ములుకులు కెలుకుతున్నాయ్ నా నిట్టూర్పులే నాకు వడగాడ్పుల్లాగ వున్నాయ్

భ్రమల అవనికలు తప్పుకున్నాయి

పర్వత శిఖరంమీద కాదు అగాధంలో అంధ కారంలో వున్నాను

ఆశతో వెలుగురేకల కోసం నా కళ్ళు వెతుకు తున్నాయి బాహ్య స్మృతికి దూరంగా— పోతున్నాను

ఎక్కడో ఓ వెలుగు కిరణం పొడిచి నావైపే దూసుకువస్తోంది

ఎవరది ?

నా రమణి !

నాకు జీవంపోసే చిరునవ్వుల ఆమని

నన్నుచేరి మళ్ళీ నన్ను పరిపూర్ణుడ్నిచేస్తోంది

ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు ఆ రోజులు !

కాల చక్రం వెనక్కి తిరుగుతోంది !

పరిమళాల వరాలు పొంది వింగిమండి వేలకు జారే వెన్నెల తీవల జాలు !

తియ్యదనాలు సంపాదించుకొని పరుగిడబోయే మలయమారుతాలు ఎదురుగా— నా రమణి— నా పంచప్రాణాలు !

" మిమ్మల్నే ! మీవాడి చూపుల వేడిమికి తాళలేక పోతున్నాను కొంచెం రెప్పపాటు వేయండి స్వామీ !"

" మన్మధుని వింటినారి వంటి కురుల కొనలకు ముడివేసికొని నా ప్రాణాలు నీ గుప్పిటలో పెట్టుకున్నావు గదా ! మరి నాకు రెప్పపాటు ఏ విధంగా సాధ్యమవుతుంది దేవీ !"

"పోనీ ఆ అనిమిషత్వం మీకేనా ? నా కేమైనా ప్రసాదిస్తారా ! అర్ధాంగిని అభ్యర్థి స్తున్నాను "

"నేను ప్రసాదించేదేఁవిటి ? నన్ను బాహు వల్లరిలో బంధించుకొని నీ అరుణాధరాలతో అందు కోవచ్చును గదా !"

" ఆ గడియారం ఏఁవండీ ! అటు చూడండి ఆ సెకండ్ల ముల్లు ఎంత వేగంగా తిరిగి పోతోందో ! మనకు తెలియకుండానే మనం ముసలి వాళ్ళం అయిపోతున్నాఁవండీ !"

"అవునండీ ! ముసలివాళ్ళం అవుతున్నాఁవంటే— అమరులం కాబోతున్నామన్నమాట ! ఇక ఆ పైన అమృతం ! అజరత్వం ! ఇంకా "



## పాత చొక్కా

"ఊఁ! చాల్లెండి మరీ చిన్నతనం — చిలిపితనం పోలేదు మీకు అబ్బాయి వస్తున్నాడు"

కాలచక్రం ముందుకు తిరిగిపోతోంది

"అయ్యో! రమణీ! వెళ్ళిపోతున్నావా! నువ్వి మాట వినలేదు ఎల్లా చెప్పాలి? మన అబ్బాయి మనం కన్న కలల పంట కా దు మోస పోయాం!"

నా గొంతు పెగిలిరాలేదు జీరపోయింది పరుగునపోయి నా రమణి చేయి పట్టుకున్నా గట్టిగా

"తాతయ్యా! లే! నా చెయ్యి నొక్కేస్తున్నావే వదులు! చూడు ఎంత పొద్దెక్కిందో! ఎప్పుడేనా ఇల్లాగ పడుకున్నావా? ఈపాటికి స్నానం సంధ్యా అన్నీ అయి పేపరు కోసం చూసేవాడివి లే! చూడు! ఇవ్వేళ నా పుట్టినరోజు! పట్టుగౌను చూడు! కొత్తది! ఎంత బావుందో!"

బాహ్య స్మృతికి దగ్గరగా వస్తున్నాను కన్నులు విచ్చి మా మనవరాలు రమణిని చూశాను

నటనలేని నవ్వు!

మల్లెపువ్వులాంటి మచ్చలేని మనస్సు! "రమణీ! బీరువాలో "

"బిస్కట్లా తాతయ్యా? అప్పుడే ఎందుకు? నువ్వు స్నానం అదీ ముగించుకొని పాలు తాగాలి! అప్పుడు నేను తినాలి!"

"అదికాదు రమణీ! ముందు బీరువా తాళాలు తియ్యి! ఆఁ! చూడు ఆ అరలో అదే ఆ పుస్తకం పట్రా!"

"ఏం పుస్తకం తాతయ్యా యిది?"

"అదా బ్యాంకు పుస్తకమమ్మా! అది నా కాతా మీ నాన్న పేర మార్పించి అవన్నీ నీకెందుకుగానీ ఆ పుస్తకం మీ నాన్న కిచ్చిరా!"

"అల్లాగే! నువ్వు తొందరగా స్నానం చెయ్ నా కాకలేస్తోంది అస్సలే నా పుట్టినరోజు ఇవ్వాళ నేను కొత్త గౌను తొడుక్కున్నాగదా! నువ్వుకూడా కొత్త చొక్కా తొడుక్కోవాలి! ఊఁ!"

"ఓ! అలాగే! అన్నీ తొందరగా ముగించుకొని 'కొత్త చొక్కా' తొడుక్కుంటా"

"వాసాంసి జీర్ణాని "

ఘంటసాల గానం చేసిన గీతమాధురీ లహరి! నన్ను ముందుకు వెళ్ళనీలేదు

అవునూ! ఈ చొక్కా ఇంకా చివిగిపోలేదే! బాగుచేసుకుందుకు కూడా పనికిరాకుండా పోలేదే!

అప్పుడే ఎల్లా దీన్ని వదిలేయడం?

వాడా? వాడు శేషు — కొత్త చొక్కా మోజులోపడి — పాతది నచ్చలేదని — దాన్ని విసిరి కొట్టాడు వాడా చొరవగలవాడు

మరి నేనూ? నేను పొదుపరి తనానికి అలవాటు పడిన వాణ్ని వాడికున్న చొరవ — అతి చొరవ నాకు లేదు అంతగా ఈ చొక్కా నలుగుడు పడితే బాగుచేసుకుందుకు మనవరాలు రమణి లేదూ సాయం చేయడానికి? అప్పుడే ఈ "పాత చొక్కా" ఎట్లా మార్చగలను?

# పాఠకుని డైరీ



## అజ్ఞాన నివేదిక !

విద్యార్థుల విజ్ఞానానికి విద్యాలయాలు కారణాలా, కావా అనే ప్రశ్నకి అవుననీ చెప్పొచ్చు కాదనీ చెప్పొచ్చు కానీ విద్యాలయాల విజ్ఞానానికి కారకులెవరు ? అందులో విద్యాలయాల అధికార ఆలయం విశ్వవిద్యాలయమే తన అజ్ఞానాన్ని ప్రదర్శిస్తే ! నాగపూరు విశ్వవిద్యాలయం తన నివేదికలో 101 వ పేజీలో విదేశీ విద్యార్థుల పట్టీ యిస్తూ అందులో నాగాలాండ్‌ను విదేశంగా జమచేసిందట

## హస్తలాఘవం !

న్యూఢిల్లీలో రాజేష్, ముఖేష్ అనే వో యిద్దరు బుద్ధిమంతులు ధనార్జనకు వో కొత్త మార్గం కనిపెట్టారట ఈ మార్గం ఏమిటయ్యా అంటే, జనసమర్దం వున్నచోట రాజేష్ వో పెద్ద మనిషిని ఎన్నుకుని, ఆతని ముఖంమీద లాఘవంగా తప్పున వుమ్మి, అంతలో అయామ్ సారి, మాఫ్ కిజియె అని తన రుమాలుతో ఆయన ముఖం అతి సున్నితంగా తుడుస్తాడట ఈలోగా ముఖేష్ తన హస్తలాఘవం చూపుతూ ఆతని జేబులు ఖాళీచేసి, చక్కా పోతాట్ట వీరీ పనులు మార్చి మార్చిచేస్తూ, పాపం పండి, పట్టుబడ్డారట

## చచ్చి బతికి చచ్చిన మనిషి !

తమిళనాడు ఏర్కాడుకు చెందిన 54 ఏళ్ళ వెళ్ళాయిగవుండరు అనే ఆయన వోనాడు రివ్వున చనిపోయాడట అయిన వారంతా అనుకున్నంత సేపూ ఏడ్చి, ఆనకాయనకు పాడికట్టి తీసుకుపోతూండగా ''యావ్, నే చావలేద్రా'' అని అరిచాడట పాడి మోస్తున్నవారు భయపడి, పాడి దింపి పరుగెట్టారట ఆయన వారిని పిలిచి తాను చావలేదనీ, తన కట్లు విప్పమనీ అన్నాడట ఆనక అంతా కలిసి తిరిగి యింటికి వచ్చాక తాను కరెక్టుగా ఆనాటికి ఏడో రోజు చనిపోతానని చెప్పి, అదేవిధంగా ఏడోనాడు తన అయినవారితో తన భార్య సమాధి వద్దకు వెళ్ళి అక్కడ అందరికీ తాను చనిపోతున్నానని చెప్పి పడుకుని, ప్రాణాలొదిలేశాడట — వార్నీ !

## కోతి లైసెన్సుకి ఫొటో !

సింగపూర్‌లో కోతిని పెంచదలచినవారు అట్టి కోతిని రిజిస్టరు చేయించాలట దీనికి ఇరవై డాలర్లు ఖర్చట ప్రతి కోతికి దాని ఫొటోవున్న అయిడెంటిటీ కార్డు యిస్తారట లైసెన్సు బిళ్ళకూడా యిస్తారట అలా లైసెన్సు తీసుకోకుండా కోతిని పెంచడం దారుణమైన నేరమట

## గుర్రప్పందాల్లో ఘనుడు !

1976 లో మలేషియాలో లిమ్ చూయ్ సింగ్ అనే వో అదృష్టవంతుడు వో గుర్రప్పందంలో 11,12,400 మలేషియా డాలర్లు గెల్చుకున్నాడట ఆనాటినుంచీ యీనాటి వరకూ ఈ ఏడేళ్ళలో ఇంత మొత్తం ఒకే రేసులో గెల్చుకున్నవాడు ప్రపంచంలోనే లేడు లేడని గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ నమోదు చేసిందట

## వానల్లేని ఊళ్లు !

పశ్చిమ నైజీరియాకు చెందిన కాణో అనే వో గ్రామంలో వాన చూసినవారు బహు కొద్దిమందిట వాన అక్కడ ఏ రెండేసి ఏళ్ళకో వొకసారి వస్తే గొప్పట ఆ కారణంవల్ల యీ వూరివారు తమ యిళ్ళను సుద్దమట్టితోనే కట్టుకుంటారట అదే మాదిరి తూర్పు సహారాలోకూడా వాన అనగానేమి అని అడిగి ఆశ్చర్యపోతారట అంత వానలు లేకపోయినా అక్కడ నూతులు, నీరు మట్టుకు కొరత లేకుండా వున్నాయట — అలా చెప్పు

## సేఫ్ డిపాజిట్ లాకర్ల గల్లంతు !

స్పానిష్ సిటీ అండాలూషియాలో కొందరు దొంగలు వో అద్భుత పథకంవేసి, ఆ ప్రకారంగా మాట ఎనభై ఆరు సేఫ్ డిపాజిట్ బాక్సులు ఎత్తుకుపోయారట ఆ బాక్సులు నగరంలోని ధనవంతులవడంవల్లా, సీక్రెట్ డిపాజిట్ పద్ధతి అవడంవల్లా మొత్తం ఎంత సొమ్ము పోయిందో బ్యాంకువారికే తెలియదట ఎంత లేదన్నా నగా, నగదూ చేరి రెండు బిలియను పెజటాస్ (స్పానిష్ డబ్బు) అయినా వుండివుంటుందని బ్యాంకు అంచనా అట ఇది ఆ దేశంలో జరిగిన దోపిడీలన్నిటిలో పెద్ద దోపిడి అట

## లోకుల నెత్తిన చెయ్యి !

లండన్‌కు చెందిన మైకేల్ వింటన్ అనే వో మేధావి చాలామందికి ఋణపడి, ఆ ఋణ మొత్తం 12 మిలియను పౌనులవడంవల్ల కోర్టుకు యీడ్చబడ్డాడట కోర్టుకాయన అతి ఖరీదయిన రోల్స్ రాయస్ కారులో వచ్చారట అతి సుందరమైన భవనంలో, అధునాతన సౌకర్యాలు కలిగివున్నాడాయన నా ఆదాయం వారానికి 120 పౌనులు, ఈ కారు నా కుమారరత్నానిది నేనుంటున్న యిల్లూ, కాలుస్తున్న యీ పైపూ నా భార్యామణివే ! అని కోర్టుకు వినమ్రుడై నివేదించాడట చట్టంలో లూపులంటే యివేగామోసు 

మార్చి 31న విజయవాడకి 28 కి మీ ల దూరంలో ఉన్న మూలపాడు గ్రామంవద్ద ఇనుప దూలాలు తీసుకువెళ్తున్న లారీ తల్లక్రిందులై అందులో ప్రయాణం చేస్తున్న తొమ్మిది మంది మగవారు, ఆరుగురు ఆడవారు, ఎనిమిదిమంది పిల్లలు ప్రాణాలు కోల్పోయారు ఈ ఘోర ప్రమాద దృశ్యాన్ని ఫొటోలో చూడవచ్చు



# ఆటల పాటల బాలలకు ఆటూ పోటూ ఎదురయితే...

జీవితంలో చీకటి వెలుగులు ప్రతి ఒక్కరికీ మామూలే
అయితే చీకటిని తగ్గించటం ఎంతో మంచిది వారికి
దాని కోసంవారు ఆరోగ్యవంతంగా ఉండటం అవసరం
దాని కోసమే హార్లిక్స్
హార్లిక్స్ అంటే ప్రతినిత్యం ఆరోగ్యంగా ఉండటం అన్నమాట
అందువల్లనే కోట్లాది మంది 100కు పైగా సంవత్సరాల నుంచి హార్లిక్స్ సుగుణాలను విశ్వసిస్తున్నారు
ప్రపంచ వ్యాప్తంగా ఉన్న డాక్టర్లంతా ఆరోగ్య సంరక్షణకు హార్లిక్స్ ఆదర్శప్రాయమైనదని శిఫారసు చేశారు
అంటే ఆశ్చర్యం లేదు హార్లిక్స్‌లో ఉన్న విలువైన స్వచ్ఛమైన పోషం పదార్థాలను, వాటిమంచి గుణాలను కాపాడే విధంగా తేలికగా జీర్ణమయే విధంగా అద్భుతమైన పద్ధతిలో మిశ్రమం చేశారు
హార్లిక్స్ మీ కుటుంబ జీవితంలో భాగంగా ఉండేట్టు చూచుకోండి
మీ కుటుంబ సభ్యులందరికి కావలసిన శక్తినంతా సమకూరుస్తుంది




మంచి పుష్టికరమైనది

HTD HMM 7536

# ప్రేమ నేరమా..?



— అవధానుల సుధాకరరావు

ప్రేమ!

ఎంత శక్తి ఈ పదానికి?

ఎంత మహత్యం ఈ రెండక్షరాల్లో!

ఈ ప్రేమని ఎంతోమంది, ఎన్నో రకాలుగా నిర్వచించేరు

ప్రేమ పిచ్చిది— అని కొందరు తీర్మానించారు అది ఎంతవరకు వాస్తవమో నేను చెప్పలేను కాని, ఆ ప్రేమ కొందరి మతి చెదరగొట్టి, పిచ్చివాళ్ళను గూడా చేసేయగలదు— అనే ఉదంతానికి రూపకల్పన— ఈ కథ

* * *

జర్నలిస్టుల కాలనీ అది.

యింటిముందు ముచ్చటైన పూలతోటతో ఆ యిల్లు విశిష్టంగా— విభిన్నంగా వుంది

ఆ యింటి కాంపౌండ్ గేటులోంచి వేగంగా లోపలికి దూసుకొచ్చింది ఒక స్కూటర్

స్కూటర్ దిగి స్టాండ్ వేసాడు మూర్తి తలుపువద్దకు నడిచి, కాలింగ్ బెల్ నొక్కేడు

మరుక్షణం తెరుచుకున్న తలుపుల మధ్య సౌందర్యం విరబూసి, స్త్రీ రూపం దాల్చి దర్శనమిచ్చింది రేఖ

"హాయ్ రేఖా! ఎంత అందంగా వున్నావ్?" పరవశం చెందాడు మూర్తి

"నిజంగానా?"

"నువ్వు అలా దూరంగా వుంటే జవాబు చెప్పలేను" కొంటెతనం

"ఈ 'జవాబులు' నాకేనా— కరుణకి కూడా చెప్పేరా?" ఆటపట్టిస్తూ అడిగిందామె

ఒకడుగు వెనక్కి వేసాడు మూర్తి అప్రయత్నంగా రేఖ ముఖంలోకి పరీక్షగా చూసాడు కళ్ల లోతుల్లోకి ఏదో వెదుకుతూ చూపులు నిలిపాడు

"ఆ ఉత్తరం ఏది? ఇటివ్వు!"

"అమ్మో! ఎంతాశ! అంత తేలిగ్గా ఇస్తానేమిటి" కవ్వించింది

"లంచం ఏమిటి?"

"కరుణ కథ చెబితే చాలు" మరొకప్పుడైతే పెదవులు అతనివశం చేసేది; అతని కౌగిలింత బహుమతి కోరేది కాని, ఇప్పుడామె కుతూహలం అణచుకోలేకుండా వున్నది వారిద్దరూ ఏడాది క్రితం పెళ్ళయిన కొత్త దంపతులు వారు సహజీవనం మొదలెట్టి చాలా కొద్ది రోజులే అయినా— ఒకరిమీద ఒకరికి ఎంతో నమ్మకం పూర్తి అవగాహన ఈ రోజు వరకూ భర్త జీవితంలో కరుణ అనే ఒక అమ్మాయి వుందని రేఖకి తెలీదు మూర్తి ఎప్పుడూ ఆమెతో చెప్పలేదు ఆ కారణంగా రేఖకి భర్తమీద ఎలాంటి అనుమానం కలుగలేదు

రేఖ పుస్తకంలో దాచిన ఉత్తరం బయటకు తీసింది తనొచ్చే లోపల దాన్ని సాంతం చదవమని చెప్పి, బాత్‌రూంలో దూరాడు మూర్తి

అతను బయటకు రావడానికి ఓ పావుగంట పట్టింది ఈ వ్యవధిలోపల— కరుణ అనబడే స్త్రీ రాసిన ఆ రెండు పేజీల సుదీర్ఘమైన లేఖని రెండు మార్లు చదివింది— రేఖ కాని, అందులో చెప్పుకోదగ్గ సంగతులు, సమాచారాలు ఏవీ వున్నట్లుగా కన్పించలేదు రేఖకి

కేవలం పొగడ్తలు అవి సామాన్యమయినవి కావు

మూర్తి మంచి మనస్సుని స్తుతిస్తూ, అతని వ్యక్తిత్వాన్ని ఆకాశానికెత్తుతూ— అతడిని దైవ సమానుడిగా పోల్చింది కరుణ

"ఏమిటి సార్— ఈ ఉత్తరం ? నాకేం అర్థంకాలేదు " అయోమయంగా అంది

మూర్తి మందహాసం చేసాడు

"అర్థం కావాలంటే— ముందు జరిగిన కథ తెలుసుకోవాలి "

"చెప్పండి " అంది రేఖ రకీమని — నాదేం ఆలస్యం లేదన్నట్లుగా

"కడుపులో కాస్త పుడ్డు పడాలి ఎలకలు మరీ రన్నింగ్ రేసు చేస్తున్నాయి, శ్రీమతీ "

తన తొందరపాటుకి రేఖ సిగ్గుపడింది

"సారీ ! పదండి వడ్డిస్తాను " అంటూ, డైనింగు రూంకేసి నడిచింది

ఓ ముప్పైనిమిషాల సమయం దొర్లిపోయింది

సీన్ బెడ్‌రూంకి మారింది

మూర్తి సిగరెట్టు వెలిగించాడు

అతని ఆలోచనలు గతంలోకి, రెండేళ్ళ వెనక్కి పరుగెత్తాయి

అప్పుడు తనింకా బ్రహ్మచారి

ఈ రోజున ఓ గవర్నమెంటు హాస్పిటల్‌లో నర్సుగా ఉంటూ, రోగుల సేవ చేసుకుంటూ, తన కాళ్ళమీద తను నిలబడి, తన బిడ్డని పోషించుకోగలిగే స్థితిలో వున్న కరుణ —

రెండేళ్ళ క్రితం ?

మూర్తి మనసు బరువెక్కింది

* * *

పత్రికా ప్రపంచంలో ఓ నూతన చరిత్రని, జర్నలిజం ఫీల్డ్‌లో సంచలనాన్ని సృష్టించి, అన్ని రంగాల ప్రజల్లోను దుమారం లేపిన వ్యక్తి — అరుణ్ శౌరి ఆయన సాహసం, దాగివున్న నిజాల్ని వెలికి తీసి, వెలుగులోకి తీసుకొచ్చిన ఆయన నిర్భయత్వం — నన్ను ముగ్దుణ్ణి చేసాయి అప్పుడే ఆ వృత్తిపట్ల నాకు గౌరవంతోపాటు, నేను కూడా ఆ రంగంలోకి ప్రవేశించాలనే అభిలాష మొలకెత్తింది పెద్దవాళ్ళంతా అభ్యంతరాలు చెప్పినా నేను వినిపించుకోలేదు జర్నలిజంలో డిప్లొమా సంపాదించి— నా అభీష్టం నెరవేర్చుకున్నాను

ఆ తరువాత నాకు ఓ దినపత్రికలో రిపోర్టర్ వుద్యోగం దొరికింది నేను కోరుకున్న వృత్తి నా ప్రవృత్తికి అనుగుణమైన పని నా విధులు నిర్వహించడంలో ఎంతో చురుగ్గా వుండేవాణ్ని

సమాజంలో చొచ్చుకుపోయి, ప్రజల మధ్య సన్నిహితంగా తిరుగుతూ, వారి సమస్యలు, సాధక బాధకాలు క్షుణ్ణంగా పరిశీలించేవాడిని వాటిని పేపరులోకి తీసుకొచ్చి, తద్వారా ప్రజానాయకులు, అధికారులు వాటి గురించి ఆలోచించి, వాటి పరిష్కారానికి పూనుకోవడం ఇలా జరుగుతూ వుండేది

ఆ రోజు

ఓ మినిష్టర్‌గారి సన్మానసభకి వెళ్ళి, వార్తలు సేకరించుకుని వస్తున్నాను అప్పుడు, జన సమ్మర్దం బాగా వుండే ఓ సెంటర్‌లో, రోడ్డు పక్కగా గుమికూడి వున్న ప్రజాసమూహం నన్ను ఆకర్షించింది నా స్కూటర్‌ని ఓ పక్కగా పార్కుచేసి, దిగేను

ఏదైనా న్యూస్ దొరక్కపోతుందా — అనే వృత్తి పరమైన ఆసక్తితో, గుంపు లోపలికి చొచ్చుకుపోయాను అప్పుడు ఓ ముసలతను —

"ఏం బాబూ! నువ్వూ చూస్తావా? ఉచితంగా 'బ్లూ ఫిలిమ్ ' ఊఁ వెళ్ళు త్వరగా !" ఎగతాళిగా అన్నాడు

ఆ మాటల కర్థం — కంటితో నేనా దృశ్యాన్ని స్వయంగా చూసేకగాని బోధపళ్ళేదు అక్కడ పోగయిన జనం — వందకి తక్కువుండరు అంతా మగాళ్ళే! అప్పుడు సమయం ఉదయం పదిగంటలవుతోంది అంటే — ఆఫీసులవాళ్ళు, కాలేజీలవాళ్ళు చాలా హడావుడి సమయం అది అయినా — ఆ విషయం పట్టించుకోకుండా, అంతమంది జనం వలయాకారంలో మంత్ర ముగ్దుల్లా చూస్తున్న ఆ దృశ్యం —

ఓ ఆడది ! ఆమె పిచ్చిది

అయితేనేం — ఆమె యవ్వనంలో వుంది పాతికేళ్ళ వయసు జుట్టు విరబోసుకుని కూర్చుంది తనలో తనే మాట్లాడుకుంటోంది నవ్వుతోంది ఏడుస్తోంది పళ్ళు కొరుకుతోంది ఎవర్నో తిట్టుకుంటోంది, ఆమెకి కాస్త దూరంలో ఓ రెండేళ్ళ పాప ఆ పిచ్చిదాని కూతురు కాబోలు ఆ మట్టిలో ఆడుకుంటోంది

ఆమె అలా దయనీయ స్థితిలో వుంటే, కరుణతో గుండెలు కరగవలసిందిపోయి —

పేలికలు, పేలికలుగా వ్రేలాడుతున్న ఆమె దుస్తులు బహిర్గతం చేసే నగ్నత్వపు అందాలని చూట్టానికి కక్కుర్తిపడుతున్న మగజాతి కనువిందు చేసుకున్న వాళ్ళు అయిష్టంగా కదులుతున్నారు వారి స్థానాన్ని భర్తీ చేస్తున్నారు కొత్తగా వస్తున్న వాళ్ళు

ఏ ఒక్కరూ ఆ అభాగిని గురించి అరక్షణం కూడా సానుభూతిగా ఆలోచించడం లేదు ఉద్రేకంతో వారి వయసులు చలిస్తున్నాయేకాని — ఉదారంతో, ఔదార్యంతో వారిమనసులు స్పందించటం లేదు

అక్కడ నేను జర్నలిస్టుగా నా కర్తవ్యం నిర్వర్తించేను

ఆ స్త్రీని, పాపని కలిపి, విడివిడిగాను కొన్ని ఫొటోలు తీసుకున్నాను

ఆ తరువాత రెండురోజులకి మా పత్రిక ఫ్రంట్ పేజీలో ఆ ఫొటోలు, ఓ చిన్న వ్యాసం అది కూడా నేనే రాసాను ఎంతో ఆవేదన పడుతూ, రాత్రంతా శ్రమించి ఆ వ్యాసం తయారుచేసాను ఒక్కమాటలో చెప్పాలంటే — ఈ సమాజాన్ని నిలదీసి, సూటిగా ప్రశ్నించేను ఆ అనాథకి ఏదో ఒక ఆధారం దొరుకుతుందని నాకు నమ్మకం కలిగింది

కాని, నా ప్రయత్నం ఫలించలేదు నేను అనుకున్న రీతిగా ముందుకొచ్చిన వారెవ్వరూ లేరు

నాలో ఏదో పట్టుదల తలెత్తింది

ఆ రోజు — పత్రికా రచయితగా ఆమె జీవితాన్ని పదిమందికి తెలిసేలా చేసి, ఆమెకి తోడ్పడదామనుకున్నాను ఫెయిలయ్యాను

ఈ రోజు — నాలో దాగివున్న మానవత్వం నిండిన మనిషి వెలుపలికి వచ్చి, అందుకు పూనుకున్నాడు

నా ఆలోచనకి ట్రాఫిక్ ఎస్సై వింతగా చూసాడు

ఈ నా నిర్ణయం వెనక మరే ఆలోచనాలేదు —












నాకు నలుగురిలో గుర్తింపు రావాలని, పేరు, ప్రతిష్టలు సంపాదించి, కీర్తి కిరీటం శిరసున దాల్చాలని! జస్ట్ ఏ సాఫ్ట్ కార్నర్ ఇన్ మై హార్ట్– ఈ బాధ్యతని నా తలకెత్తుకునేలా చేసింది

ఆమె 'ఎర్రగడ్డ' హాస్పిటల్‌లో చేర్పించడానికి– నా పలుకుబడి కొంత ఉపయోగించవలసి వచ్చింది ఆమె పాపని 'ఛైల్డ్ కేర్ సెంటర్'కి అప్పగించేను

నెల రోజులపాటు ఆమెని వివిధ పరీక్షలు చేసారు డాక్టర్లు వారు చెప్పిన వార్త నన్నెంతగానో సంతోషపరచింది ఆమె మామూలు మనిషి కావడానికి అవకాశాలు ఉన్నాయి

ఏ పరిస్థితులు ఆమె మతిని చెదరగొట్టాయో కాని – ఆమె ఓ గౌరవనీయ కుటుంబానికి చెందిన, అయినింటి ఆడపిల్లని స్పష్టంగా తెలుస్తోంది బాగా చదువుకున్నదానిలా వుంది

ఆమె ఎవరు? ఆమె కథ ఏమిటి? ఏ పరిస్థితుల కారణంగా ఆమె ఇంత హీన, దీన స్థితికి వచ్చింది? అసలామె ఏ ప్రాంతపు మనిషి – ??

చాలా కాలం వేచివుండవలసి వచ్చింది ఈ వివరాల కోసం ఆ తరువాత కూడా – అన్ని వివరాలు తెలియలేదు కేవలం రెండే –

ఆమె పేరు, ఊరు

కరుణ పాలమూర్

తక్షణమే అక్కడికి ప్రయాణం కట్టాను పూర్తి వివరాలు అక్కడ దొరుకుతాయనిపించింది

నిజమే నా ప్రయత్నం అక్కడ సక్సెస్ అయింది

* * *

ఓ క్రిస్టియన్ కుటుంబానికి చెందిన అమ్మాయి – కరుణ ఆమెకి తల్లిదండ్రులు లేరు చిన్నతనంనుండి అన్న జార్జి పెంపకంలోనే పెరిగింది అతనికి చెల్లెలిపట్ల అమిత ప్రేమ ఏ లోటు రాకుండా చూసుకుంటాడు

కరుణ బి ఏ ఫస్టియర్ చదువుతోంది ఆమె శరీరవర్ణం నలుపే అయినా, ఏ ఆకర్షణవల్లో గొప్ప అందంగా కన్పిస్తుంది ఆమె కన్నులు ఎంతో ప్రశాంతంగా, నిర్మలంగా వుంటాయి ఆ చూపులు ఎప్పటికీ చల్లగా, వెన్నెల కిరణాల్లా వుంటాయి

## ప్రేమే నేరమా ?

ముక్కు పుడక ఆమెకి మరో అదనపు ఆకర్షణ

కరుణకి కాలేజి, యిల్లు తప్పితే మరో ధ్యాస వుండదు సినిమాలు, షికార్లు ఏమాత్రం యిష్టపడదు ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడదు ఆదివారాలు యింటి సభ్యులతో కలిసి చర్చికి మాత్రం వెళ్తుంది

వయసు చాలా చిత్రమయినది ప్రేమ అనూహ్యమైనది

మనసుకి కట్టుదిట్టాల్లేవు అది ఈ మార్గం లోనే పయనించాలి, ఈ రకంగానే ఆలోచించాలి అని సిద్ధాంతాలు, సూత్రాలు ఏమీలేవు

రజాక్ కరుణ జీవితంలోకి ప్రవేశించడం – నిజంగా విచిత్రమైన సంఘటన ఆ అమ్మాయి కాలేజీకి వెళ్ళే దారిలోనే వుంది అతని యిల్లు

రజాక్ యిరవై మూడేళ్ళ నవయువకుడు పచ్చని శరీరం నూనూగు మీసాలు సన్నగా, నాజూగ్గా – ఆడపిల్లలా సుకుమారంగా వుంటాడు మగవాళ్ళే అతన్ని చూసి, అలా నిలిచిపోతారు ఇక అమ్మాయిల సంగతి చెప్పేదేముంటుంది?

తమ యింటి ముందునుంచి ప్రతిరోజూ కాలేజీకి నడిచివెళ్తున్న కరుణని చూసాడు రజాక్ ప్రతిరోజూ వచ్చేటప్పుడు, పోయేటప్పుడు ఆమెని చూసేందుకు సమయం కేటాయించేవాడు

ఆ యువకుడిని బలంగా ఆకర్షించింది కరుణ అది ప్రేమగా మారింది.

అతను కాస్త ముందడుగు వేసాడు ఓ రోజు ఆమెతో మాట్లాడేందుకు ప్రయత్నించేడు కాని, ఆమె బెదిరిపోయింది భయపడింది అతనికా అవకాశం చిక్కలేదు

రజాక్ మర్నాడు ధైర్యంగా కరుణ వాళ్ళింటికి వెళ్ళాడు అప్పుడు యింట్లో జార్జి వున్నాడు అతనితో తన మనసులో మాట విప్పి చెప్పాడు రజాక్ నిర్భయంగా, నిజాయితీగా తన ప్రేమని వెల్లడిచేసాడు

జార్జి తన చెల్లెలిని బయటకు పిలిచి అడిగేడు

ఆకుచాటు మొగ్గలా పెరిగిన కరుణకి అసలు ఓ స్వంత అభిప్రాయం అంటూ వుంటుందా? అలాగే చెప్పిందామె జవాబు

జార్జి ఎంతో నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నాడు

"మా చెల్లెలు నిన్ను యిష్టపడి వుంటే – అప్పుడేం చేసేవాణ్ణో కానీ, మిష్టర్! ప్రస్తుతం అలా జరగనందుకు సంతోషంగా వుంది సో, ప్లీజ్ గెటవుట్ నా!"

"ప్లీజ్ సార్! నన్నర్థం చేసుకోండి కరుణని నేను చాలా యిష్టపడుతున్నాను సార్! దయచేసి మీరు మా పెళ్ళికి అనుమతించాలి" చాలా దీనంగా ప్రాధేయపడ్డాడు రజాక్

"మై డియర్ జంటిల్‌మాన్! ఇందాక యింగ్లీషులో చెప్పాను ఇప్పుడు తెలుగులో చెప్తున్నాను మర్యాదగా యిక్కడ్నుంచి కదులు" మరోమాటకి తావివ్వకుండా అన్నాడు జార్జి

కులాభిమానం – అతన్నంత పట్టుదలగా వుంచింది మూర్ఖుణ్ణి చేసింది తమ వారిలో ఈపాటి మగాడే దొరకడా దానికి – అనుకున్నాడు

అతనికి చెల్లెలిమీద ప్రేమ కంటే – 'క్రిస్టియానిటీ' మీద ఎక్కువ ప్రేమ ఏసుప్రభువు అతని ఆరాధ్యదైవం బైబిల్ పఠనం అతని దినచర్య

ఆ రోజు నుంచి అతను చెల్లెలిమీద ఓ కన్ను వేసి వుంచాడు

నిజాయితీ వున్న ప్రేమికుడు అవాంతరాలెదురైనా వెనుకంజ వేయడు అది రజాక్ విషయంలో ఋజువయింది

అతని మనసులోంచి తొలగిపోలేదు కరుణ ఆమె పట్ల మునుపటి ప్రేమ అలాగే వుంది ఆమె మనసులో స్థానం సంపాదించుకుంటే– ఎన్ని అడ్డంకులైనా ఎదుర్కోవచ్చును

ఆమె పట్ల అతని ఆరాధన పెరిగింది ప్రతి రోజూ ఆమెకి మూగ చూపులతో విన్నపాలు చేసుకునేవాడు

కరుణ ఎప్పటికైనా తనని కరుణిస్తుందని అతని నమ్మకం

తన ప్రణయదేవత మనసు కరగి, తనకి చేయి నందిస్తుందని ఆశ

కొన్ని రోజులు గడిచేక అలాగే జరిగింది ఆ యువకుని నమ్మకం, ఆశ ఫలించేయి కరుణ కరిగింది అతని స్వచ్ఛమయిన ప్రేమకి దూరంగా వుండలేక పోయింది

ప్రేమ – ప్రేమని గెల్చుకోగలిగింది

ఆ యువతి, యువకుల మధ్య పటిష్టమయిన బంధం ఏర్పడింది

ఒకరు సన్నిధిలో ఒకరు ప్రేమే పెన్నిధిగా

ఒకరి కోసం ఒకరు అనురాగమే ఊపిరిగా

కుల, మతాల అడ్డుగోడలకి అతీతంగా విహరించేరు ఆ సందర్భంలోనే ఒకసారి ఆ ప్రేమికుల దేహాలు కలిసాయి మానసికంగా కాక– శారీరకంగా కూడా ఏకమయ్యారు

అప్పటిగ్గాని వారి ఈ ప్రేమ వ్యవహారం జార్జి దృష్టికి రాలేదు పరిస్థితి ఎంత దూరం వచ్చిందో తెలిసి – ప్రళయరుద్రుడే అయ్యేడు తనకి తెలియకుండా ఇంత విపరీతం జరిగినందుకు నానా భీభత్సం చేసాడు

ఆ స్థితిలో కూడా – చెల్లెలి పట్ల అతనికున్న ప్రేమ, తప్పు ఆమెదేమీ లేదు అనుకునేలా చేసింది ఆ అన్న దృష్టిలో కరుణ ఇంకా పసిపిల్లే, అమాయకురాలు

రజాక్ ఓ మాయగాడు ఏదో పన్నాగం పన్ని, తన చెల్లెలిని బుట్టలో వేసుకున్నాడు తను ఒప్పుకోలేదని, ఏదో నాటకాలాడి చెల్లెలిని లొంగదీసుకున్నాడు దాని అమాయకత్వం ఆసరాగా తీసుకొని ఆమెని అనుభవించేడు

ఆ క్షణంలో పగతో రాక్షసుడిగా మారేడు జార్జి, పట్టుదల – అతని ఆలోచనని మ్రింగి వేసింది

ఫలితం – ఓ నిండు ప్రాణం

రజాక్ లేడు

ఈ లోకం నుంచి తొలగించబడ్డాడు

*　　*　　*

ఒకే సమయానికి కరుణకి రెండు వార్తలందాయి

ఆమెకి గర్భం రావటం ఒకటి

అందుకు కారణ భూతుడైన రజాక్ చంపబడటం మరోటి

తన సోదరుడే ఆ పని చేసాడని తెలిసాక– నిజంగా ఆమె మెదడు మొద్దుబారింది

ప్రేమ !

ఈ రెండక్షరాల పదం– ఎన్నెన్నో, భావాలకి ఉద్వేగాలకి కేంద్రస్థానం

మనిషిని దేవుణ్ణి చేస్తుంది– రాక్షసుడిగా దిగజారుస్తుంది

మంచితనం పెంచుతుంది– పగని రగులుకొల్పుతుంది

తనమీది ప్రేమతో ఒక వ్యక్తి (అన్న) రాక్షసుడిగా మారితే–

మరో మనసున్నమనిషి ప్రాణాలుగోల్పోయాడు

హత్యా నేరానికిగాను జార్జి జైలుపాలయ్యాడు దాంతో అతని భార్య, పిల్లలు అనాథలయ్యారు కరుణ బ్రతుకు ఒక ప్రశ్నార్థకంగా మారింది ఆమె మనస్సు చెదిరిపోయింది ఈ లోకంలో కరుణ ఒంటరిది ఆమెకి ఎవరూలేరు

ఒక ఆడపిల్ల ఈపరిస్థితిలో చిక్కుకున్నందుకు సంతోషం వెలిబుచ్చాయి కొన్ని మగ పశువులు వీళ్ళు మగాళ్ళ! సానుభూతి నెపంమీద దగ్గరచేరి,సహాయం అనే పేరుతో 'అవకాశం' కొరకు ఆరాటపడే, (కక్కుర్తి) ఆకలిగొన్న తోడేళ్ళ

మొదట్నుంచి లోకం అంటే ఏమిటో తెలియకుండా పెరిగింది కరుణ

ఇప్పుడామె ఏకాకి అయింది అలా ఆమెను ఒంటరిగా వదిలేయలేక, అయిష్టంగానే తనతోపాటు పుట్టింటికి తీసుకెళ్లింది ఆమె వదిన అక్కడామెని ఓ మనిషిగా ఎవరూ చూడలేదు ఆమె ఉనికే ఎవరికీ గుర్తులేకుండా పోయింది

అక్కడే ఓ ఆడపిల్లని ప్రసవించింది కరుణ అది ఆమె ప్రేమ చిహ్నం ఆ చిన్నారి పాప ఎంతో అపురూపంగా తోచింది

ఇన్నాళ్ళూ ఆమె ఒంటరిది ఇప్పుడామెకి తోడు ఇంకో ప్రాణి

తామిద్దరూ మరొకరి బరువు కావటం ఆమెకి సబబుగా తోచలేదు తనకి ఏదైనా ఉద్యోగం ఇప్పించి, సహాయం చేయమని వదినగారి తండ్రి– జాన్సన్‌ని కోరింది ఆయన అలాగేనన్నాడు

జాన్సన్ ప్రయత్నాల ఫలితంగా కరుణకి ఓ ఇంటర్వ్యూకాల్ వచ్చింది హైదరాబాద్‌లో జరిగే ఆ యింటర్వ్యూకి ఆమెని వెంటబెట్టి తీసుకు వెళ్ళాడు జాన్సన్

అక్కడ పరిచయస్తుల యింట్లో వారు బస చేసారు మరునాడు కరుణ ఇంటర్వ్యూకి హాజరయింది ఫలితాలు తరువాత పోస్టుద్వారా తెలుపుతామన్నారు

తెల్లవారి తమ ఊరికి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నారు

కరుణ నిద్రపోయి లేచింది ఆమెకి జాన్సన్ కనిపించలేదు ఆ యింటివారిని అడగ్గా–

"ఏదో పనుందని, ఎవరినో కలవడానికి వెళ్ళాడు మధ్యాహ్నం వస్తాడు " అని జవాబు చెప్పారు

కాని, అది నిజంకాదు ఆ రోజంతా చూసినా జాన్సన్ జాడలేదు

కరుణ మళ్లీ అడిగింది

"అతనిక రాడు !" అన్నారు

"అయితే నన్ను వెళ్లమంటారా–?"

"వీల్లేదు నువ్విక మా మనిషివి " వారి అసలురంగు అప్పుడు వెల్లడయింది కరుణని ఓ గదిలో నిర్బంధించారు ఓ మనిషిని కాపలా పెట్టారు తప్పించుకోడానికి వీలులేకుండా కట్టుదిట్టం చేసారు

దాంతో ఆమె గ్రహించింది– తను ఓ పంజరంలో చిక్కుకున్నానని భారతమంతా ఆ ప్రభువుమీద వేసింది

ఆమెని కాపాట్టం కోసం ఏ ప్రభువూ దిగి రాలేదు కాని – ఓ మగ మృగం – ఇరవై ఏళ్ళు దాటని ఆమె యవ్వనం దోచుకోడానికి వచ్చింది ఆ 'మృగం' సామాన్యమైనది కాదు పెద్ద లెవెల్లో పలుకుబడి, యింటినిండా బ్లాక్ మనీ వొంటి నిండా మదం

రక్షణ కోసం కరుణ – ప్రాధేయపడింది పెనుగులాడింది

తన బ్రతుకు పాడుచేయవద్దని – కాళ్ళుపట్టుకుంది, కన్నీళ్ళు పెట్టుకుంది

కాని, లాభం లేకపోయింది

అతని బలం – ఆ అబలని ఓడించింది

అతనిలో పురుషుడు – ఆమె స్త్రీత్వాన్ని చేజిక్కించుకున్నాడు

బలవంతంగా ఆమె నుండి సుఖాన్ని దోచుకుని అతను వెళ్ళిపోయాడు

ఆమె దుఃఖపడింది తన దేవుడికి కానుక చేసిన ఈ శరీరం – ఓ వీధి కుక్కచేత చిక్కి,






'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.



## ప్రేమే నేరమా ?

అపవిత్రమయినందుకు ఆ దుఃఖం ఆమెకి ఆ ఒక్కసారి, ఒక్కరోజే కాదు !

ఎంతోమంది పురుషులు వారందరికి కామ దాహాలు

ఎన్నో కబంధ హస్తాలు లెక్కలేనన్ని రాత్రులు

కరుణని దిగజార్చేయి పతితల జాబితాలోకి చేర్చాయి

కరుణ ఒక జీవచ్ఛవం ఆమె గుండె బండబారిపోయింది

కరుణ ఒక శిల ఆమెలో ఏ అనుభూతులు లేవు

ఓ రోజు పోలీస్ రైడింగ్ జరిగి అందరితోపాటు కరుణకూడా పట్టుబడింది మనిషికి రెండువందల చొప్పున జరిమానా విధించారు

ఆకర్షణ కోల్పోయి, శవంలా తయారైన కరుణ — వారికిప్పుడు అనవసరం ఆమెమీద వారి కంతగా రాబడి లేదిప్పుడు అందుకే, ఆమెని వొదిలించుకోవాలనే ఆలోచనలో వున్నారు, ఈ అవకాశం వారికి ఉపయోగపడింది కాల్‌గరల్స్ అంతా విడుదలయ్యారు — కరుణ తప్ప డబ్బు కట్టలేదు కాబట్టి, కరుణకి మూడు నెలల జైలు శిక్ష వేసారు

ఆఖరుసారిగా, ఆ రాత్రి ఆమె శరీరం — ఖాకీ దుస్తుల ఇనుప హస్తాల్లోనలిగిపోయింది కామంతో కాలిపోతున్న ఎర్రటోపీలు — వంతులవారీగా ఆమె వొంటిమీదపడి, వీర ప్రతాపం చూపించేయి

పోలీస్ స్టేషన్ ! అంటే — అన్యాయానికి గురైనవాళ్ళు రక్షణకోసం ముందుగా పరుగెత్తుకొచ్చే ప్రదేశం దొంగలకి, దగాకోరులకి ఆ చోటు సింహ స్వప్నం కావాలి

కాని, అలా ఎక్కడ జరుగుతోంది ? అంతా విరుద్ధం పోలీస్ స్టేషన్ కంటే నడివీధిలో ఎక్కువ భద్రత — అని ప్రజలనుకుంటున్నారు

మూడు నెలల అనంతరం —

జైలు రాతి గోడల మధ్య నుండి — ఈ విశాల (కుళ్ళ) ప్రపంచంలోకి అడుగుపెట్టింది కరుణ

ఆమె ఈ మధ్యకాలంలో — ఏ సంఘర్షణ అనుభవించిందో, ఆమె అంతరంగాన్ని ఏ విషాదం కదలించిందో, ఆమె మెదడుని ఏ వేదన శూన్యం చేసిందో, "కరుణ పిచ్చిది " అనే ఒక ముద్ర వేసారు ప్రజలు పిల్లలు సరదాగా రాళ్ళురువ్వారు

**అంకితం**

ఫ్రెండ్ !

ఈ కథ రాసింది నేనైనా — వెనుక వుంది నీవే నీ ఆలోచన — నా కలాన్ని కదిలించింది కాబట్టి ఇది నీకే —

— సుధ



కొందరు పెద్దమనుషులు చిల్లరపైసలు విసిరేరు

ఆమె విడుదలైన విషయం తెలుసుకుని, జాన్సన్ వచ్చి ఆ పిచ్చిదానికి తోడుగా, ఆమె బిడ్డని వదిలి — చేతులు దులుపుకున్నాడు

* * *

కరుణ కథ చెప్పడం ముగించేడు మూర్తి

రేఖ ఎంతో శ్రద్ధగా విన్నది

"రేఖా ! ఆ స్థితిలో కరుణని నేను చూడటం జరిగింది అదృష్టవశాత్తు, నా ప్రయత్నం ఫలించి — కరుణ తిరిగి మామూలు మనిషయింది తన పాపమీదనే అన్ని ఆశలు పెట్టుకొని, బ్రతుకు వెళ్ళదీస్తోంది " అంటూ వివరించేడు

తన భర్త ఔన్నత్యం తెలుసుకుని గర్వప'డి రేఖ మగవాళ్ళలో ఇంత మంచి మనసు ఎందరి కుంటుంది ?

చిన్న వయసులోనే ఎన్నో కష్ట, నష్టాలు పడిన కరుణ పట్ల ఆమెకి సానుభూతి ఏర్పడింది

నిజానికి ఎంతో అన్యాయానికి గురైంది కరుణ

మూర్తి మాటల్లో అదే భావం వెల్లడయింది

"రేఖా ! కరుణ చేసిన తప్పేమిటి ? ఇంత కఠినశిక్ష ఆమెకి ఎందుకు పడింది ?

మనిషి ప్రకృతి సహజంగా బాల్యదశ నుండి — యవ్వనంలోకి ప్రవేశిస్తాడు ఆ పీరియడ్‌లో ఆకర్షణకి లోనుగావడం సహజం ఆడ, మగ ఒకరి నొకరు ప్రేమించుకోవడం అతి సామాన్యంగా జరిగే ప్రక్రియ

వారి మనసులు స్వచ్ఛంగా, సహజంగా కలిసాయో లేదో చూడాలికాని, కుల మతాల తేడాలతో, అంతస్థుల విభేదాలతో వారిమధ్య భేదాలు కల్పించడం సమంజసమా — ?

మనస్ఫూర్తిగా యిష్టపడి, వారితో జీవితాంతం కలిసి గడపాలని — ఒక జీవిత భాగస్వామిని ఎన్నుకుంటాము దాన్ని 'ప్రేమ' అనే పేరుతో పిలుస్తాం

అలాంటి వ్యక్తే — కరుణ ఆమె జీవితాన్ని ఎంతో సుందరంగా ఊహించుకుంది కాని, జరిగిం దేమిటి ?

ప్రేమే నేరమా ?" మూర్తి గొంతు ఆవేశంగా పలికింది ★

మూర్తి మంచి మనస్సుని స్తుతిస్తూ, అతని వ్యక్తిత్వాన్ని ఆకాశానికెత్తుతూ— అతడిని దైవ సమానుడిగా పోల్చింది కరుణ

"ఏమిటి సార్— ఈ ఉత్తరం ? నాకేం అర్థంకాలేదు " అయోమయంగా అంది

మూర్తి మందహాసం చేసాడు

"అర్థం కావాలంటే — ముందు జరిగిన కథ తెలుసుకోవాలి "

"చెప్పండి " అంది రేఖ రకీమని — నాదేం ఆలస్యం లేదన్నట్లుగా

"కడుపులో కాస్త పుడ్డు పడాలి ఎలకలు మరీ రన్నింగ్ రేసు చేస్తున్నాయి, శ్రీమతీ "

తన తొందరపాటుకి రేఖ సిగ్గుపడింది

"సారీ ! పదండి వడ్డిస్తాను " అంటూ, డైనింగు రూంకేసి నడిచింది

ఓ ముప్పైనిమిషాల సమయం దొర్లిపోయింది

సీన్ బెడ్‌రూంకి మారింది

మూర్తి సిగరెట్టు వెలిగించాడు

అతని ఆలోచనలు గతంలోకి, రెండేళ్ళ వెనక్కి పరుగెత్తాయి

అప్పుడు తనింకా బ్రహ్మచారి

ఈ రోజున ఓ గవర్నమెంటు హాస్పిటల్‌లో నర్సుగా ఉంటూ, రోగుల సేవ చేసుకుంటూ, తన కాళ్ళమీద తను నిలబడి, తన బిడ్డని పోషించుకో గలిగే స్థితిలో వున్న కరుణ —

రెండేళ్ళ క్రితం ?

మూర్తి మనసు బరువెక్కింది

* * *

పత్రికా ప్రపంచంలో ఓ నూతన చరిత్రని, జర్నలిజం ఫీల్డ్‌లో సంచలనాన్ని సృష్టించి, అన్ని రంగాల ప్రజల్లోను దుమారం లేపిన వ్యక్తి — అరుణ్ శౌరి ఆయన సాహసం, దాగివున్న నిజాల్ని వెలికి తీసి, వెలుగులోకి తీసుకొచ్చిన ఆయన నిర్వ యత్నం — నన్ను ముగ్ధుణ్ణి చేసాయి అప్పుడే ఆ వృత్తిపట్ల నాకు గౌరవంతోపాటు, నేను కూడా ఆ రంగంలోకి ప్రవేశించాలనే అభిలాష మొలకెత్తింది పెద్దవాళ్ళంతా అభ్యంతరాలు చెప్పినా నేను విని పించుకోలేదు జర్నలిజంలో డిప్లొమా సంపాదించి— నా అభీష్టం నెరవేర్చుకున్నాను

ఆ తరువాత నాకు ఓ దినపత్రికలో రిపోర్టర్ వుద్యోగం దొరికింది నేను కోరుకున్న వృత్తి నా ప్రవృత్తికి అనుగుణమైన పని నా విధులు నిర్వహిం చడంలో ఎంతో చురుగ్గా వుండేవాడ్ని

సమాజంలో చొచ్చుకుపోయి, ప్రజల మధ్య సన్నిహితంగా తిరుగుతూ, వారి సమస్యలు, సాధక బాధకాలు క్షుణ్ణంగా పరిశీలించేవాడిని వాటిని పేపరులోకి తీసుకొచ్చి, తద్వారా ప్రజానాయకులు, అధికారులు వాటి గురించి ఆలోచించి, వాటి పరిష్కా రానికి పూనుకోవడం ఇలా జరుగుతూ వుండేది

ఆ రోజు

ఓ మినిష్టర్‌గారి సన్మానసభకి వెళ్ళి, వార్తలు సేకరించుకుని వస్తున్నాను అప్పుడు, జన సమ్మర్దం బాగా వుండే ఓ సెంటర్‌లో, రోడ్డు పక్కగా గుమికూడి వున్న ప్రజాసమూహం నన్ను ఆకర్షిం చింది నా స్కూటర్‌ని ఓ పక్కగా పార్కుచేసి, దిగేను

ఏదైనా న్యూస్ దొరక్కపోతుందా — అనే వృత్తి పరమైన ఆసక్తితో, గుంపు లోపలికి చొచ్చుకుపోయాను అప్పుడు ఓ ముసలతను —

"ఏం బాబూ! నువ్వూ చూస్తావా? ఉచితంగా 'బ్లూ ఫిలిమ్ ' ఊఁ వెళ్ళు త్వరగా !" ఎగతాళిగా అన్నాడు

ఆ మాటల కర్థం — కంటితో నేనా దృశ్యాన్ని స్వయంగా చూసేకగాని బోధపళ్ళేదు అక్కడ పోగయిన జనం — వందకి తక్కువుండరు అంతా మగాళ్ళే! అప్పుడు సమయం ఉదయం పదిగంటలవు తోంది అంటే — ఆఫీసులవాళ్ళు, కాలేజీలవాళ్ళు చాలా హడావుడి సమయం అది అయినా — ఆ విషయం పట్టించుకోకుండా, అంతమంది జనం వలయాకారంలో మంత్ర ముగ్ధుల్లా చూస్తున్న ఆ దృశ్యం —

ఓ ఆడది ! ఆమె పిచ్చి

అయితేనేం — ఆమె యవ్వనంలో వుంది పాతికేళ్ళ వయసు జుట్టు విరబోసుకుని కూర్చుంది తనలో తనే మాట్లాడుకుంటోంది నవ్వుతోంది ఏడుస్తోంది పళ్ళు కొరుకుతోంది ఎవర్నో తిట్టు కుంటోంది, ఆమెకి కాస్త దూరంలో ఓ రెండేళ్ళ పాప ఆ పిచ్చిదాని కూతురు కాబోలు ఆ మట్టిలో ఆడుకుంటోంది

ఆమె అలా దయనీయ స్థితిలో వుంటే, కరుణతో గుండెలు కరగవలసిందిపోయి —

పేలికలు, పేలికలుగా వ్రేలాడుతున్న ఆమె దుస్తులు బహిర్గతం చేసే నగ్నత్వపు అందాలని చూట్టానికి కక్కుర్తిపడుతున్న మగజాతి కనువిందు చేసుకున్న వాళ్ళు అయిష్టంగా కదులుతున్నారు వారి స్థానాన్ని భర్తీ చేస్తున్నారు కొత్తగా వస్తున్న వాళ్ళు

ఏ ఒక్కరూ ఆ అభాగిని గురించి అరక్షణం కూడా సానుభూతిగా ఆలోచించడం లేదు ఉద్రేకంతో వారి వయసులు చలిస్తున్నాయేకాని — ఉదారంతో, ఔదార్యంతో వారిమనసులు స్పందించటం లేదు

అక్కడ నేను జర్నలిస్టుగా నా కర్తవ్యం నిర్వర్తించేను

ఆ స్త్రీని, పాపని కలిపి, విడివిడిగాను కొన్ని ఫొటోలు తీసుకున్నాను

ఆ తరువాత రెండురోజులకి మా పత్రిక ఫ్రంట్ పేజీలో ఆ ఫొటోలు, ఓ చిన్న వ్యాసం అది కూడా నేనే రాసాను ఎంతో ఆవేదన పడుతూ, రాత్రంతా శ్రమించి ఆ వ్యాసం తయారుచేసాను ఒక్కమాటలో చెప్పాలంటే — ఈ సమాజాన్ని నిలదీసి, సూటిగా ప్రశ్నించేను ఆ అనాథకి ఏదో ఒక ఆధారం దొరుకుతుందని నాకు నమ్మకం కలిగింది

కాని, నా ప్రయత్నం ఫలించలేదు నేను అనుకున్న రీతిగా ముందుకొచ్చిన వారెవ్వరూ లేరు

నాలో ఏదో పట్టుదల తలెత్తింది

ఆ రోజు — పత్రికా రచయితగా ఆమె జీవితాన్ని పదిమందికి తెలిసేలా చేసి, ఆమెకి తోడ్పడదా మనుకున్నాను ఫెయిలయ్యాను

ఈ రోజు — నాలో దాగివున్న మానవత్వం నిండిన మనిషి వెలుపలికి వచ్చి, అందుకు పూను కున్నాడు

నా ఆలోచనకి ట్రాఫిక్ ఎస్సై వింతగా చూసాడు

ఈ నా నిర్ణయం వెనక మరే ఆలోచనాలేదు —











నాకు నలుగురిలో గుర్తింపు రావాలని, పేరు, ప్రతిష్టలు సంపాదించి, కీర్తి కిరీటం శిరసున దాల్చాలని! జస్ట్ ఏ సాఫ్ట్ కార్నర్ ఇన్ మై హార్ట్ – ఈ బాధ్యతని నా తలకెత్తుకునేలా చేసింది

ఆమె 'ఎర్రగడ్డ' హాస్పిటల్‌లో చేర్పించడానికి – నా పలుకుబడి కొంత ఉపయోగించవలసి వచ్చింది ఆమె పాపని 'చైల్డ్ కేర్ సెంటర్'కి అప్పగించేను

నెల రోజులపాటు ఆమెని వివిధ పరీక్షలు చేసారు డాక్టర్లు వారు చెప్పిన వార్త నన్నెంతగానో సంతోషపరచింది ఆమె మామూలు మనిషి కావడానికి అవకాశాలు ఉన్నాయి

ఏ పరిస్థితులు ఆమె మతిని చెదరగొట్టాయో కాని – ఆమె ఓ గౌరవనీయ కుటుంబానికి చెందిన, అయినింటి ఆడపిల్లని స్పష్టంగా తెలుస్తోంది బాగా చదువుకున్నదానిలా వుంది

ఆమె ఎవరు? ఆమె కథ ఏమిటి? ఏ పరిస్థితుల కారణంగా ఆమె ఇంత హీన, దీన స్థితికి వచ్చింది? అసలామె ఏ ప్రాంతపు మనిషి – ??

చాలా కాలం వేచివుండవలసి వచ్చింది ఈ వివరాల కోసం ఆ తరువాత కూడా – అన్ని వివరాలు తెలియలేదు కేవలం రెండే –

ఆమె పేరు, ఊరు

కరుణ పాలమూర్

తక్షణమే అక్కడికి ప్రయాణం కట్టాను పూర్తి వివరాలు అక్కడ దొరుకుతాయనిపించింది

నిజమే నా ప్రయత్నం అక్కడ సక్సెస్ అయింది

* * *

ఓ క్రిస్టియన్ కుటుంబానికి చెందిన అమ్మాయి – కరుణ ఆమెకి తల్లిదండ్రులు లేరు చిన్నతనమండి అన్న జార్జి పెంపకంలోనే పెరిగింది అతనికి చెల్లెలిపట్ల అమిత ప్రేమ ఏ లోటు రాకుండా చూసుకుంటాడు

కరుణ బి ఏ ఫస్టియర్ చదువుతోంది ఆమె శరీరవర్ణం నలుపే అయినా, ఏ ఆకర్షణవల్లో గొప్ప అందంగా కన్పిస్తుంది ఆమె కన్నులు ఎంతో ప్రశాంతంగా, నిర్మలంగా వుంటాయి ఆ చూపులు ఎప్పటికీ చల్లగా, వెన్నెల కిరణాల్లా వుంటాయి

## ప్రేమే నేరమా ?

ముక్కు పుడక ఆమెకి మరో అదనపు ఆకర్షణ

కరుణకి కాలేజి, యిల్లు తప్పితే మరో ధ్యాస వుండదు సినిమాలు, షికార్లు ఏమాత్రం యిష్టపడదు ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడదు ఆదివారాలు యింటి సభ్యులతో కలిసి చర్చికి మాత్రం వెళ్తుంది

వయసు చాలా చిత్రమయినది ప్రేమ అనూహ్యమైనది

మనసుకి కట్టుదిట్టాల్లేవు అది ఈ మార్గంలోనే పయనించాలి, ఈ రకంగానే ఆలోచించాలి అని సిద్ధాంతాలు, సూత్రాలు ఏమీలేవు

రజాక్ కరుణ జీవితంలోకి ప్రవేశించడం – నిజంగా విచిత్రమైన సంఘటన ఆ అమ్మాయి కాలేజీకి వెళ్ళే దారిలోనే వుంది అతని యిల్లు

రజాక్ యిరవైమూడేళ్ళ నవయువకుడు పచ్చని శరీరం నూనూగు మీసాలు సన్నగా, నాజూగ్గా – ఆడపిల్లలా సుకుమారంగా వుంటాడు మగవాళ్ళే అతన్ని చూసి, అలా నిలిచిపోతారు ఇక అమ్మాయిల సంగతి చెప్పేదేముంటుంది?

తమ యింటి ముందునుంచి ప్రతిరోజూ కాలేజీకి నడిచివెళ్తున్న కరుణని చూసాడు రజాక్ ప్రతిరోజూ వచ్చేటప్పుడు, పోయేటప్పుడు ఆమెని చూసేందుకు సమయం కేటాయించేవాడు

ఆ యువకుడిని బలంగా ఆకర్షించింది కరుణ అది ప్రేమగా మారింది

అతను కాస్త ముందడుగు వేసాడు ఓ రోజు ఆమెతో మాట్లాడేందుకు ప్రయత్నించేడు కాని, ఆమె బెదిరిపోయింది భయపడింది అతనికా అవకాశం చిక్కలేదు

రజాక్ మర్నాడు ధైర్యంగా కరుణ వాళ్ళింటికి వెళ్ళాడు అప్పుడు యింట్లో జార్జి వున్నాడు అతనితో తన మనసులో మాట విప్పి చెప్పాడు రజాక్ నిర్భయంగా, నిజాయితీగా తన ప్రేమని వెల్లడిచేసాడు

జార్జి తన చెల్లెలిని బయటకు పిలిచి అడిగేడు

ఆకుచాటు మొగ్గలా పెరిగిన కరుణకి అసలు ఓ స్వంత అభిప్రాయం అంటూ వుంటుందా? అలాగే చెప్పిందామె జవాబు

జార్జి ఎంతో నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నాడు

"మా చెల్లెలు నిన్ను యిష్టపడి వుంటే – అప్పుడేం చేసేవాణ్ణో కానీ, మిస్టర్! ప్రస్తుతం అలా జరగనందుకు సంతోషంగా వుంది సో, ప్లీజ్ గెటవుట్ నా!"

"ప్లీజ్ సార్! నన్నర్థం చేసుకోండి కరుణని నేను చాలా యిష్టపడుతున్నాను సార్! దయచేసి మీరు మా పెళ్ళికి అనుమతించాలి" చాలా దీనంగా ప్రాధేయపడ్డాడు రజాక్

"మై డియర్ జంటిల్‌మాన్! ఇందాక యింగ్లీషులో చెప్పాను ఇప్పుడు తెలుగులో చెప్తున్నాను మర్యాదగా యిక్కడ్నుంచి కదులు." మరోమాటకి తావివ్వకుండా అన్నాడు జార్జి

కులాభిమానం – అతన్నంత పట్టుదలగా వుంచింది మూర్ఖుణ్ణి చేసింది తమ వారిలో ఈపాటి మగాడే దొరకడా దానికి – అనుకున్నాడు

అతనికి చెల్లెలిమీద ప్రేమకంటే – 'క్రిస్టియానిటీ' మీద ఎక్కువ ప్రేమ ఏసుప్రభువు అతని ఆరాధ్యదైవం బైబిల్ పఠనం అతని దినచర్య

ఆ రోజు నుంచి అతను చెల్లెలిమీద ఓ కన్ను వేసి వుంచాడు

నిజాయితీ వున్న ప్రేమికుడు అవాంతరాలెదురైనా వెనుకంజ వేయడు అది రజాక్ విషయంలో ఋజువయింది

అతని మనసులోంచి తొలగిపోలేదు కరుణ ఆమె పట్ల మునుపటి ప్రేమ అలాగే వుంది ఆమె మనసులో స్థానం సంపాదించుకుంటే – ఎన్ని అడ్డంకులైనా ఎదుర్కోవచ్చును

ఆమె పట్ల అతని ఆరాధన పెరిగింది ప్రతిరోజూ ఆమెకి మూగ చూపులతో విన్నపాలు చేసుకునేవాడు

కరుణ ఎప్పటికైనా తనని కరుణిస్తుందని అతని నమ్మకం

తన ప్రణయదేవత మనసు కరిగి, తనకి చేయి నందిస్తుందని ఆశ

కొన్ని రోజులు గడిచేక అలాగే జరిగింది ఆ యువకుని నమ్మకం, ఆశ ఫలించేయి కరుణ కరిగింది అతని స్వచ్ఛమయిన ప్రేమకి దూరంగా వుండలేక పోయింది

# కేవలం ఒక్క డెట్ బిళ్ళలోనే వుంది సాల్వెంట్ పవర్

## బట్టలను అన్నిటికంటే ఎక్కువ తెల్లగా ఉతుకుట కొరకు

క్రొత్త
సాల్వెంట్
పవర్

det
NEW SOLVENT POWER
detergent washing cake

జిడ్డును
తీసివేసే శక్తి



మురికిని
తొలగించే శక్తి



మిరమిట్లు
తెలుపును ఇచ్చే శక్తి



**మరే ఇతర డిటర్జెంట్ బార్ లేక బిళ్ళ దీనికి సాటి రాదు**

# హైదరాబాద్ నోట్‌బుక్

## వేరోన్ బనీ వేరోగన్

శ్రీ గుజరాతీ సేవామండల్ వజ్రోత్సవం సందర్భంగా రవీంద్రభారతిలో మార్చి 7వ ప్రదర్శించిన గుజరాతీ నృత్య నాటకం "వేరోన్ బనీ వేరోగన్" (వైరి విరాగిణి అయింది) సహృదయులను బాగా ఆకర్షించింది. విలువయిన నేపథ్యంతో 70 పాత్రలతో అందమైన నృత్యాలతో, శ్రావ్యమైన సంగీతంతో, నైపుణ్యం విలసిల్లే నటీనటులతో కనులను మిగేలు మనిపించే ఈ నృత్య నాటకం ఆకర్షకం ఎందుకు కాదు? నాటకేతివృత్తం ఇది. కానన్ అనే కన్య తను బ్రాహ్మణకన్య అనే నమ్మకంతో పెరుగుతుంది. మానెక్‌రాయ్ అనే మంత్రి కుమారుడు దయారాంను ప్రేమిస్తుంది. వారిద్దరూ సంగీతంలో సవేధ్యాయులు. కానన్ తన తల్లి రాజదర్బారు దేవదాసి అయిన జమునాబాయి అని తెలుసుకొని విస్తుపోతుంది. బలవంతాన కానన్ కూడ ఆ వృత్తి చేపట్టక తప్పలేదు. కానన్ ఇక దక్కదని దయారాం ఆత్మహత్య చేసుకొంటాడు. మానెక్‌రాయ్ కానన్‌ను బాధపెడుతాడు. కానన్ కసితో అతనిని అపఖ్యాతి పాలుచేస్తుంది. దానితో అతడు తలెత్తలేక ఆత్మహత్య చేసుకొంటాడు. కానన్ పిదప చైతన్య ప్రభువు దయకు పాత్రమవుతుంది. కృష్ణ భక్తురాలవుతుంది. కానన్ రాళ్ళు కరగించే సంగీత విదూషి. కాని ఆమె విరక్తురాలయింది గనుక తన శక్తిని ప్రదర్శించదలచలేదు. అయితే గుజరాత్ రాజు మొహమ్మద్ షా అవహేళన చేయగా గురువు అనుమతితో తన శక్తిని ప్రదర్శిస్తుంది. నటీనటులందరూ అవుత్సాహికులు కాని, వృత్తి కళాకారులకు ఏమాత్రం తీసిపోలేదు. రాసక్రీడ, గర్బనృత్యం మొదలయిన గుజరాతీ నృత్యాలు చాల ఆహ్లాదకరంగా ఉన్నాయి. నాటక దర్శకత్వం కోసం ప్రత్యేకంగా వచ్చిన సంగీత దర్శకుడు భరత్ బచ్, ఆయన సహచరుడు నట్‌వర్ త్రివేదీ, నృత్య దర్శకులు శ్రీ భగవాన్ సార్వి, రిధం స్పెషలిస్ట్ శ్రీ ఎన్ ఇంద్రదేవ్ నాటకాన్ని అత్యంత రంజకంగా రూపొందించారు. కానన్ పాత్ర ధరించిన సోఫియా అమీన్, దయారాం పాత్ర ధరించిన స్వాతీ కడారియా అద్భుతంగా నటించారు. సంగీతం, వాచికం నేపథ్యం నుంచే, పాత్రలు కేవలం పెదవులు కదల్చారు. ఇంతటి చక్కని నృత్య నాటకాన్ని ప్రదర్శించిన గుజరాత్ సేవా మండల్‌ను అభినందిస్తున్నాను.

## జాంబియా ఆకాంక్ష !

జాంబియా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ జె ఎం మ్వాంజా మార్చి 7వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రసంగిస్తూ, 16 సంవత్సరాల జాంబియా విశ్వవిద్యాలయం ప్రపంచంలోని ఇతర విశ్వవిద్యాలయాల అనుభవంతో క్రమబద్ధంగా అభివృద్ధి పొందదలచిందని అన్నారు. వివిధ శాఖల విషయంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంతో దీర్ఘకాలికమైన ఒప్పందం చేసుకోదలచామని ఆయన అన్నారు. భారతీయ విశ్వవిద్యాలయాలు విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలలో చాల పురోగమించాయని ఆయన ప్రశంసించారు. జాంబియా విశ్వవిద్యాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయం పరస్పరం వినిమయ కార్యక్రమాలు ఏర్పాటు చేయవచ్చు. జాంబియా విశ్వవిద్యాలయం తన సిబ్బందిని ఉన్నత శిక్షణకోసం భారతీయ విశ్వవిద్యాలయాలకు పంపవచ్చు అనికూడా ఆయన అన్నారు. సమావేశానికి అధ్యక్షత వహించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ సైయద్ హాషిం అలీ ప్రసంగిస్తూ, ఉభయ విశ్వవిద్యాలయాలు విద్యారంగంలో సహకారానికిగల మార్గాలను గురించి చర్చించవచ్చు అన్నారు.

## శ్రీ ఫరూక్ అబ్దుల్లా ఉద్బోధ:

దీన్ ఇతాలిమీ విద్యాసంస్థ ఏర్పాటుచేసిన ఉత్సవాన్ని మార్చి 27న కాశ్మీర్ ముఖ్యమంత్రి శ్రీ ఫరూక్ అబ్దుల్లా ప్రారంభిస్తూ, దేశ ప్రగతికి హిందూ ముస్లిం సామరస్యం అవసరమని అన్నారు. ఉరుదూ ముస్లిం మతానికి చెందిన భాషకాదని, కొంతమంది ఉరుదూను అణగదొక్కడానికి ప్రయత్నిస్తున్నారని, ఉరుదూ భాషను సామాన్య ప్రజలవరకు తీసుకుపోడానికి కృషి చేయాలని ఆయన కోరారు. కొంతమంది ముస్లింలు ఇస్లాం సూచించిన నియమ నిబంధనలను పాటించడంలేదు. తామొక ప్రత్యేక వర్గానికి చెందిన వారమనుకుంటూ జాతి జీవన స్రవంతికి దూరంగా వుంటున్నారు. ఇది సరైన పద్ధతి కాదు. వివిధ మతలవారు వివిధ రీతులలో ఆలోచిస్తారు. ఇలాటి ఆలోచనలు ఉచితం కాదు. ఇలాటి విడివిడి ఆలోచనలు వున్నంతవరకు భారతదేశం అభివృద్ధి చెందదు. భారతదేశంలోని ప్రజలు ఏ మతానికి, ఏ వర్గానికి చెందినా, వారంతా భారతీయులనేది మొదటి విషయం. ముస్లింలు భారత జాతి జీవన స్రవంతిలో కలిసిపోనంతవరకు భారతదేశానికి చెందినవారు కాలేరు. తాము వేరుగా వున్నంతకాలం వారు ఈ దేశంలో ఒకరుగా కలిసిపోలేరు. అలా కలిసిపోకపోతే, ఈ దేశంలోని ముస్లింలు ఏదో ఒకనాడు అంతరించిపోతారు. మహమ్మద్ ప్రవక్త చూపిన దారిలో నడిచే ముస్లింలంతా భారత జాతి జీవన స్రవంతిలో విలీనం కావాలి. సృష్టికర్త సృష్టించని విభేదాలను మతం పేరిట మానవుడు సృష్టిస్తున్నాడు. మనం హిందువులం, ముస్లింలం అయ్యాముగాని, హృదయమున్న మానవులం కాలేకపోతున్నాం. మతం పేరిట అన్యాయాలు, అక్రమాలు చేయడం మానుకొని, మతం సూచించే స్వచ్ఛమైన దారిలో నడచుకోవాలి. అధికారానికి, డబ్బుకు మనమంతా దాసులమైపోతున్నాం. దేశాభివృద్ధికి హిందువులు, ముస్లింలు, ఇతర మతాలవారు కలిసికట్టుగా పనిచేయాలి. దేశాన్ని మరచిపోయి మతవైషమ్యాలను పెంచుకుంటే, దేశం మరిన్ని ముక్కలైపోయే ప్రమాదం వుంది. దేశం త్వరిత గతిని అభివృద్ధి సాధించడానికి మత ప్రసక్తిలేని మతాతీతమైన గొప్ప ఉద్యమం ప్రారంభించాలి — అని శ్రీ ఫరూక్ అబ్దుల్లా ఉద్రేకంతో ప్రసంగించారు. ముఖ్యమంత్రి శ్రీ రామారావు ముఖ్య అతిథిగా పాల్గొని, మత ప్రసక్తి లేని సుస్థిర ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి కృషి చేస్తున్నారు. దేశాభివృద్ధి ప్రజలందరిపై ఆధారపడి వుందన్నారు. ఈ ఉత్సవానికి ప్రిన్స్ ముఫక్కంఝా అధ్యక్షత వహించారు. ఆర్థికశాఖామంత్రి శ్రీ భాస్కరరావు, వక్ఫ్‌శాఖా మంత్రి శ్రీ షకీర్, విధానపరిషత్తు అధ్యక్షుడు శ్రీ ముఖస్సిర్ షా మున్నగువారు ప్రసంగించారు.

మదరాసు సిటిజన్స్ కమిటీవారు మహాశివరాత్రి పర్వదినాన దేశప్రజల సుఖశాంతులకోసం సంగీత రుద్రాభిషేకం చేయించారు. 'శంఖు'తో రుద్రాభిషేకం చేస్తున్న శ్రీ గాయత్రి స్వామివారిని, శ్రీ టి వి కె శాస్త్రిగారిని చిత్రంలో చూడవచ్చు.



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర పత్రిక వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర పత్రిక వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీపత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ళ లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ ఏలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను— కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు

సం॥

## హైదరాబాద్ నోట్ బుక్

**ఉర్దూ సంపాదకుని ఆశ ·**

దేశంలోని విద్యా ప్రణాళికలో త్రిభాషా సూత్రం వుంది గనుక ఉత్తర భారతంలోనివారు తమ భాషతోపాటు ఏదో ఒక దక్షిణాది భాషను నేర్చుకోడం అవసరమంటే, దేశ సమైక్యానికి దోహదమవుతుందని చెప్పవచ్చు తెలుగు భాషను కొంతకాలంగా హర్యానాలో నేర్పుతున్నారు ఇటీవల బీహారు రాష్ట్రం కూడ నేర్పడానికి నిర్ణయించింది తక్కిన రాష్ట్రాలూ క్రమంగా ఏదో దక్షిణాపథ భాషను నేర్చుకోవాలని చట్టాలు చేయవచ్చు ఇదంతా బాగానేవుంది కాని, ఆంధ్రప్రదేశ్ ఉరుదూ పత్రిక సంపాదకులు శ్రీ మాలిక్ మహమ్మద్ అలీ ఖాన్ మార్చి 29న చేసిన ప్రకటన మాత్రం నాకు అత్యాశగానే అనిపిస్తుంది పాకిస్తాన్ రేడియో కార్యక్రమాలలో తెలుగు కార్యక్రమాన్ని ప్రవేశ పెట్టాలని ఆయన తమ ప్రకటనలో కోరారు పాకిస్తాన్ విశ్వవిద్యాలయాలలో ఏదో ఒకదానిలో తెలుగు విభాగం ప్రారంభించవలసిందిగాను ఆయన కోరారు మన దేశంలోని విశ్వవిద్యాలయాలలోనే తెలుగు విభాగాలు లేవు ఉన్నవాటిలోను తగినంత మంది విద్యార్థులులేక "నాయనా తెలుగు చదువుకో! బాబూ తెలుగు చదువుకో!" అని బతిమాలవలసి వస్తున్నది గదా! అదేం, కూడు పెడుతుందా, గుడ్డ ఇస్తుందా? — అని విద్యార్థులు భీష్మించుకోగా, సమైక్యంకోసమని, సంస్కృతికోసమని అధికారులు బ్రతిమాలడం మనకు అనుభవమే అలాంటప్పుడు పాకిస్తాన్‌లో తెలుగు పెట్టినా [illegible] ఏమిటో! నిన్న మొన్నటివరకు, అంతెందుకు నేడు కూడ ఆంధ్రప్రదేశ్ రాజధాని అయిన హైదరాబాద్‌లోని ఆంధ్రేతరులు తెలుగు నేర్చుకుంటున్నారా? వారికి తెలిసిన తెలుగు కూలీలతోను, తమ బోయీలతోను మాట్లాడే తెలుగు వంద పదాలతో తమ పనులు నిర్వహించుకొంటారు వారు కొన్ని తరాలుగా మన రాష్ట్రంలో వున్నా తెలుగును పరాయి భాషగానే చూస్తున్నారు అలాంటప్పుడు, పూర్తిగా ఇస్లాం సూత్రాలపై నడుస్తున్నామనుకుంటున్న పాకిస్తాన్‌కు తెలుగుతో పనిఏమిటి? తెలుగును నేర్పడంవల్ల దానికి కలిగే లాభమేమిటి?

**ఉపశ్రుతి :**

"చూచారా, చివరకు దొంగలరాణి పూలన్‌దేవి కూడ పత్రికలవారి వ్రాతలన్నీ అబద్ధాల బూతులన్నది" అన్నారు మిత్రులొకరు నాతో "ఔనౌను రాజకీయ నాయకులు ఇలాటి యోగ్యతా పత్రాలు ఇదివరకే ఇచ్చారు ఇక ఇవ్వవలసిన వారెవరా అనుకున్నాను బందిపోటు దొంగలు కూడ ఇచ్చారు" అన్నాను నేను

— తిరుమల రామచంద్ర *

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor S Radhakrishna.